# శబ్దరత్నావళిః

శ్రీ గరణీ వైయాకరణ కృష్ణాచార్యేణ విరచితా



సంపాదకః

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఎ.

ప్రిన్సిపాలు, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు




ప్రచురణ

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

# తొ లి ప లు కు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చేపట్టిన గ్రంథ ప్రచురణ కార్యక్రమంలో సంస్కృత గ్రంథ ప్రచురణం కూడా ఒకటి. ఇంతవరకు ఇరవై రెండు సంస్కృతగ్రంథాల్ని ప్రచురించడం జరిగినది. వీటిలో కొన్ని తెలుగు కావ్యాల సంస్కృతానువాదాలు, కొన్ని స్వతంత్రగ్రంథాలు. కొన్ని సంస్కృత కావ్యాలకు తెలుగులో వ్యాఖ్యలు.

శ్రీ గరణి వైయాకరణ కృష్ణాచార్యులుగారు ఇప్పటికి సరిగా నూరు సంవత్సరాల క్రితం 1878వ సంవత్సరంలో శబ్దరత్నావళి రచించి ఉన్నారు. ఇందులో సంస్కృత భాషాభ్యాసం కోసం ప్రయత్నించే వారికి అనుకూలంగా శబ్దాలు మాత్రమే కాకుండా ప్రధానమైన ధాతువులు, సంధులూ, కారకాలూ, సమాసాలూ మొదలైన విషయాలు కూడా శాస్త్రీయ పద్ధతిలో ప్రతిపాదింపబడి ఉన్నాయి. అందుచేతనే ఈ గ్రంథం ఆనాటి పండిత ప్రకాండులైన శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు, శ్రీ యమ్. శేషగిరి శాస్త్రియార్ మొదలగు వారి మన్ననలను అందుకొన్నది. చాలా కాలంనుంచీ అలభ్యంగా ఉన్న ఈగ్రంథాన్ని మళ్లీ ముద్రింపించ వలసిందిగా ఎంతోమంది సంస్కృతప్రియులు కోరడంతో సాహిత్య అకాడమీ దీని సంపాదన కార్యక్రమాన్ని శ్రీ ఉడాలిసుబ్బరామ శాస్త్రిగారికి వప్పగించడం జరిగింది. వారు సంధి ప్రకరణం, విభక్త్యర్థ ప్రకరణం మొదలైన ప్రకరణాలకి తెలుగు అనువాదం కూడా ఇచ్చి, మూలంలో లేని స్త్రీ ప్రత్యయ ప్రకరణాన్ని కూడా చేర్చి దీన్ని సంపాదించి ఇచ్చినారు. అందులకు సాహిత్యఅకాడమీ వారికెంతో కృతజ్ఞతాబద్ధమై ఉన్నది. దీనికి విషయసూచిక, వివిధానుబంధములు చేర్చి దీని ముద్రణ సమయమున తోడ్పడిన డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞత తెలియజేస్తున్నాను. ఈ గ్రంథం సంస్కృతాభ్యాసం చేసేవారి మన్ననలు పొందగలదని ఆశిస్తున్నాను.

హైదరాబాదు
1-1-78

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# ఉపోద్ఘాతము

"శిక్షా వ్యాకరణం ఛందోనిరుక్తం జ్యోతిషం తథా ।
కల్పశ్చేతి షడఙ్గాని వేదస్యాహుర్మనీషిణః ॥

అని చెప్పఁబడిన వేదాఙ్గములలో వ్యాకరణము రెండవది. దేవభాషకు వ్యాకరణ మెంత ప్రధానమైనదో, యా విషయము "సంస్కృత"మను పేరుతోడనే విదితమగుచున్నది. ఆ దేవభాష భూతలమునకు వచ్చి యపశబ్దముల తోఁగూడి సంస్కార హీనముకాగా, దానిని వ్యాకరణశాస్త్రము సంస్కరించినది. గాన నయ్యది నేడు సంస్కృతమై విరాజల్లుచున్నది. ఇతర భాషల కట్టి సంస్కారమున్నను లేకపోయినను నది యంత గణింపఁ దగినదికాదు. కాని దేవభాషకట్టి సంస్కారము చాల ముఖ్యమై యుండినందువలన ప్రాచీన కాలమునుండి పెక్కండ్రు అనగా ఇంద్రచాన్ద్రాది వ్యాకరణ కర్తలు తమ తమ వ్యాకరణములను వెలయింపఁజేసి దేవవాణీ వధూటిని నవనవ సంస్కారములతో శుద్ధిఁజేయుచు వచ్చిరి. చివరకు పాణినిమహర్షి యవతరించి పరమేశ్వర ప్రసాదమున వారిఢక్కానాదము నుండి వెలువడిన సూత్రజాలములతో, తత్పూర్వములగు నైంద్రాది వ్యాకరణముల సారములను గ్రహించి యతి విస్తృత మగు వ్యాకరణ దర్శనమును వెలయించిరి. ఇతర భాషలలో వ్యాకరణము భాషా సంస్కారమున కొక యుపకరణముగా నున్నది. కాని సంస్కృతమున నది యుప కరణమేగాక ప్రత్యేక శాస్త్రమై వెలయుచున్నది. పాణిని కాలము నాటికి నీ శాస్త్రము చాల విస్తృతముగాఁ బెరిగినది. పాణినికిఁ బూర్వము సరియైన వ్యవస్థలేక యస్తవ్యస్తమై, భిన్న భిన్న ప్రస్థానరాద్ధాన్తములతోఁగూడి యేకగ్రీవమగు సిద్ధాన్తము లేక యుండి యఖండత క, ఖండ ఖండములుగా నుండినది. అట్టి వ్యాకరణ ప్రస్థానమును నఖండము గావించి "కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయేనమః" యని చెప్పిన విధముగా వ్యాకరణమునకు సమగ్రతను పాణిని మహర్షి సమకూర్చెను.

"అష్టాధ్యాయి"గా వెలసిన యాపాణిని వ్యాకరణసూత్రములను ఆనుపూర్విగ వ్యాఖ్యానింపఁ దొడగిన, కాశికా-ప్రక్రియా కౌముదుల నధిగమించి

శ్రీ భట్టోజి దీక్షితులు సూత్రక్రమమును వీడి యర్థాను సారిణిగా సిద్ధాన్తకౌముది యను వ్యాఖ్యను రచియించిరి. అది నేడు పఠనపాఠన సంప్రదాయముల యందనువర్తించుచున్న విషయ మెల్లరకును విదితమే. ఆ సిద్ధాన్త కౌముది యాధునిక యుగప్రభావముచే నల్పమేధస్కులగు బాలుర కందు బాటున లేనందు వలన నిప్పటికి సుమారు వంద సంవత్సరముల క్రిందట, నాసిద్ధాన్త కౌముది ననుసరించి, సంస్కృత వ్యాకరణమును సమ్ప్రదాయ పద్ధతులను వీడక సుగమముఁగావించుటకై బ్రహ్మ శ్రీ గరణి వైయాకరణ కృష్ణాచార్యులు గారు, శబ్దరత్నావళి, ధాతురత్నావళి యను గ్రంథములను రచియించి సంస్కృత భారతి కెనలేని సేవనుఁగావించిరి. అందు శబ్దరత్నావళి సిద్ధాన్త కౌముదిలోని పూర్వార్ధముతోను, ధాతురత్నావళి యుత్తరార్ధముతోఁడను సంబంధించినవి. పై సిద్ధాన్త కౌముది మున్నగు గ్రంథములు మిక్కిలి ప్రౌఢశైలిలో నుండి భాషకువలసిన వ్యాకరణాంశములను మాత్రమే బోధింపక, శాస్త్రవాదములతో జటిలముగా నుండుటవలన, బాలురకు దురవగాహములు కాన నందలి వాద ప్రకరణములను వర్జించి కేవలము ప్రక్రియకు నుప్రయుక్తములగు నంశములను మాత్రము పరిగ్రహించి, సంప్రదాయ సేతువుల నుల్లంఘింపక లలితశైలిలో భాష కుపయోగించెడి యంశములతో శబ్దరత్నావళిని రచియించిన, శ్రీ కృష్ణాచార్యులుగారు సంస్కృత ప్రపఞ్చ మున కంతటికిని, దానిని మూలముఁగావించుకొనిన దేశభాషా ప్రపఞ్చమునకును నెల్లప్పుడు నభినందనీయులు.

శ్రీ ఆప్టే మున్నగు మహారాష్ట్రి పణ్డితులు సైతము సంస్కృత వ్యాకరణ సుగమీకరణమునకై కృషిఁగావించి గ్రంథములను వ్రాసియున్నారు. కాని యవి మన సమ్ప్రదాయ పద్ధతులనుఁ బాటింపక యాంగ్లేయుల నుద్దేశించి యాంగ్లమందే వ్రాయఁబడియుండుట వలన నవి సామ్ప్రదాయికముగా వ్యాకరణము నేర్చువారికి సమగ్రముగాఁ దోడ్పడవు. శ్రీ కృష్ణాచార్యులవారి ''శబ్దరత్నావళి'' యట్టి కొఱతలనుఁ దీర్చినది.

ఈ శబ్దరత్నావళియందు సిద్ధాన్తకౌముదిలోని ముఖ్యప్రకరణములు సంగ్రహింపఁబడినవి. అని యీగ్రంథ మందలి విషయ సూచికతోఁడనే తెలియనగును. మఱియు నీశబ్దరత్నావళి యందు గురుశిష్య సంప్రదాయ పరమ్పరచేఁ దెలియనగు విషయములు పెక్కులు క్రోడీకరింపఁ బడినవి.

ధాతువులలో ముఖ్యములు, అనగా ప్రయోగ ప్రసిద్ధిఁగలవి యిందుఁ జేర్పఁబడినవి. ఇది చాలదని భావించి కాబోలు, గ్రంథకర్త. "ధాతురత్నావళి" పేర ధాతువులకు ప్రత్యేకమగు గ్రంథమును వ్రాసియుందురు. అదిగాక శబ్దరత్నావళి యందు యాంగ్లభాషలోను ధాతుపాఠములోని ధాతువుల కర్థములను వ్యాకరణమందలి పారిభాషికపదములకు నర్థములను, అకారాది వర్ణ క్రమముతోఁడను, పుట సంఖ్యలతోఁడను, శబ్దానుక్రమణికను నేర్పఱచి యట్టిశబ్దములకు నాంగ్లమున నర్థములను సమకూర్చిరి. ఈ రచనావిధామునగాని, సఙ్గ్రహణ విధానముకాని, యొక సంక్షిప్తమార్గమున జరిగి యనవసరమగు గ్రన్థ విస్తృతినిఁ దొలగించినది. వీరు రచియించిన రెండు గ్రంథములును, నేటి యాధునిక యుగప్రభావముచే సమ్ప్రదాయములను మఱచుచున్నవారికి నా సమ్ప్రదాయములను స్మరింపఁజేయుచు, మౌలికసిద్ధాన్తముల వంక, వారి దృష్టిని మఱలింపగలవని యాశింపవచ్చును.

ఈ శబ్దరత్నావళియందు సిద్ధాన్తకౌముది యందలి పెక్కు ప్రకరణములు సంగ్రహింపఁబడినవి. కాని భాషకు చాల ముఖ్యమైన స్త్రీ ప్రత్యయ ప్రకరణము సంగ్రహింపఁ బడలేదు. దీనికి కారణము మృగ్యము. కాని ధాతురత్నావళికి ననుబంధమైన ప్రకాశికయందు. "స్త్రీ ప్రత్యయాన్తాని, ధాతూనా ముపసర్గయోగేన అర్థవిశేషాః......యథాశాస్త్రం సవిస్తరం ప్రదర్శయిష్యామః" అని చెప్పిరేకానియందు "పూతక్రతుః ఇంద్రః తస్యస్త్రీత్యర్థే పూతక్రతాయీ (పూతక్రతాయీ మన్వేతీతిభట్టిః) (౮) కరణ్డః కరణ్డీ కరణ్డికా = (పుష్ప బేదో, భాణ్డబేదశ్చ) (పుట ౧౪) అని యొకటి రెండు శబ్దములను మాత్రమే స్త్రీప్రత్యయాన్తములుగా నుదాహరించిరి. కాని యాప్రకాశికయందు ప్రకరణాన్తరములకు సంబంధించిన ప్రయోగములకుఁ దగిన సిద్ధరూపములు పెక్కులు కానవచ్చుచున్నవి. మఱియు నీ శబ్దరత్నావళియందు భాషకు మిక్కిలి యుపయోగకరములగు నాత్మనేపద పరస్మైద ప్రక్రియలతోఁబాటు ఉణాదులు, ఉత్తరకృదన్తము, వైదికప్రక్రియ స్వరప్రక్రియలును సంగ్రహింపఁ బడలేదు.

వీనిలో స్త్రీ ప్రత్యయములు తక్కిన ప్రకరణముల కంటె చాలముఖ్యములు కాన దానిని సంస్కృతమున సంగ్రహించి యాన్ధ్రానువాదముతో దీనికి జోడించితిని. తక్కిన ప్రకరణములు బాలుర కవసరము లేనందువలన, శబ్దరత్నావళిని జాగుచేయక ముద్రింపవలసి వచ్చుట వలనను, నా ప్రకరణ

ములను వెంటనే సంస్కృతమున సంగ్రహించి యాన్ధ్రానువాదముతో దీనికి జతపఱుప నవకాశము లేకపోయినది. ఈ శబ్దరత్నావళి యొక్క పునర్ముద్రణ యందు వీడిపోయిన పై ప్రకరణములను, సంస్కృతమున సంగ్రహించి యాన్ధ్రానువాదముతో జోడించుట యవసరము. అట్లు చేసిననే శబ్దరత్నావళి సమగ్రమై సర్వాఙ్గ సుందరముగా శోభిల్లఁగలదు. శబ్దరత్నావళి యందు గ్రన్థకర్త, విభక్త్యర్థప్రకరణమును (కారక ప్రకరణమును) అనుష్టుప్ శ్లోకము లతో వ్రాసిరి. వాక్యరూపమున నున్నప్పుడుగూడ నివి క్లిష్టములై యుండగా నిక శ్లోకరూపమున నున్న యివి యన్వయ సాపేక్షములై యింకను క్లిష్టములై యుండఁగలవు. కాన వాక్యరూపమున, కారకప్రకణమును వ్రాసి దాని నాంధ్రీ కరణతో దీనికి జోడించితిని.

వంద సంవత్సరములనాటి శబ్దరత్నావళిలోని సంస్కృత వివరణము, నాటి విద్యార్థులకు సరళమై, సులభమై యుండవచ్చును. కాని యది నేటివారికి దుర్గ్రాహముగానుండి, యందుబాటులో లేనందువలన పై రెండు ప్రకరణములకు వలెనే, యితర ప్రకరణములకును నాంధ్రమున వివరణము వ్రాసితిని.

కేవలము వ్యుత్పత్తి ప్రధానములైన తద్ధితాది వృత్తులకు వివరణము అనవసరము గాన, గ్రంథకర్త యిచ్చిన విగ్రహ వ్యుత్పత్తులే చాలును కాన వానికి నాంధ్ర వివరణములును వ్రాయలేదు. ఈ యనువాద సహాయముతో చాలవరకు సంస్కృత వ్యాకరణమును స్వయముగ నేర్చుకొనవచ్చును. కాని నెమ్మదిగా గ్రంథములోని ఘట్టములను క్రమబద్ధముగా నభ్యసింప వలయును. రెండుమూడు తడవలు, అనువాదమును సావధానముగ పరికించవలయును. అప్పుడు, ఇందీయఁబడిన యుదాహరణములతో నన్వయించుకొనిన విషయము బోధపడును ఈ సందర్భమున నొక విషయము చెప్పవలసి యున్నది.

సంస్కృతమున చిరకాలమునుండి సిద్ధాన్తకౌముది ననుసరించి బాలోప యోగి వ్యాకరణ గ్రంథములు రచియింపఁబడినవి. అందు సిద్ధాన్త కౌముదిని సంగ్రహించి రచింపఁబడిన లఘుసిద్ధాన్తకౌముది, లఘుకౌముది, లఘుపాణినీ యము మున్నగునవి ప్రసిద్ధములు ఈ గ్రన్థము లేవియు ననుకొనినంత ప్రయో జనముఁ జేకూర్పలేక పోయినవని భావింప వలసి యున్నది. ఏల యనగా నివి యన్నియు మూలగ్రంథమైన సిద్ధాన్త కౌముది యందలి కొన్ని సూత్రములను

ఈ శబ్దరత్నావళిని రచియించుటలో గ్రంథకర్త చేఁబట్టిన విశిష్టమగు శైలి ప్రశంసిపఁదగి యున్నది. ముఖ్యముగా నిది సఙ్గ్రహణ విధానమునకుఁ జెందినది. గ్రంధకర్త లఘుకౌముద్యాది గ్రంథకర్తల వలెఁగాక, సిద్ధాన్త కౌముదిలోని యుపయోగకరములగు విషయములను సమగ్రముగాఁ జక్కఁగా వివరించుటకై శబ్దరత్నావళి యనుపేర, స్వతంత్రమార్గమున గ్రంథమును రచియించి, యందు మూలముతో విషయముల యందు మాత్రమే కట్టుబడి శైలియందు స్వతంత్రతను వహించి సరళమార్గమునుఁ జేపట్టెను. ఇదియే వారి విశిష్ట విధానము. ఈ విధానమే ప్రాచీనశాస్త్ర గ్రంథములను సఙ్గ్రహరూపమున సరళమార్గమున వెలికిఁ దెచ్చుటకు సాధనము. తొలుత నిట్టి సఙ్గ్రహవిధానమున శాస్త్రగ్రంథములను రచియించినచో వానికి నాన్ధ్రమున తగు పరిమితితో వివరణములను వ్రాసిన ప్రజల కవి మిక్కిలి యందుబాటులో నుండగలవు. నేడు భాషానువాదము లేని సంస్కృత గ్రంథముల ప్రచురణ కొలది పండితులుకు మాత్రమే యుపయోగకరము గాని తదితర ప్రజలకు దాని యుపయోగము చాల విరళము కాన ప్రతిసంస్కృత గ్రంథమునకు ననువాద మవసరము.

ఇఁక నింతటి ప్రశంసనీయమగు వ్యాకరణ గ్రన్థమును రచియించిన శ్రీ కృష్ణాచార్యులుగారి చరిత్రనుకొంతవరకు నిఁట వ్రాయవలసి యున్నది.

శ్రీకృష్ణాచార్యులుగారు 1886 ప్రాంతమున చెన్నపురియందలి క్రైస్తవ కళాశాలయందు కర్ణాటక భాషకుఁ బ్రధానోపాధ్యాయులుగ నుండిరి. వీరు మైసూరు రాష్ట్రమందలి "పరగి" యనఁబడు ప్రదేశమందలి గరణియను గ్రామమునకుఁ జెందినవారు. వీరి తండ్రిగారు తిమ్మణాచార్యులు. వీరు శ్రీ మదానన్దతీర్థ భగవత్పాదుల శిష్యులు. ఈ తిమ్మణాచార్యులుగారు మైసూరు నందలి శ్రీమద్వైయాకరణ వ్యాసకృష్ణాచార్యుల సన్నిధియందు మహాభాష్యము నధ్యయనముఁ గావించిరి. వీరివద్దనే వీరిపుత్రులైన శబ్దరత్నావళి కర్త శ్రీ కృష్ణాచార్యులు గారు సిద్ధాన్త కౌముద్యాది వ్యాకరణ గ్రన్థముల నభ్యసించిరి. వారియాజ్ఞచేతను, చెన్నపురీ వాస్తవ్యుల ప్రార్థనచేతను, శ్రీ వైయాకరణ కృష్ణాచార్యులవారి గ్రంథము రచియించిరి.

వారు తమ శబ్దరత్నావళిని. తెనుగు లిపియందు ముద్రించుటగూడ యొక గొప్పవిషయము. వారు కర్ణాటకులుగనుండి దీనిని కర్ణాటక లిపి

యందు ముద్రింపక దీనిని తెలుగు లిపియందు ముద్రించి తమ యుదారబుద్ధినిఁ బ్రకటించిరి. ముఖ్యముగా నాంధ్రలోకమునకు గొప్ప యుపాయనము నొసంగిరి. నాడు దక్షిణ దేశమునందు సంస్కృత లిపికి ప్రచారము తక్కువగానుండుట వలన నీ శబ్దరత్నావళి సంస్కృత లిపియందు ముద్రింపఁ బడియుండదు. అది సంస్కృతమునందు ముద్రింపఁ బడియున్నచో, నీ గ్రంథమునకు యావద్భారత ప్రచారము తప్పక యుండి యుండెడిది. పునర్ముద్రణమున దీని మూలభాగమును, పరిత్యజింపఁబడిన సిద్ధాన్తకౌముదీ ప్రకరణ సఙ్గ్రహములతో సంకలనముఁ గావించి సంస్కృత లిపియందు ముద్రించుట సముచితమని భావింతును.

ఇట్టి మహోపయోగముతోఁ గూడిన శబ్దరత్నావళికి నాంధ్రానువాదముతో ముద్రణమావశ్యకమని, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమికి, అధ్యక్షులవారగు డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికిని, కార్యదర్శిగారైన శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు B.A.B.L.గారికిని విన్నవింపగా, వారును దయతో నా విన్నపము నాలకించి, యీ విషయమును సంస్కృతమునకు సంబంధించిన సలహా సంఘమునందుంచి యనుమతింపఁజేసి, ముద్రించి యావదాంధ్ర ప్రదేశ సంస్కృత ప్రజకు గొప్పకానుకను ప్రసాదించినందులకు వారికిని, అకాడమికి సంబంధించిన సంస్కృత సంఘమునకును, కార్యనిర్వాహక సంఘమునకును హృదయపూర్వకములగు కృతజ్ఞతల నందఁజేయుచున్నాను. మఱియు నీగ్రంథ ముద్రణకాలమునందు, మూలానువాదముల యందలి దొసంగులను దిద్దుటతోఁ బాటు, దీని ప్రూఫులను జాగ్రత్తగాచూచి స్ఖాలిత్యములులేక దీని ముద్రణకు తోడ్పడిన శ్రీయుతులు డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుఁడుగారు, M.A. Ph.D (Reader in Sanskrit, Osmania University) గారికిని కృతజ్ఞతల నావిష్కరింతును. ఈ గ్రంథమందలి మూలభాగమునఁగాని యాన్ధ్ర వివరణమందుఁగాని యేవేని దొసంగులున్న పాఠకలోకము క్షమించి దయచేసి తెలిపిన పునర్ముద్రణమున వానిని సవరించుకొనఁ గలము.

ఇట్లు
బుధజన విధేయుఁడు

1-1-1978

ఉడాలి. సుబ్బరామశాస్త్రి
Principal, Veda & Sanskrit College, Nellore

## PREFACE TO THE FIRST EDITION.

The books hither to published on inflexon of Nouns and Conjugation of Verbs, being defective in the arrangement of their parts, many beginners of the Sanskrit language have felt great difficulty in mastering them up. We have known many instances in which the students have given up studying the Sanskrit lanuguage in dispair. Besides labour, they had to spend, quite unnecessarily, much of thier time in committing to their memory, pages after pages treating of words of little or no importance,

To remove these difficulties and to make the subject as simple and familiar as possible, the Author had taken much pains in bringing out this work.

The following points have been kept in view:- Orthography: Easy words of Ajantas and Halantas with new Sanskrit Texts and Examples; different uses of cases, compound-words, and Conjugations of verbs.

As an appendix to help English students a glossary of grammatical terms is also given at the end.

MADRAS THE AUTHOR
November 1878

**Preface to the Second Edition:**

Since the publication of the 1st Edition, I have come to understand that there are certain passages in the first Edition of this books that are too difficult to be easily comprehended by the students; I have in the present Edition, worked out those difficult topics in great detail.

As the first Edition treats of only a few verbs, the students are at times compelled to consult other costly books, which are not within the reach of many a student. To obviate this difficulty, rules have been laid down in this Edition, clearly pointing out the mode of deriving the different forms ( in the active Voice ) of nearly four hundred verbs.

An alphabatically arranged Index of all the words treated of their English equivalents has been, further added with a view to facilitate reference to them

In fact, this book has been carefully revised and a good deal of new matter added to it.

I shall feel amply rewarded for the labour I have bestwood on this, if it serves the purpose of those for whom it is intended.

MADRAS, August, 1886. G. V. K.

**Preface to the Third Edition.**

The present Edtion is intended to supply a want greatly felt by the student owing to the absence, in the first two Edtions, of the different passive forms of verbs, to understand which he had to refer to more costly works as Dhaturatnavali, &c. Besides the Passive forms, causals, Desiderivatives, Frequentatives, and PARASMAIPADA-FREQENTATIVES have also been added a few more examples of inflexion of nouns, of conjugation of verbs and of special instances of Samasas and the whole of the Dhatupatha of Panini with explanation.

As a help to the free Sanskrit student some of the original Sutras of Panini have also been added in addition to the explanations. The number of the different roots ending in different terminations has also been fixed. Under these circumstances, it is unnecessary to say that this Edtion has been greatly enlarged.

In spite of the many improvements both in the matter and get up of the work, a low price has been fixed so that it may be within the reach of all.

MADRAS. G. V. K.
May 1892.

**OPINION**

The book called Sabdaratnavali is a work on Sanskrit inflexion and etymology, and contains much useful information for students preparing for University Examinations. It treat of the subjects according to the order of the Siddhanta Kaumudi, and gives without mentioning the Sutras of Panini the most important declensional forms of Nouns, Samasas, Taddhitas, and other suffixes and the conjugations forms of verbs. I hope therefore that the author's well bestowed labours will meet with suitable encouragement from the students of the Sanskrit Language.

M. SESHAGIRI SASTRIYAR, M. A.,
Ag. First San. Asst. Professor,
Presidency College.

3rd September 1886.
Madras.

# ఉపోద్ఘాతః

సన్తి కిల భూయాంసో బాలబోధోపయోగినశ్శబ్దమఞ్జర్యాదిగ్రన్థాశ్చన్నపుర్యాదిషు ముద్రితాః, ప్రకటీకృతాశ్చ తైస్తైః. తేషు గుణదోషగవేషణే సతి బహూని శాస్త్రవిరుద్ధాని, న దృశ్యన్తే చ ప్రకృతోపయోగ్యవశ్యవిజ్ఞేయాని సాధుపదాని చేతి తాన్యసత్కృత్యాభినవరచనాం శాస్త్రసమ్ప్రదాయ శుద్ధ సుబద్ధ పదపుఞ్జ మఞ్జులాం శబ్దరత్నావళి మాశాసానైశ్చన్న నగరీవాసిభి ర్బహుభిః ప్రార్థితస్య, మహిశూర పురవాసి శ్రీమద్వైయాకరణ వ్యాసకృష్ణాచార్య సపర్యా సమధిగత మహాభాష్యస్య, శ్రీమదానన్దతీర్థ భగవత్పాద సత్తీర్థ సంశుద్ధాన్తరఙ్గస్య, పరిగిపురీ సన్నిహిత గరణి గ్రామవాస్తవ్య వైయాకరణ తిమ్మణాచార్యస్య ఆజ్ఞయా తదాత్మజేన. తచ్చరణసేవాసమధినత సిద్ధాన్త కౌముద్యాది గ్రన్థజాతేన, వైయాకరణకృష్ణాచార్యేణ, యథాశాస్త్రం సఙ్గృహ్యాయం గ్రన్థో నిరమాయి. యద్యప్యత్ర బాలబోధోపయోగినో విజ్ఞేయాం శాస్సర్వేఽపి నాదర్శిషత. తథాప్యత్రగ్రన్థే పాణినీయాగమానుసారి నన్ధయః, అకారాది హకారాన్త వర్ణాన్త కారికాణాం యథాక్రమ మజ్ఝలన్త త్రిలిఙ్గేష్వపి సామాన్య విశేష వివేచనక్రమేణ శబ్దరూపభేదాదికం, అవ్యయసమాస కృత్తద్ధితవిభక్త్యర్థతిఙన్త ప్రకరణాని. తత్తత్ప్రక్రియా విశేషాశ్చ నిష్కృష్య ప్రదర్శితా ఇత్యస్తి మహానతిశయః ప్రాక్తనరచనాభ్యః ప్రకృతరచనాయాః. తమేవమామూలచూడం పఠతో గురుముఖాదర్థం విజ్ఞాయాధ్యేతు ర్బాలకస్య గీర్వాణ భాషాభ్యాసస్సుసాధ స్సుగమశ్చ ధ్రువం భవితేతి సర్వమనవద్యమ్.

యద్యత్ర దీర్ఘ విసర్గ బిన్దువర్ణాది స్ఖలితం సుధీభిర్లక్ష్యేత తచ్ఛోధనీయం క్షన్తవ్యం చేతి ప్రార్థ్యతే.

"నృత్తావసానే నటరాజరాజో ననాదఢక్కాం నవపఞ్చవారమ్,
ఉద్ధర్తుకామః సనకాదిసిద్ధానే తద్విమర్శే శివసూత్రజాలమ్."
అయమర్థో ''మహేశ్వరాణి సూత్రాణి'' అత్యత్రానుసన్ధేయః,

= సుధియామాశయః =

మదరాస్ క్రిష్టియన్‌కాలేజి కర్ణాటభాషా ప్రధానాధ్యాపకైః బ్రహ్మశ్రీ గరణి వైయాకరణ కృష్ణాచార్యైః విరచితే ధాతురత్నావళ్యా అహం సమ్యక్తరాం పర్యైక్షిషి సుబన్త తిఙన్తరూప ప్రతిపాదకానా మాధునికగ్రన్థానాం మధ్యే ఇమౌ రచనాయాం, ప్రతిపాద్యవిషయ పరిగ్రహే, తదానుపూర్వ్యాం చ ఉత్త

మావిత్యాతిష్ఠే. ఇమౌ అత్యన్తం సుబోధౌ న కేవలం సంశయాపనోదనార్థక కాదాచిత్కపరీక్షాయై, కృత్స్నాధ్యయనాయా ప్యుపయుజ్యేతే. ఇమావుభౌ మిళిత్వా ఏకం సుబోధమ్, ఆవశ్యక బహువిషయ ప్రతిపాదకం వ్యాకరణం భవేతామ్. అనయోః ప్రమాద జన్యాన్దోషాన్ కానపి నోపలభే. సిద్ధాన్త కౌముద్యాది పఠనాత్పరిగ్లానైరపి గైర్వాణ్యా మక్లేశేన ప్రవేశ మీప్సుభిః ఇమావేవ గ్రన్థావధ్యేతవ్యౌ.

వేదం వేఙ్కటరాయ శాస్త్రీ
మదరాస్ క్రిస్టియన్ కాలేజి
సంస్కృత ప్రధానాధ్యాపకః

క్రైస్తవశక 1888 స.
ఏప్రిల్ మాస 14 దినమ్

శ్రీ రామః

చెన్నపట్టణస్థ మిల్లరు కలాశాలాయాం కర్ణాటకభాషా ప్రధానాధ్యాపకైః, బ్రహ్మశ్రీ గరణి వైయాకరణ కృష్ణాచార్యైః కృతాం శబ్దరత్నావళిం వ్యలోకయమ్. తత్ర సిద్ధాన్త కౌముద్యనుసారేణ వర్ణసమామ్నాయాది సర్వప్రక్రియా యథాశాస్త్రం నిరూపితా. సంస్కృతభాషా జిజ్ఞాసూనాం సర్వేషామపి సిద్ధాన్త కౌముద్యాది వ్యాకరణ గ్రన్థాధ్యయనస్య దుస్సాధతయా సుఖేన సుశబ్దాపశబ్ద పరిజ్ఞానార్థం ఇయం తైర్నిరమాయీతి.

దం. సూర్యనారాయణశాస్త్రీ,
చెన్నపట్టణస్థ మిల్లరు కళాశాలాయాం
సంస్కృతభాషా ద్వితీయాధ్యాపకః.

౧౮౮౨ సం॥
ఏప్రిల్ ౨౨ తేది.

శ్రీరస్తు

కృష్ణాచార్యాః సుచర్యా గరణి కృతపదాస్తిమ్మణార్యాత్మజాతా
మిల్లర్కాలేజి కర్ణాటక ఫణితిగురూత్తం సతాశంసితాహ్వాః
ప్రాజ్ఞైషః శబ్దరత్నావలిమపి విమలాం ధాతురత్నావలించ
ద్వే తే సిద్ధాన్తకౌముద్యుభయదలనిగూఢార్థ నిష్కర్షదక్షే. ౧

ఆ ద్యా పూర్వార్ధక ౹ప్తాఖిల విషయసుఖజ్ఞానదానప్రధానా
ప్యన్యాక్రాన్తోత్తరార్ధోదిత బహువిషయ ప్రక్రియావిష్క్రియార్హా

కించైషాఙ్గ్లేయభాషా సహపరిచితయే తాదృశన్యాసబద్ధా
హ్యన్యాప్యన్యాదృశశ్రీః ప్రగుణగుణమణీ ద్వే చ జేజీత ఏవ. ౨

కీల్హారన్గ్రామరాదౌ కిల పరికలితం మూలశైలీ విలీనం
యావత్ప్రోక్తం హి తావచ్ఛుకవదిహ విదన్ నైవ విద్యాదనుక్తమ్.
కిం వాస్యా దూదిదేదిత్కిమిది దృదిరత్కిం జిదాహో ఞిదృదిత్
కీదృగ్వా రూపమేషాం వికరణమపి కిం సన్యజాదౌ చ కీదృక్. ౩

ఇత్థం కల్పాన్వికల్పాన్న చ హరతి పరాన్ ప్రాక్తనీ వాక్తనీయోఽ
ప్యేతన్యాతే ఇహైతే గహనమతి తమస్తత్సమస్తం సమస్తమ్.
కాన్త్యైక్రాన్త్యై స్ఫురన్త్యై భవతి చ సుదృశాం కన్ధరా బన్ధురాభా
గైర్వాణ్యామేవ వాణ్యాం ద్రుతమవతరతాం ప్రాభవీ బోభవీతి. ౪

యావన్తః ప్రత్యయాః స్యుస్తిఙి చ కృతి చ తద్యోగతో యాని రూపా
ణ్యుత్పద్యన్తే క్రియాణాం తదఖిల మపి నిర్మిత్సయానుక్రమేణ.
నిత్యా స్త్వాపీపులాక్యా కృఞ ఇహ నిఖిలం రూపముద్దిష్టమేవం
సర్వం నిర్వర్తితం చేత్సహృదయహృదయానన్దనం చన్దనం స్యాత్. ౫

తస్మాద్ద్విషద్భాషామేషైవ పరిచిచీషూణామ్
రత్నావళి రుభయవిధా వ్యపచేక్రీయేత నియతమితి మనుమః

మదరాసాప్రెడిడెన్సీకాలేజీత్రిదశగిరుపాధ్యాయః
ఇత్థ మిహ తాతదేశిక తాతాచార్యోఽనుమోము దీతితమామ్

# CONTENTS

## విషయానుక్రమణికా

# శబ్దరత్నావళిః

**మూలము :** శర్వాణ్యా ఊరుసంస్థస్సన్ యస్తాం శైశవభాషయా
వినోదయామాస తస్మై ప్రత్యాహాపతయే నమః. ॥1॥

కల్యాణమూర్తేః కమలాశ్రయస్య
కలౌ యుగే వేఙ్కటనాయకస్య.
కృపాసముద్రస్య చిదాత్మకస్య
నామస్మృతిర్మే శ్రియమాతనోతు. ॥2॥

వ్యాకృతి రత్నాకర మవగాహ్యోదాయ చ సుశబ్దరత్నాని
రచయామి శబ్దరత్నావళి మతిశుద్ధాం సమర్పయే చ హరౌ. ॥3॥

సంస్కృతభాషా మాదౌ జిజ్ఞాసూనాం సుఖేన బోధాయ
యోఽకారి మయా యత్నస్సోఽయం సదనుగ్రహేణ సఫలస్స్యాత్. ॥4॥

## శబ్ద రత్నావళౌ సఞ్జ్ఞాప్రకరణమ్

యేనాక్షరసమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః. ॥1॥

యేన ధౌతా గిరః పుంసాం విమలైశ్శబ్దవారిభిః
తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః. ॥2॥

వాక్యకారం వరరుచిం భాష్యకారం పతఞ్జలిమ్
పాణినిం సూత్రకారం చ ప్రణతోఽస్మి మునిత్రయమ్. ॥3॥

ఓం నమః పాణిని కాత్యాయన పతఞ్జలిభ్యో మునిభ్యో
మహద్భ్యో గురుభ్యః.

అ ఇ ఉ ణ్ (౧) ఋ ఌ క్ (౨) ఏ ఓ ఙ్ (౩) ఐ ఔ చ్ (౪) హ య వ ర ట్ (౫) ల ణ్ (౬) ఞ మ ఙ ణ న మ్ (౭) ఝ భ ఞ్ (౮) ఘ ఢ ధ ష్ (౯) జ బ గ డ ద శ్ (౧౦) ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ (౧౧) క ప య్ (౧౨) శ ష స ర్ (౧౩) హ ల్ (౧౪).

ఇతి మాహేశ్వరాణి సూత్రాణి. అణ్, అక్ ఇత్యాది సఞ్జ్ఞార్థాని.

# ఆంధ్ర వివరణము

## సంజ్ఞా ప్రకరణము

పరమశివుఁడు నాట్యము ముగియు సమయమున పదునాలుగు పర్యాయములు తన ఢక్కను మ్రోగింపగా "అ ఇ ఉ ణ్" మొదలు "హ ల్" వరకునున్న పదునాలుగు సూత్రము లుద్భవించినవి. ఇవియే మహేశ్వర సూత్రములు. "అణ్" "అక్" మొదలగు పేర్లను కల్పించుకొనుటయే యీ సూత్రములకు ప్రయోజనము.

**1. మూలమ్ :** ఉపదేశే* అన్త్యభూతా హల్వర్ణాః ఇత్సఞ్జ్ఞకా స్స్యుః, తేషాం లోపశ్చ ఇత్యుక్తత్వేన ఏతచ్చతుర్దశ సూత్రాన్త్యవర్ణాః ణ్, క్ ప్రభృతయః ఇత్సఞ్జ్ఞకాస్సన్తః అణాది సఞ్జ్ఞాసు న గృహ్యన్తే.

**అనువాదము :** 'అ ఇ ఉ ణ్' మొదలు 'హ ల్' వరకు గల సూత్రములకు ఉపదేశములని పేరు. ఈ యుపదేశము లనఁబడు "అ ఇ ఉ ణ్ - ఋ ఌ క్" మున్నగు సూత్రములకు చివరనున్న 'ణ్' 'క్' మున్నగు హల్లులు 'ఇత్తు' లనఁబడును. ఆ ఇత్తు లనఁబడు అక్షరములు లోపముఁ జెందును. 'అణ్' అనగా అ ఇ ఉ అక్షరములకు మాత్రమే పేరు. 'ణ్'కు పేరు గాదు. 'అక్' అనగా అ ఇ ఉ ఋ ఌ అక్షరములకు మాత్రమే పేరు. 'క'కు పేరు గాదు. కావున నీ పదు నాలుగు సూత్రముల చివరి యక్షరములు ఇత్సంజ్ఞ కలిగియుండునేగాని, అణ్ - అక్కు మొదలగు పేర్లలో గ్రహింపఁబడవు.

**2. మూలమ్ :** ఇత్సఞ్జ్ఞకైః అణ్సూత్రాద్యన్త్యవర్ణైః (ణకారాదిభిః) సహితో వర్ణః (అకారాదిః) మధ్యగానామ్ (ఇ ఉ ఇత్యాదీనామ్) స్వస్య చ (అకారస్య) సఞ్జ్ఞా (ప్రత్యాహారః) స్యాత్. యథా - (౧) అణ్ - ఇతి అ ఇ ఉ వర్ణానాం సంజ్ఞా; (౨) అక్ - ఇతి అ ఇ ఉ ఋ ఌ వర్ణానాం

---

* **మూలమ్ :-** ధాతుసూత్రగణోణాది వాక్య లిఙ్గాను శాసనమ్
ఆగమప్రత్యయాఽఽదేశా ఉపదేశాః ప్రకీర్తితాః.

**అనువాదము :-** భూప్రభృతి ధాతువులు, సూత్రములు, గణములు, ఉణాదులు, వాక్యము, లిఙ్గానుశాసనము, ఆగమము, ప్రత్యయము, ఆదేశము, ఉపదేశములనఁ బడును.

సంజ్ఞా; ఏవమ్ ఇక్ - ఇ ఉ ఋ ఌ, ఉక్ - ఉ ఋ ఌ, (3) ఏఙ్ - ఏ ఓ; (౪) అచ్ - అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ; ఇత్థమేవ ఇచ్, ఐచ్; (౫) అట్; (౬) అణ్; ఇణ్; యణ్; (౭) అమ్, యమ్, ఙమ్, ఙమ్; (౮) యఞ్; (౯) ఝష్, భష్, (౧౦) అశ్, హశ్, వశ్, ఝశ్, జశ్, బశ్; (౧౧) ఛవ్; (౧౨) యయ్, మయ్, ఝయ్, ఖయ్, చయ్; (౧౩) యర్, ఝర్, వర్, ఖర్, చర్, శర్ (౧౪) అల్, హల్, వల్, రల్, ఝల్, శల్; ఏతే చతుశ్చత్వారింశదేవ ప్రత్యాహారా వ్యవహ్రియ న్త ఇతి బోధ్యమ్. హయవరడిత్యాదిషు హకార ప్రభృతిషు శ్రూయమాణః అకారః కేవల ముచ్చారణార్థః.

**అనువాదము:-** ఇత్తులను పేరుగల 'అ ఇ ఉ ణ్' ఇత్యాది సూత్రముల చివరి యక్షరములైన "ణ్" మున్నగు వానితోఁ గూడిన 'అ' మున్నగునవి మధ్యనున్న 'ఇ-ఉ' మున్నగు అక్షరములకు, తనకును అనగా అకారము మున్నగు వానికిని సంజ్ఞయగును. అట్లు ఇత్తుతో మొదటి యక్షరమును కల్పిన నవి ప్రత్యాహారము లని పిలువబడును. ఎట్లన—ణ్ అను నిత్తుతో కలుపఁబడిన 'అ' అణ్ అగును. ఈ 'అణ్' అ-ఇ-ఉ అక్షరములను గ్రహించుకొనుచున్నది గాన నిది 'అణ్' ప్రత్యాహారమనఁబడును. ప్రత్యాహారమనగా సంగ్రహించునది. ఇట్లే(౨)'అక్' అనునది, అ ఇ ఉ ఋ ఌ అక్షరములను సంగ్రహించుకొని యా యక్షరములకు పేనగుచున్నది. ఇట్లే 'ఇక్' అనునది ఇ ఉ ఋ ఌ అక్షరములను గ్రహించుకొని యా యక్షరములకు పేరగుచున్నది. ఇట్లే(౩) 'ఏఙ్' అనునది ఏ-ఓ అక్షరములను గ్రహించుకొని యా యక్షరములకు పేరగుచున్నది. అట్లే (౪) 'అచ్' అనునది అ-ఇ-ఉ-ఋ-ఌ-ఏ-ఓ-ఐ-ఔ అక్షరములను గ్రహించుకొని యా యక్షరములకు పేరగుచున్నది. ఇట్లే (౫) అట్, (౬) అణ్, ఇణ్, యణ్, (౭) అమ్, యమ్, ఙమ్, ఙమ్, (౮) యఞ్ (౯) ఝష్, భష్, (౧౦) అశ్, హశ్, వశ్. ఝశ్, జశ్, బశ్, (౧౧) ఛవ్ (౧౨) యయ్, మయ్, ఝయ్, ఖయ్, చయ్ (౧౩) యర్, ఝర్, వర్, ఖర్, చర్, శర్ (౧౪) అల్, హల్, వల్, రల్, ఝల్, శల్ అని ఈ నలుబది నాలుగే ప్రత్యాహారములనఁబడును. వెనుకటి పదునాల్గు సూత్రములలో (౫) వ సూత్రమైన "హయవరట్" మొదలు కడపటి సూత్రమైన "హల్" వరకును గలవానిలో హ,య,వ,ర,ల,ఞ,మ,గ,ణ,న, ఇత్యాద్యక్షరములలో వినబడుచున్న (హ్ + అ = హ; య్ + అ = య; వ్ + అ = వ ఇత్యాదిగ వినఁ

బడుచున్న) అకారములు ఉచ్చారణము కొఱకే యున్నవి. కాని వానికి ప్రత్యాహారముల యందు గ్రహణము లేదు. అవి లేనిచో మనము హ్,య్,వ్, ర్, ఇత్యాది పొల్లక్షరములను పలుకవలయునుగదా! అట్లు పొల్లు అక్షరములను పలుకుట కష్టము గాన, వాని బలుకుటకై వానిమీద "అ" చేర్చబడినది.

**3.మూలమ్ :—** "ఏకమాత్రో భవేద్ధ్రస్వః, ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే

త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః, వ్యఞ్జనస్త్వర్ధమాత్రకమ్".

ఇత్యుక్తత్వేన అ ఇ ఉ ఋ ఏతే హ్రస్వ దీర్ఘప్లుతానాం బోధకాస్స్యుః. ఌ — అయం హ్రస్వప్లుతయోర్బోధకః. ఏచః దీర్ఘప్లుతయోర్బోధకాః. హ్-య్ ఇత్యాదయః హలః (వ్యఞ్జనాని) అర్ధమాత్రాకాలికాః.

**అనువాదము:-** 'అ' అను నక్షరము "అ" యను హ్రస్వమునకును, "ఆ" యనెడి దీర్ఘమునకును "ఆ౩" యనెడి ప్లుతమునకును గ్రాహకము. అట్లే ఇ-ఉ-ఋ అను అక్షరములును తమ తమ హ్రస్వ దీర్ఘ ప్లుతములకు గ్రాహకములు. 'ఌ' అను నక్షరము తన హ్రస్వమునకు ప్లుతమునకు గ్రాహకము. దీర్ఘములేదుగాన దానికి గ్రాహకముగాదు. 'ఏచ్' లు అనగా-ఏ-ఓ-ఐ-ఔ అక్షరములు తమ దీర్ఘ ప్లుతములకు మాత్రమే గ్రాహకములు. వానికి హ్రస్వము లేదు గాన హ్రస్వమునకు గ్రాహకములుగావు. గ్రాహకములనుటలో నర్థమేమనగా-పైన జెప్పిన అ-ఇ-ఉ-ఋ-ఌ-ఏ-ఓ-ఐ-ఔ అను నక్షరములలో అ-ఇ-ఉ-ఋ అనునవి హ్రస్వములుగా వినబడుచున్నను, తమకున్న దీర్ఘ-ప్లుతములను గూడ నవియే సూచించును. అట్లే "ఌ" తాను హ్రస్వముగ వినబడినను, తనకున్న ప్లుతమును తానే సూచించును. అట్లే ఏ, ఓ, ఐ, ఔలు దీర్ఘములుగా వినబడినను తమకున్న ప్లుతములను గూడ సూచించును.

ఒక్క మాత్రాకాలము అనగా — 'అ' యని యుచ్చరించునంతటి కాలము గల్గినందున హ్రస్వమనియు, "ఆ" యని యుచ్చరించునంతటి రెండు మాత్రాకాలములు (అ + అ) కల్గియుండుటవలన దీర్ఘమనియు, మూడు మాత్రా కాలములు గల్గినందువలన ఆ౩ (అ+అ+అ) అనునది ప్లుతమనియు నెఱుంగవలయును. హ్, య్, వ్, మున్నగు పొల్లులైన హల్లులు అర్ధ మాత్రలనబడును.

**మూలమ్:—** అనుస్వారః(ం) విసర్గ(ః) జిహ్వామూలీయః(ꣳక్) *ఉప ధ్మానీయః(ꣳప్) ద్విమాత్రకాస్సన్తః(గురుసఞ్జ్ఞకాః)అచి హలి చ సామాన్యతో గృహ్యన్తే. హ్రస్వాస్సర్వేఽపి (అ ఇ క కి ఇత్యాదయః) లఘుసఞ్జ్ఞకాః. సంయోగపరకాస్తే గురుసఞ్జ్ఞకాః. (కృష్ణచ్ఛత్రమ్). దీర్ఘాస్తు(ఆ ఈ కా కీ ఆద్యాః) గురుసఞ్జ్ఞకాః; ప్లుతా అపి గురవఏవేతి బోధ్యమ్.

**అనువాదము:-** (ం) అను అనుస్వారము(ః) అను విసర్గము (ꣳక్)అని "క్"కుముందున్న జిహ్వామూలీయము. (ꣳప్) అని "ప్" అను వర్ణమునకు ముందున్న ఉపధ్మానీయము రెండుమాత్రల కాలముగలవై గురువులనఁబడును. ఈ(ః) విసర్గ(ꣳక్) అనుజిహ్వామూ లీయము (ꣳప్)అను ఉపధ్మానీయము అచ్చులుగను హల్లులుగను గ్రహింపఁబడును. అ ఇ క కి మున్నగు హ్రస్వములన్నియు లఘువులనబడును. వీనికి సంయోగాక్షరములు అనగా-అచ్చులు వ్యవధానములుగాలేని జడ్డలు "ష్ణ" "చ్ఛ" ఇత్యాదులు పరములైనప్పుడు గురువులగును. "కృష్ణచ్ఛత్రమ్" అనువెడ "కృ" యందలి"ఋ"అను నచ్చునకు "ష్ణ"అను సంయోగాక్షరము పరమైనందువలన "ఋ" అనగా వట్రుసుడి గురువగును. అట్లే "ష్ణ" (ష్ణ్+అ) లోని అకారమునకు 'చ్ఛత్రమ్'లోని మొదటి 'చ్ఛ' అను సంయోగాక్షరము పరమైనందువలన నా 'అ' కారము గురువగుచున్నది. దీర్ఘములైన ఆ-ఈ-కా-కీ మున్నగు నక్షరములు గురువులనబడును. అట్లే ప్లుతములు (అ+అ+అ=ఆ3) (ఇ+ఇ+ఇ=ఈ3) ఇత్యాది మూడుమాత్రాకాలములు గలవియు గురువులగును.

---

***మూలమ్ :-** జిహ్వామూలీయః = క, - ఖాభ్యామ్ ప్రాగర్ధచన్ద్రాకార ద్వయవద్విద్యమాన విసర్గః. ప్రాతꣳకాలః, కꣳఖనతీ త్యాదౌబోధ్యః.

ఉపధ్మానీయః=ప, ఫాభ్యామ్ ప్రాగర్ధచన్ద్రాకారద్వయవత్ విద్యమాన విసర్గః. యథా-కꣳపతతి, తరుꣳఫలతీ త్యాదౌ జ్ఞేయః.

**అనువాదము :** జిహ్వామూలీయము= క-ఖ లకు పూర్వము అర్ధచంద్రాకారమువలె నుండెడి విసర్గ. "ప్రాతꣳకాలః", "కꣳఖనతి" అనునప్పుడు "క"కు "ఖ"కు ముందున్న యర్ధచంద్రాకారపు (ꣳ) విసర్గ జిహ్వామూలీయము.

**ఉపధ్మానీయము :** ప, ఫలకు పూర్వము అర్ధచంద్రాకారమువలె నుండెడి విసర్గ. "కꣳపతతి" "తరుꣳఫలతి" అనువెడ "ప"కును "ఫ"కును ముందున్న (ꣳ) అర్ధచంద్రాకారపు విసర్గలు ఉపధ్మానీయములనఁబడును.

**4. మూలమ్:** ముఖసహితనాసికయా ఉచ్చార్యమాణావర్ణాః అనునాసిక సఞ్జ్ఞా స్స్యుః. తత్ర అచః ఉదాత్తానుదాత్త స్వరితభేదేన త్రివిధాః. తేచ వేదే ద్రష్టవ్యాః.

**అనువాదము:-** నోటితోఁగూడిన నాసికతో నుచ్చరింపబడు నక్షరములు అనునాసిక లనబడును. "ఙ-ఞ-ణ-న-మ" యనునవి పైవిధముగా నుచ్చరింపఁ బడుటవలన ననునాసికములు. అట్లే అనుస్వారమైన (ం) గూడ ననునాసికము. అచ్చులు ఉదాత్తములు, అనుదాత్తములు, స్వరితములను భేదములచే మూడు తెఱంగులు. అవి వేదమునందుఁజూడ దగినవి.

**5. మూలమ్ :-** సమాన స్థానప్రయత్నా † వర్ణాః పరస్పరం సవర్ణ సఞ్జ్ఞకాః. తేన అకారస్య ఆకారః, ఆకారస్య అకారశ్చ అనులోమ విలోమాభ్యాం సదృశ ఇత్యర్థః. ఏవమేవ ఇకారాదిషు విశేషతః ఋ ఌ వర్ణయోశ్చ మిథః సవర్ణ సఞ్జ్ఞా బోధ్యా.

---

† **మూలము :** సవర్ణోపయోగి ప్రయత్నః ద్విధా - ఆభ్యన్తరో బాహ్యశ్చేతి. తత్రాభ్యన్తరః చతుర్ధా - స్పృష్టః, ఈషత్స్పృష్టః, వివృతః, సంవృతశ్చేతి. స్పృష్టప్రయత్నః స్పర్శానామ్. ఈషత్స్పృష్టః అన్తస్థానామ్. వివృతః స్వరాణామ్. ఊష్మణాఞ్చ. హ్రస్వాకారప్రయోగే సంవృత ఇతి. బాహ్యప్రయత్నస్త్వేకాదశధా-వివారః, సంవారః, శ్వాసో, నాదో, ఘోషోఽఘోషోఽల్పప్రాణో, మహాప్రాణ, ఉదాత్తోఽనుదాత్త స్స్వరి తశ్చేతి. అయం ప్రాయశస్స వర్ణసఞ్జ్ఞాయా మనుపయుక్తో ప్యాన్తరతమ్య పరీక్షాయా ముపయోక్ష్యత ఇతి సఙ్గృహీతః.

**అనువాదము :** సవర్ణత్వమున కుపయోగపడు ప్రయత్నము తొలుత 'ఆభ్యంతరము' 'బాహ్యము' అని రెండు విధములు. అందు ఆభ్యంతరము నలుతెఱంగులు. స్పృష్టము, ఈషత్ స్పృష్టము, వివృతము, సంవృతము అని. స్పృష్ట ప్రయత్నము స్పర్శము లనఁబడు నక్షరములకును, అనగా 'క' మొదలు 'మ' వరకు నుండు నక్షరములకును, ఈషత్స్పృష్టము అంతస్థము లనఁబడు నక్షరములకును అనగా "య-వ-ర-ల"కును, వివృతము అచ్చులకును, ఊష్మలనఁబడు నక్షరములకును అనగా "శ-ష-స-హ"లకును నగును. హ్రస్వమైన అకారమును ప్రయోగించునపుడు సంవృత ప్రయత్నము.

బాహ్యప్రయత్నము పదునొకండు తెఱంగులు. ఎట్లనగా-వివారము, సంవారము, శ్వాసము, నాదము, ఘోషము, అఘోషము, అల్పప్రాణము, మహాప్రాణము, ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము అని. ఈ బాహ్యప్రయత్నము సవర్ణ సంజ్ఞకుపయుక్తము కాకపోయినను 'స్థానేఽంతరతమః' అను

**అనువాదము:-** సమానములైన స్థానములు, సమానములైన ప్రయత్నములుగల యక్షరము లొండొంటికి సవర్ణములనఁబడును కాన 'అ' కారమునకు 'ఆ' కారము, 'ఆ' కారమునకు 'అ' కారాము సవర్ణములు. అందు అకారమునకు ఆ కారము అనులోమముగాను, ఆ కారమునకు అ కారము విలోమముగాను సవర్ణములు. ఇట్లే ఇ కారమునకు ఈ కారము, ఈ కారమునకు ఇ కారము సవర్ణములు. ఉకారాదులకు నిట్లేయెఱుంగునది. "ఋ ౡ" వర్ణము లొండొంటికి సవర్ణములు.

**6 మూలమ్:-** అత్ (హ్రస్వాకారః) ఏ, ఓ ఏతేగుణ సఙ్జ్ఞకాః. ఆత్ (దీర్ఘాకారః), ఐ, ఔ ఏతేవృద్ధి సఙ్జ్ఞకాః. తత్ర ఋకార, ౡకారస్థానికో గుణః అర్, అల్ ఇతి వృద్ధిస్తు ఆర్, ఆల్. ఇతిచబోధ్యః.

**అనువాదము:-** 'అత్' అనగా-కేవలము హ్రస్వమైన అకారము, ఏ, ఓ అనునవియు గుణములనఁబడును.

'ఆత్' అనగా కేవలము దీర్ఘమైన ఆకారము, ఐ, ఔ అనునవియు వృద్ధులనఁబడును. అందు ఋకార, ౡకార స్థానములయందు నాదేశముగా వచ్చెడి గుణము 'అర్' 'అల్' అనియు, ఆ స్థానములయందే యాదేశములుగా వచ్చెడి వృద్ధి 'ఆర్' 'ఆల్' అనియు తెలియఁదగును. అనగా-'ఋ' కారమునకు వచ్చెడి గుణము 'అర్' అనియు 'ౡ' కారమునకు వచ్చెడి గుణము 'అల్' అనియు, అట్లే 'ఋ' కారమునకు వచ్చెడి వృద్ధి 'ఆర్' అనియు 'ౡ' కారమునకు వచ్చెడి వృద్ధి 'ఆల్' ఆనియు తెలియనగును.

**7. మూలమ్:-** వర్ణానా మవిలమ్బేనోచ్చారణం సంహితా సఙ్జ్ఞం స్యాత్. స్వరైరవ్యవహితాః హలః సంయోగసఙ్జ్ఞాస్స్యుః.

**అనువాదము:-** అక్షరములను నిలుపక పలుకుట సంహిత యనఁబడును. అచ్చులతో మధ్య వ్యవధానము బొందని హల్లులు అనగా జడ్డలు సంయోగములనఁబడును.

---

సూత్రముచే చెప్పఁబడు నాంతరతమ్య పరీక్షయందు పయోగ పడగలదని యిటఁ జెప్పఁబడినది.

**8. మూలమ్:—** సుబన్తం తిఙన్తఞ్చ పదసఞ్జ్ఞంస్యాత్. సుప్, తిఙ్ ప్రత్యాహారౌతూత్తరత్రవక్ష్యేతే.

**అనువాదము:—** సుప్పులనెడి యిరువదియొక్క సంస్కృత విభక్తులలో నేయొక్క విభక్తినైనను చివరఁగల్గిన శబ్దములు "రామః" "రామేణ" ఇత్యాదులును, తిఙ్లనెడి సంస్కృత పురుష ప్రత్యయములైన పదునెనిమిదింటిలో నేయొక్క పురుషప్రత్యయమును చివర గల్గిన శబ్దములు "భవతి" "గచ్ఛతి" ఇత్యాది క్రియావాచకములగు శబ్దములును పదములనఁబడును. వీనికి గూడ ప్రత్యాహార వ్యవహారము అనగా "సు" ప్రత్యయము మొదలు "సుప్" లోని "ప"నుకలుపుకొని "సుప్" లను వ్యవహారము, వానిని చివరఁ గల్గినందువలన సుబంతములనెడి వ్యవహారము. అట్లే "తిప్" ప్రత్యయము మొదలు "మహిఙ్" అను ప్రత్యయములోని "ఙ" ను కలుపుకొని "తిఙ్" లను వ్యవహారము, వానిని చివర గల్గినందువలన తిఙంతములనెడి వ్యవహారము మున్ముందు విచారింపఁబడును.

**9. మూలమ్:-** క్రియాయోగే సతి ప్రాదయః ఉపసర్గ సఞ్జ్ఞకాః, గతి సఞ్జ్ఞకాశ్చస్యుః. తేతు వింశతిః-ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, దుస్, (నిర్, దుర్,) వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉపఇతి. ఏతేషా మర్థాః ప్రయోగాశ్చ అన్యత్ర మయా సప్రపఞ్చం ప్రదర్శితాః.

**అనువాదము :—** క్రియలతో సంబంధమున్నప్పుడు ప్రాదులు ఉపసర్గలనఁబడును. అట్లే గతి సఞ్జ్ఞ లనబడును. ఆ ప్రాదులు ఇరువది. అవి యేవనగా-ప్ర-పరా-అప-సమ్-అను-అవ-నిస్-దుస్ (నిర్-దుర్) వి-ఆఙ్-ని -అధి-అపి-అతి-సు-ఉత్-అభి-ప్రతి-పరి-ఉపఅని. వీనికి అర్థములు ప్రయోగములు మఱియొకచోట వివరముతో నాచేఁజూపఁ బడినవి.

**10. మూలమ్ :-** అద్రవ్యార్థాః ప్రాదయః, చాదయశ్చ (చ-వా-హ-అహో-భో ఇత్యాదయః) నిపాతసఞ్జ్ఞాస్స్యుః. చాదిరాకృతిగణః.

**అనువాదము :-** ద్రవ్యమును బోధింపకయున్న ప్రాదులు చాదులు నిపాతములనఁబడును. ప్రాదులు పైనఁజెప్పఁబడినవి. చాదులు అనగా-చ-వా హ-అహో-భో ఇత్యాదులు. చాదులను ఆకృతితో నూహించుకొనవలయును.

**మూలమ్ :-** అథ వర్ణానాం స్థానాది వివరణమ్;- అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అమ్ (ం), అః, ఏతే అచః- స్వరాః.

| | | |
|---|---|---|
| క ఖ గ ఘ ఙ | = | క వర్గః |
| చ ఛ జ ఝ ఞ | = | చ వర్గః |
| ట ఠ డ ఢ ణ | = | ట వర్గః |
| త థ ద ధ న | = | త వర్గః |
| ప ఫ బ భ మ | = | ప వర్గః |

ఏతే పఞ్చవింశతి స్పర్శాః. య-ర-ల-వ- ఏతే అన్తస్థాః. శ ష స హ- ఏతే ఊష్మాణః. 'ళ'కారస్తు భిన్నో న-కిన్తు లకార ఏవ. క్షకారః కషయో ర్యోగేన, జ్ఞకారః జఞో ర్యోగేన, భవతీతి జ్ఞేయమ్.

అ, కవర్గ, విసర్గ, హకారాణాం కణ్ఠః.

ఇ, చ వర్గ, య, శానాం తాలు.

ఋ, ట వర్గ, ర, షాణాం మూర్ధా,

ఌ త వర్గ, ల, సానాం దన్తాః.

ఉ, ప వర్గో, పధ్మానీయానామోష్ఠౌ.

ఞ, మ, ఙ, ణ, నానాం, నాసికాచ.

ఏకారైకారయోః కణ్ఠతాలు.

ఓకారౌకారయోః కణ్ఠోష్ఠమ్.

వకారస్య దన్తోష్ఠమ్.

అనుస్వారస్య నాసికా.

జిహ్వామూలీయస్య జిహ్వామూలమ్.

ఇతి స్థానాని

ఇతి సఞ్జ్ఞా ప్రకరణమ్.

**అనువాదము :—** ఇఁక వర్ణములకు స్థానము మున్నగు వాని వివరణము :—

అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ- అమ్ (ం)- అః అను నీ యచ్చులు స్వరము లనఁబడును.

క-ఖ-గ-ఘ-ఙ = క వర్గము.
చ-ఛ-జ-ఝ-ఞ = చ వర్గము.
ట-ఠ-డ-ఢ-ణ = ట వర్గము.
త-థ-ద-ధ-న = త వర్గము.
ప-ఫ-బ-భ-మ = ప వర్గము.

ఈ యైదు వర్గములలోని యిరువది యైదు వర్ణములు స్పర్శము లనఁబడును.

య-ర-ల-వ-లు అంతస్థలములనఁబడును.

శ-ష-స-హ లు ఊష్మలనఁబడును.

'ళ' కారము వేఱువర్ణము కాదు. అది లకారమే.

'క్ష' కారము 'క్' వర్ణముతో 'ష' వర్ణము కలియుటవలనను, 'జ్ఞ' కారము 'జ్' వర్ణముతో 'ఞ' వర్ణము కలియుటవలనను నేర్పడును.

'అ' వర్ణమునకు, క వర్గకు, విసర్గలకు, 'హ' కారమునకు కంఠము ఉత్పత్తిస్థానము.

'ఇ' వర్ణమునకు,చ వర్గకు, 'య' కారమునకు, 'శ' కారమునకు దవుడలు ఉత్పత్తిస్థానము.

'ఋ'కారమునకు, టవర్గకు, 'ర'వర్ణమునకు 'ష' కారమునకు శిరస్సు ఉత్పత్తిస్థానము.

'ౡ'కారమునకు, తవర్గకు, 'ల'కారమునకు 'స'కారమునకు దంతములు ఉత్పత్తిస్థానము.

'ఉ' కారమునకు, ప వర్గకు, (ɤప) ఉపధ్మానీయమునకు పెదవిలు ఉత్పత్తిస్థానము.

ఙ-మ-ఞ-ణ-న లకు నాసికయు ఉత్పత్తిస్థానము.

ఏ-ఐలకు కంఠము, దవుడలు ఉత్పత్తిస్థానము.

ఓ-ఔలకు కంఠము, పెదవులు ఉత్పత్తిస్థానము.

వకారమునకు దంతములు, పెదవులు ఉత్పత్తిస్థానము.

(ɤక) జిహ్వామూలీయమునకు నాలుక మొదలు ఉత్పత్తిస్థానము.

ఇట్లు వర్ణోత్పత్తిస్థానములు నిరూపింపఁబడినవి.

ఇట్లు సంజ్ఞా ప్రకరణము సమాప్తము

# అథ సన్ధి ప్రకరణమ్.

* **మూలమ్:-** వర్ణానాం పదానాం వా సమాయోగః * లోపాగమా దేశాది వర్ణవికారో వా సన్ధిరిత్యుచ్యతే. స చ సంహితా విషయే బోధ్యః సంహితాతు క్వచిన్నిత్యా క్వచిద్వివక్షాయత్తా. తథా చోక్తమ్.

శ్లో॥ "సంహితైకపదే నిత్యా నిత్యాధాతూపసర్గయోః,
నిత్యాసమాసే; వాక్యేతు సావివక్షా మపేక్షతే".

ఇతి. స సన్ధిః సామాన్యతః అచ్సన్ధిః (స్వరసన్ధిః) ప్రకృతిభావసన్ధిః, హల్సన్ధిః, (వ్యఞ్జనసన్ధిః) విసర్గసన్ధిః, స్వాదిసన్ధి శ్చేతి పఞ్చధా. తత్రాచ్సన్ధిః సవర్ణ దీర్ఘ, గుణ, వృద్ధి, యణాదేశ, వాన్తాదేశ, పూర్వరూప, పరరూపా, వజాదేశ భేదాన్నవధా.

**అనువాదము :**

వర్ణములుగాని, పదములుగాని కలియుట సంధి యనబడును. లేదా- లోపము, ఆగమము, ఆదేశము మున్నగు వానివలనఁగల్గు వికారము సంధియనఁబడును. ఆ సంధి, సంధినొందెడు రెండు వర్ణములకు గాని పదములకుగాని సంహిత అనగా సామీప్యమున్నప్పుడే వచ్చును. అదెట్లనగా- ఈ సంహిత ఒక్క పదమునందు నిత్యము. అట్లే ధాతూపసర్గలకు నిత్యము. సమాసము నందును నిత్యము. వాక్యమునందు వక్తయొక్క వివక్ష ననుసరించి యుండును.

ఏకపదమునకు ఉదా॥ రామ + ఇన అను ప్రకృతి ప్రత్యయములు కలిసి రామేన = రామేణ యని పదమగును. కాన ఇచ్చట సంహిత యనగా సంధినిత్యముగా జెప్పవలయును. అనగా- **రామేణ** యని గుణసంధి చేసి ప్రయోగింప వలయును. అట్లు సంధిచేయక రామ + ఇన అని ప్రయోగింపరాదు

---

* **మూలమ్:-** లోపః-వర్ణానా మదర్శనమ్. ఆగమః=(మిత్రవత్) పశ్చాత్పురతో వా వర్ణాయతిః. ఆదేశః (శత్రువత్) స్థితస్య వర్ణస్యస్థానే ఏవ అన్య వర్ణాగమః.

**అనువాదము:-** లోపమనగా-వర్ణములు కానరాక పోవుట. అనగా వినబడక పోవుట. ఆగమమనగా మిత్రునివలె ముందో, వెనుకనో వర్ణము వచ్చియుండుట. ఆదేశమనగా శత్రువువలె వర్ణముయొక్క స్థానము నందే మఱియొక వర్ణము వచ్చుట.

ఉపసర్గ ధాతువులకు ఉదాహరణము:-

ప్ర + ఏధతే అనుచోట ప్ర-ఉపసర్గకు ఏధతే అను ధాతువునకు సంధి నిత్యముగఁజేసి 'ప్రేధతే' యని ప్రయోగింపవలయును. కాని విసంధిగాఁ బ్రయోగింపరాదు.

సమాసమునకు ఉదా:-

మధు + అరి అను సమాసమునందు యణాదేశసంధిని నిత్యముగాఁజేసి "మధ్వరిః" అని ప్రయోగింపవలయును. కాని మధు + అరిః అని విసంధిగాఁ బ్రయోగింపరాదు.

వాక్యమునకు ఉదా:-

రామస్య + అనుజః ఇది వాక్యము. ఇచ్చట 'రామస్యానుజః'అని సవర్ణ దీర్ఘసంధిఁ జేయవచ్చును. లేదా చేయకయే రామస్య అనుజః అని విసంధిగా నైనను ప్రయోగింప వచ్చును. ఇది వక్తయొక్క కోరిక ననుసరించి యుండును గాన వాక్యమునందు సంధి నిత్యముకాదు. అనగా తప్పక చేయవలయునను నియమము లేదు.

ఆ సంధి సామాన్యముగ నైదు తెఱంగులు. అవేవనగా-

1. అచ్సంధి (స్వరసంధి)
2. ప్రకృతిభావసంధి.
3. హల్సంధి (వ్యఞ్జన సంధి)
4. విసర్గ సంధి
5. స్వాది సంధి అని.

వానిలో అచ్ సంధి తొమ్మిది తెఱంగులు. అవేవనగా:-

1. సవర్ణదీర్ఘ సంధి.
2. గుణ సంధి.
3. వృద్ధి సంధి.
4. యణాదేశ సంధి.
5. వాన్తాదేశ సంధి.
6. యాన్తాదేశ సంధి.

7. పూర్వరూప సంధి.
8. పరరూప సంధి.
9. అవజాదేశ సంధి-అని.

**మూలమ్ :-**

**1—సవర్ణదీర్ఘసంధిః-** అకః సవర్ణే అకి పరే దీర్ఘ ఏకాదేశః (పూర్వ పరయోః స్థానే) స్యాత్. యథా-దైత్య+అరిః=దైత్యారిః; రమా+ఆశ్ర యః=రమాశ్రయః; రామ+ఆదిః - రామాదిః; పితా+అత్ర = పితాత్ర; అత్రి+ఇదమ్=అత్రీదమ్; లక్ష్మి+ఈశః=లక్ష్మీశః; మతి+ఈడ్యః= మతీడ్యః; గౌరి+ఇయమ్=గౌరీయమ్: వధూ+ఊరూ=వధూరూ; చారు+ ఊహః=చారూహః; చమూ+ఉదధిః=చమూదధిః; హోతృ+ఋకారః;= హోతౄకారః భ్రాతృ+ౠకారః=భ్రాతౄకారః; ఋకార-ౠకారయో స్సావ ర్ణ్యాత్ దీర్ఘః. ౠకారస్య ఋకారః. అన్యాన్యుదాహరణాని ప్రయోగా భావా న్నోదాహృతాని. ఏవమగ్రేపి.

**అనువాదము :—**

**1. సవర్ణదీర్ఘసంధి :—** అక్ ప్రత్యాహారములోని వర్ణములకు అనగా అ-ఇ-ఉ-ఋ-ౠ వర్ణములకు సవర్ణములైన యా 'అక్' వర్ణములు పరమైనచో పూర్వవర్ణమునకును పరమైన వర్ణమునకునుకలిపి సవర్ణమైన దీర్ఘాక్షర మొక్క టియే యాదేశమగును.

ఎట్లనగా—దైత్య+అరిః అనునెడ త్య(త్య్+అ)పైన అకారమునకు, 'అరిః' అని సవర్ణమైన అకారము పరమైనదిగాన ఈరెండు అకారములకు సవ ర్ణమైన దీర్ఘాకారము "ఆ'' ఆదేశమైనందువలన ''దైత్యారిః'' అను రూపము సిద్ధించు చున్నది.

ఇట్లే— రమా +ఆశ్రయః అనునెడ సంధిలో పూర్వమందలి మకార ముపైని(మ్+ఆ=మా)'ఆ'కు ఆశ్రయః అని సవర్ణమైన 'ఆ' పరమైనందు వలన రెంటికిని కలిపి దీర్ఘాకారము 'ఆ' ఆదేశమైనది కాన 'రమాశ్రయః' అని సవర్ణదీర్ఘసంధి రూపము సిద్ధించినది.

ఇట్లే- రామ+ఆదిః అనునెడ (రామ్+అ)+ఆదిః యనియు,
పితా+అత్ర అనునెడ (పిత్+ఆ)+అత్ర యనియు,

**అత్రి+ఇదమ్ అనునెడ (అత్+ఇ)+ ఇదమ్ అనియు,**
**లక్ష్మీ+ఈశః అనునెడ (లక్ష్మ్+ఈ)+ఈశః అనియు,**
మతిః+ఈద్యః అనునెడ (మత్+ఇ)+ఈద్యః అనియు,
గౌరీ+ఇయమ్ అనునెడ (గౌర్+ఈ)+ఇయమ్ అనియు,
గురు+ఉదయః అనునెడ (గుర్+ఉ)+ఉదయః అనియు,
వధూ+ఊరూ అనునెడ (వధ్+ఊ)+ఊరూ అనియు,
చారు +ఊహః అనునెడ (చార్+ఉ)+ఊహః అనియు,
చమూ+ఉదధిః అనునెడ (చమ్+ఊ)+ఉదధిః అనియు,
హోతృ+ఋకారః అనునెడ (హోత్+ఋ)+ఋకారః అనియు,
భ్రాతృ+ౠకారః అనునెడ(భ్రాత్+ఋ)+ౠకారః అనియు విభజించుకొని సవర్ణదీర్ఘసంధులు చేసికొనవలయును.

(భ్రాత్+ఋ) + ౠకారః అనునెడ ఋ ౠ వర్ణములకు సావర్ణ్యము చెప్పుటవలన ౠకారమునకు ఋకారము వచ్చినది. ౠకారమునకు దీర్ఘము లేదు. కాన దాని స్థానమున ౠకారమే రావలసివచ్చినది. ఇతరములైన యుదాహరణములకు ప్రయోగములేనందువలన నవి యుదహరింపఁబడలేదు. ఇట్లేముందుఁ గూడఁ జూచుకొన వలయును.

**మూలమ్:—**

**2. గుణసన్ధిః:—** అకారాన్తా దాకారాన్తాద్వా ఇకి పరే పూర్వపరయోః స్థానే ఏకో గుణ ఆదేశస్స్యాత్॥ యథా- వద+ఇతి=వదేతి; రాజా+ఇవ=రాజేవ; ధన+ఈశః=ధనేశః; రమా+ఈశః=రమేశః; కూప+ఉదకమ్=కూపోదకమ్;గఙ్గా+ఉదకమ్=గఙ్గోదకమ్; రామ+ఊహః= రామోహః; రామా+ఊరూ=రామోరూ; కృష్ణ+ఋద్ధిః = కృష్ణర్ధిః; తవ+ౠకారః = తవర్కారః. ఌకారవిషయే ప్రకృతిభావో వక్ష్యతే.

**అనువాదము:—**

**2.గుణసంధి:—** అకారము చివర కల్గిన దానికంటెను ఆకారము చివర కల్గిన దానికంటెను ఇక్కు అనగా ఇక్ ప్రత్యాహారమునకుఁ జెందిన ఇ-ఉ-ఋ-ౠ వర్ణములు పరమైనచో సంధిలోని పూర్వవర్ణము యొక్కయు పరవర్ణము

యొక్కయు స్థానమున ఒక్క గుణము అనగా అ-ఏ-ఓ అక్షరములలో నొక్కటి ఆదేశమగును.

ఎట్లనగా-వద+ఇతి అనునెడ ధ(ద్+అ) అకారమును చివరగల్గి యున్నది గాన దీనికి 'ఇతి' యని 'ఇ' కారము పరిమైయుండుట వలన అ+ఇ లకు స్థానాదిసామ్యముననుసరించి "ఏ" ఆదేశమై "వదేతి" యని రూపము సిద్ధించు చున్నది.

రాజా+ఇవ అనునెడ జకారముపైని అకారమునకు (జ్+అ) ఇవయని ఇకారము పరమగుటవలన నారెంటికిని 'ఏ' కారమను గుణము వచ్చినది.

ధన+ఈశః ఇచ్చట నకారముపైని అకారమునకు ఈశః అని ఈ కారము పరమగుట వలన నా రెంటికి 'ఏ' కారమను గుణము వచ్చినది.

రమా+ఈశః అనునెడ ఆ+ఈ లకు గుణము 'ఏ' కారమువచ్చి రమేశః అనియైనది.

కూప+ఉదకమ్ అనునెడ పకారముపైని అకారమునకు ఉదకమ్ అని అని ఉకారము పరమగుటవలన నారెంటికిని స్థానసామ్యముచే ఓ కారము గుణముగా వచ్చి కూపోదకమ్ అను రూపము సిద్ధించినది.

గఙ్గా+ఉదకమ్ అనునప్పుడు "ఙ్గా" పైని ఆ కారమునకు ఉదకమ్ అను దానిలోని ఉ కారము పరమగుటవలన గుణము 'ఓ' కారము వచ్చి "గఙ్గోదకమ్" అను రూపము సిద్ధించినది.

రామ+ఊహః అనునెడ మకారము మీది అ కారమునకు ఊహః అను పదములోని ఊ కారము పరమగుటవలన ఓ కారము వచ్చి "రామోహః" అనియు;

రామా+ఊరూ అనునెడ ఆ కారమునకు ఊకారము పరమగుటవలన "రామోరూ" అనియు గుణసంధి రూపములు సిద్ధించినవి. ఇట్లు ఏ, ఓ లను గుణముల కుదాహరణములొసంగఁ బడినవి.

ఇక అకారరూప గుణమున కుదాహరణములు:-

కృష్ణ+ఋద్ధిః. ఇచ్చట 'ష్ణ' పైని అకారమునకు 'ఋ' యనెడి ఇక్కు పరమగుట వలన, అకారమునకును ఋకారమునకును స్థానసామ్యముచే "అర్" అని రేఫముతో గూడిన 'అ' యను గుణము వచ్చి "కృష్ణర్ధిః" అని రూపము సిద్ధించినది. కృష్ణ్+అర్+ధిః అని దానికి విభాగము.

తవ+ఌకారః అనునెడ 'వ' పైని అ కారమునకు ఌ యనెడి ఇక్కు పరమగుట వలన అకారమునకును ఌ కారమునకును స్థానసామ్యముచే 'అల్' అని లకారముతో గూడిన 'అ' యను గుణము వచ్చి "తవల్కారః" అను రూపము సిద్ధించినది.

తవ్+అల్+కారః అని దానికి విభాగము. ఋ కారము పరమైన ప్రకృతిభావసంధియు చెప్పఁబడును.

**మూలమ్:-**

**3.** వృద్ధిసన్ధిః—అ కారాన్తా దాకారాన్తాద్వా, ఏచి పరే పూర్వపరయోః స్థానే వృద్ధిరేకాదేశ స్స్యాత్. యథా—

తస్య+ఏషః=తస్యైషః; ప్రథమా+ఏకవచనమ్=ప్రథమైకవచనమ్; గృహ+ఓషధిః=గృహౌషధిః; గఙ్గా+ఓఘః=గఙ్గౌఘః; దేవ+ఐశ్వర్యమ్ =దేవైశ్వర్యమ్; రమా+ఐక్యమ్=రమైక్యమ్; కృష్ణ+ఔత్కణ్ఠ్యమ్ = కృష్ణౌత్కణ్ఠ్యమ్, రమా+ఔదార్యమ్=రమౌదార్యమ్,

**అనువాదము**

**3.** వృద్ధిసంధి:-అ కారాన్త శబ్దమునకుగాని, ఆకారాన్త శబ్దమునకు గాని ఏచ్ అనగా ఏ-ఓ-ఐ-ఔ లు పరములైనచో పూర్వమందలి యక్షరమునకును, పరమందలి యక్షరమునకును కలిసి వృద్ధి ఏకాదేశముగవచ్చును.

ఎట్లనగా—తస్య+ఏషః అనునెడ 'స్య' పైని అకారమునకు "ఏషః" అనునెడ ఏకారము అనగా ఏచ్ పరమైనందు వలన ఆ రెండక్షరములకును అనగా అ+ఏ లకు కలసి "ఐ" ఆదేశమైనందువలన "తస్యైషః" అను రూపము సిద్ధించినది.

అట్లే ప్రథమా+ఏకవచనమ్ అనునెడ 'మా' పైని ఆకారమునకు, ఏకవచనమ్ అనునెడ దానిలోని ఏ అనగా ఏచ్చు పరమగుట వలన ఆరెండక్షరములకును, అనగా-ఆ+ఏ అక్షరములకు పూర్వము వలెనే "ఐ" ఆదేశమై "ప్రథమైకవచనమ్" అను రూపము సిద్ధించినది.

అట్లే-గృహ+ఓషధిః అనునెడ "హ" కారముపైని ఆకారమునకు 'ఓషధిః' అనునెడ 'ఓ' కారము పరమగుటవలన రెంటికిని అనగా అ+ఓ లకు కలసి 'ఔ' కారము ఏకాదేశమై "గృహౌషధిః" అనురూపము సిద్ధించినది.

అట్లే — గంగా+ఓఘః అనునెడ 'గా'కారముపైని ఆ కారమునకు ఓఘః అనునెడ ఓ కారమునకును రెంటికిని అనగా ఆ+ఓ లకు కలసి 'ఔ' కారము ఏకాదేశముకాగా "గంగౌఘః" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే — దేవ+ఐశ్వర్యమ్ అనునెడ వ కారముపైని అ కారమునకును ఐశ్వర్యములోని ఐ కారమునకును కలసి 'ఐ' కారము ఏకాదేశము కాగా "దేవైశ్వర్యమ్" అను రూపము సిద్ధించినది.

అట్లే — రమా + ఐక్యమ్ అనునెడ మా పైని ఆ కారమునకు ఐక్యమనునెడ ఐ కారమునకును కలసి 'ఐ' కారము రాగా "రమైక్యమ్" అనురూపము సిద్ధించినది.

అట్లే — కృష్ణ+ఔత్కణ్ఠ్యమ్ అనునెడ 'ష్ణ' పైని అకారమునకును ఔత్కణ్ఠ్యమ్ అనునెడ ఔ కారమునకును కలసి ఔ కారము రాగా "కృష్ణౌత్కణ్ఠ్యమ్" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే — రమా+ఔదార్యమ్, అనునెడ 'మా' పైని ఆ కారమునకును "ఔదార్యమ్" అనునెడ ఔ కారమునకును కలసి 'ఔ' కారమురాగా "రమౌదార్యమ్" అను రూపము సిద్ధించుచున్నది.

**మూలమ్:— అత్ర విశేషః.**

**4. అకారాన్తా దుపసర్గాత్ ఋకారాదౌ ధాతౌ పరే వృద్ధి రేకాదేశః స్యాత్. యథా - ప్ర+ఋచ్ఛతి=ప్రార్ఛతి; ఏవముపార్ఛతీత్యాది. తత్ర విశేషః - నామధాతౌ పరేతువా. ప్ర+ఋషభీయతి=ప్రార్షభీయతి, ప్రర్షభీయతీత్యాది.**

**అనువాదము:—**

ఇచ్చట నొక విశేషము :—

4. అకారాన్తమైన ఉపసర్గకు ఋకారము ఆదియందుగల ధాతువు పరమైనచో వృద్ధి అనగా సామ్యమును బట్టి ఆ కారము అనగా రేఫసహితమైన ఆ కారము ఏకాదేశమగును.

ఎట్లనగా— ప్ర + ఋచ్ఛతి అనునెడ 'ప్ర' అనునది అకారాన్తమైన యుపసర్గ. దీనికి 'ఋచ్ఛతి' యని ఋకార మాదియందుగల ధాతువు పరమైనందువలన 'ఆర్' అని రేప సహితమైన ఆ కారము వృద్ధిపేరుతో నా రెంటికిని అనగా 'ప్ర' పైని అకారమునకును 'ఋచ్ఛతి'లోని ఋ కారమునకును ఆ దేశము కాగా "పార్చ్ఛతి" అను రూపము సిద్ధించినది.

ఇట్లే- ఉప + ఋచ్ఛతి = ఉపార్ఛతి యనునదియు నూహ్యము.

అందొక విశేషము—నామ ధాతువు పరమైనప్పుడు ఈ వృద్ధి వికల్పము కాన నొక పక్షమున వృద్ధి మఱియొక పక్షమున గుణము వచ్చును.

ఎట్లనగా—ప్ర+ఋషభీయతి అనునెడ ఋషభీయతి (ఋషభ ఇవ ఆచరతి) అనునది నామధాతువు. కాన నిది పరమైనందువలన 'ప్ర' అనునెడ అకారమునకును ఋషభీయతి యనునెడ ఋ కారమునకును కలసి పూర్వమువలె 'ఆర్' రాగా 'ప్రార్షభీయతి' యను రూపము సిద్ధించును. ఇది వికల్పము గాన, ఇది రాని పక్షమున గుణము 'అర్' రాగా 'ప్రర్షభీయతి' యను హ్రస్వాకారముతోఁ గూడిన రూపము సిద్ధించును.

**మూలమ్:-**

5. అవర్ణాత్ ఏజాద్యోః ఇణ్ధాత్వేధధాత్వోః పరయోః ఊఠాదేశే పరే చ (పరరూపం గుణఞ్చ బాధిత్వా) వృద్ధిర్భవతి. యథా-ఉప+ఏతి=ఉపైతి; ప్ర+ఏధతే=ప్రైధతే; ప్రష్ఠ+ఊహః=ప్రష్ఠౌహః.

**అనువాదము :-**

5. అవర్ణమునకు ఏచ్ అనగా-ఏ-ఐ-ఓ-ఔ అక్షరములాది యందు గల ఇణ్ ధాతువుగాని, ఏధ ధాతువుగాని పరమైనప్పుడును, ఊఠాదేశము పర

మైనపుడును పరరూపమును గుణమును రానీయక వృద్ధివచ్చును.

ఎట్లనగా—ఉప+ఏతి అనునెడ పకారముపైని అకారమునకు 'ఏతి' అను 'ఏచ్' ఆది యందుగల ఇణ్ ధాతువు పరమైనందు వలన ఆ రెంటికిని అనగా అ+ఏ లకు కలసి వృద్ధిరాగా "ఉపైతి" యను రూపము సిద్ధించుచున్నది.

అట్లే—ప్ర+ఏధతే, అనునెడ "ప్ర" పైని అకారమునకును 'ఏధతే' లోని ఏ కారమునకును అనగా అ+ఏ లకు కలసి వృద్ధిరాగా "ప్రైధతే" యను రూపము సిద్ధించుచున్నది.

అటే ప్ర+ఊహః అనునెడ 'ప్ర' పైని అకారమునకును 'ఊహః' అను ఊఢా దేశములోని ఉకారమునకును కలసి వృద్ధిరాగా ప్రౌహః అను రూపము సిద్ధించుచున్నది.

మూలమ్ :

6. ప్రేత్యుపసర్గాత్ ఊహ, ఊఢ, ఊఢి, ఏష, ఏష్య; ఋణ, ఏషు పరేషు వృద్ధిః. క్రమేణో దాహరణాని: ప్రౌహః, ప్రౌఢః, ప్రౌఢిః, ప్రైషః, ప్రైష్యః, ప్రార్ణమ్. ప్రేషః, ప్రేష్యః ఇత్యాదౌ ప్ర+ఈష, ఈష్య ఇతిజ్ఞేయమ్.

అనువాదము :

6. 'ప్ర' అను ఉపసర్గకు ఊహ, ఊఢ, ఊఢి, ఏష, ఏష్య, ఋణ శబ్దములు పరములైనపుడు వృద్ధి వచ్చును,

వీనికి క్రమముగా నుదాహరణములు:—

ప్ర+ఊహః. ఇచ్చట 'ప్ర' అను ఉపసర్గకు ఊహాశబ్దము పరమైనందు వలన వృద్ధిరాగా "ప్రౌహః" అను రూపము; 'ఊఢ' శబ్దము పరమగుటవలన "ప్రౌఢః" అను రూపము; 'ఊఢి' శబ్దము పరమైనందువలన "ప్రౌఢిః" అనురూపము; 'ఏష' శబ్దము పరమైనందువలన 'ప్రైష' అనురూపము, 'ఏష్య' శబ్దము పరమైనందు వలన "ప్రైష్యః" అను రూపము, 'ఋణ' శబ్దము పరమైనందువలన "ప్రార్ణ" అను రూపము వృద్ధి వచ్చుటవలన సిద్ధించుచున్నది.

ప్రేషః, ప్రేష్యః ఇత్యాది స్థలముల యందు ప్ర+ఈషః; ప్ర+ఈష్యః అని విభజించుకొని గుణమునుఁ జెప్పవలయునేగాని ప్ర+ఏషః; ప్ర+ఏష్యః అని విభజింపరాదు.

మూలమ్:-

7. అక్ష శబ్దాత్ ఊహినీ శబ్దే పరే; స్వశబ్దాత్ ఈర, ఈరిన్ శబ్దే పరే; వత్సతర, కమ్బల, వసన, దశ, ఋణ ఏభ్యః ఋణశబ్దేపరే; తృతీయాసమాసే ఋత శబ్దేపరే చవృద్ధిస్స్యాత్. క్రమేణోదాహరణాని.

అక్షౌహిణీ; స్వైరిణీ; వత్సతరార్ణమ్; కమ్బలార్ణమ్; వసనార్ణమ్; దశార్ణః దేశః. నదీ చ దశార్ణా. ఋణార్ణమ్=ఋణాపనయనాయ కృత మన్యదృణమ్; సుఖార్తః=సుఖేన ఋతః. అన్యత్ర పరమర్తః

అనువాదము :

7. 'అక్ష' శబ్దమునకు 'ఊహినీ' శబ్దము పరమైనను, 'స్వ' శబ్దమునకు 'ఈర' 'ఈరిన్' శబ్దములు పరమైనను; 'వత్సతర,' 'కమ్బల,' 'వసన,' 'దశ' 'ఋణ' శబ్దములకు 'ఋణ' శబ్దము పరమైనపుడును, తృతీయా సమాసమునందు 'ఋత' శబ్దము పరమైనను వృద్ధి వచ్చును.

వానికి క్రమముగా నుదాహరణములు.—

| | |
|---|---|
| అక్ష+ఊహినీ | =అక్షౌహిణీ |
| స్వ+ఈరః | =స్వైరః. |
| స్వ+ఈరిణీ | =స్వైరిణీ |
| వత్సతర+ఋణమ్ | =వత్సతరార్ణమ్. |
| కమ్బల+ఋణమ్ | =కమ్బలార్ణమ్. |
| వసన+ఋణమ్ | =వసనార్ణమ్. |
| దశ+ఋణః | =దశార్ణః |

దశార్ణమనగా నొకదేశము. దశార్ణయనగా నొక నది.

ఋణ+ఋణమ్=ఋణార్ణమ్. ఋణమును తొలగించుకొనుటకై చేసెడి మరియొక ఋణము ఋణార్ణమనఁబడును.

తృతీయా సమాసమునకు—

సుఖేన+ఋతః=సుఖార్తః.

తృతీయా సమాసము రానిచోట నీవృద్ధిరాదు. ఎట్లనగా-పరమశ్చా సౌ ఋతశ్చ పరమర్తః అని గుణము వచ్చునే గాని పరమార్తః అని వృద్ధి రాదు. ఏలయన నిది కర్మధారయ సమాసము.

**మూలమ్ :**

**8. యణాదేశసన్ధిః:** ఇకారస్థానే యణః స్వరసవర్ణే అచి పరే. దధి+అత్ర=దధ్యత్ర; సుధీ+ఉపాస్యః=సుధ్యుపాస్యః; అతి+ఊర్ధ్వమ్=అత్యూర్ధ్వమ్; మతి+ఋద్ధిః=మత్యృద్ధిః; అపి+ఏవమ్=అప్యేవమ్; దధి+ఓదనమ్=దధ్యోదనమ్; హరి+ఐశ్వర్యమ్=హర్యైశ్వరమ్; బుద్ధి+ఔత్కణ్ఠ్యమ్=బుద్ధ్యౌత్కణ్ఠ్యమ్: మధు+అరిః= మధ్వరిః; వధూ+ఆకృతిః= వధ్వాకృతిః; పితృ+అంశః=పిత్రంశః; ఌ+ఆకృతిః=లాకృతిః; శేషమూహ్యమ్.

**అనువాదము :**

**8.యణాదేశసంధి :** ఇక్కులకు అనగా ఇ-ఉ-ఋ-ఌ అను అక్షరములకు సవర్ణములు కాని అచ్చులు పరమైనపుడు వరుసగా య-వ-ర-ల వర్ణములాదేశములగును.

ఎట్లనగా— దధి+అత్రః ఇచ్చట 'ధి' పైని ఇకారమునకు 'అత్ర' అను దానిలోని 'అ' వర్ణము సవర్ణముకాని అచ్చు. అది పరమైనందువలన 'ఇ' కారమునకు యకారము అనగా యణ్ ఆదేశమురాగా దధ్‌య్+అత్ర=దధ్యత్రఅను రూపము సిద్ధించినది.

అట్లే సుధీ+ఉపాస్యః అనునెడ 'ధీ' లోని ఈ కారమునకు అసవర్ణమైన అచ్చగు 'ఉ' కారము పరముకాగా 'ఈ' కారమునకు 'య్' అనగా యణ్ ఆదేశమురాగా సుధ్‌య్+ఉపాస్యః = సుధ్యుపాస్యః అను రూపము సిద్ధించుచున్నది.

ఇట్లే అత్యూర్ధ్వమ్ అనునెడ అత్‌య్+ఊర్ధ్వమ్=అత్యూర్ధ్వమ్ అనియు

మతి+ఋద్ధిః అనునెడ మత్‌య్+ఋద్ధిః=మత్యృద్ధిః యనియు,

అపి+ఏవమ్ అనునెడ అప్‌య్+ఏవమ్=అప్యేవమ్ అనియు,

దధి+ఓదనమ్ అనునెడ దధ్య్+ఓదనమ్=దధ్యోదనమ్ అనియు,

హరి+ఐశ్వర్యమ్ అనునెడ హర్య్+ఐశ్వర్యమ్ = హర్యైశ్వర్యమ్ అనియు,

బుద్ధి+ఔత్కణ్ఠ్యమ్ అనునెడ బుద్ధ్య్+ఔత్కణ్ఠ్యమ్ అనియు ఇకారమునకు యణాదేశ రూపముల నూహించునది.

అట్లే మధు+అరిః అనునెడ మధు శబ్దము చివరనున్న ఇక్కునకు అనగా ఉకారమునకు అరిః అని అసవర్ణమైన అచ్చు పరముకాగా స్థానసామ్యముచే ఉకారమునకు యణ్ అనగా వకారము ఆదేశముకాగా మధ్వ్+అరిః = మధ్వరిః అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే వధూ+ఆకృతిః అనునెడ 'వధూ' శబ్దము చివరనున్న ఇక్కునకు అనగా ఊకారమునకు ఆకృతిః అనునెడ అసవర్ణమైన ఆకారము పరముకాగా యణ్ 'వ' కారమురాగా వధ్వ్+ఆకృతిః= "వధ్వాకృతిః" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే పితృ+అంశః అనునెడ 'పితృ' శబ్దము చివరనున్న ఇక్కునకు అనగా ఋకారమునకు 'అంశః' అనునెడ అసవర్ణమైన అచ్చు అకారము పరమగుటవలన స్థాన సామ్యముచే 'ర్' అనగా యణ్ ఆదేశముకాగా పితర్+అంశః='పిత్రంశః' అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే ఌ+ఆకృతిః అనునెడ ఇక్కునకు అనగా 'ఌ' కారమునకు అసవర్ణమైన ఆకారము పరమైనందు వలన స్థానసామ్యముచే 'ల' కారమురాగా ల్+ఆకృతిః="లాకృతి" అనురూపము సిద్ధించినది. ఇట్లే తక్కినచోట్ల నూహించుకొనవలయును.

**మూలమ్ :**

**9. యాన్తాదేశసన్ధిః, వాన్తాదేశసన్ధిశ్చ**— ఏచాం స్థానే క్రమాత్ అయ్, అవ్, ఆయ్, ఆవ్ ఏతే ఆదేశాస్స్వరచిపరే. హరే+ఏ=హరయే; విష్ణో+ఏ=విష్ణవే; నై+అకః=నాయకః; పౌ+అకః=పావకః.

**అనువాదము :—**

**అత్రవిశేషః.**

**9. యాన్తాదేశ సన్ధి మఱియు వాన్తాదేశ సంధి :-**

అచ్చు పరమైనచో ఏచ్చుల యొక్క అనగా ఏ - ఓ - ఐ - ఔ ల యొక్క స్థానమునందు క్రమముగా అయ్ - అవ్ - ఆయ్ - ఆవ్ లు - ఆదేశము లగును.

ఎట్లనగా - హరే + ఏ అనునెడ "హరే" యందలి 'ఏ' కారమునకు 'ఏ' అను అచ్చు పరమైనందున 'అయ్' ఆదేశమురాగా - హర్‌అయ్+ఏ = హరయే అను రూపము సిద్ధించు చున్నది.

అట్లే విష్ణో + ఏ అనునెడ 'ష్ణో' పైని ఓకారమునకు 'ఏ' అను నచ్చు పరమై యున్నందున 'అవ్' ఆదేశమురాగా విష్ణ్అవ్ + ఏ = విష్ణవే అను రూపము సిద్ధించు చున్నది.

అట్లే నై + అకః అనునెడ 'నై' పైని 'ఐ' కారమునకు 'అకః' లోని 'అ' యను అచ్చు పరమగుటవలన 'ఆయ్' ఆదేశముకాగా న్‌ఆయ్ + అకః = "నాయకః" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే పౌ + అకః అనునెడ 'పౌ' పైని 'ఔ' కారమునకు 'అకః' లోని 'అ' యను అచ్చు పరమగుటవలన 'ఆవ్' ఆదేశముకాగా "పావకః" అను రూపము సిద్ధించుచున్నది.

**మూలమ్ :- అత్రవిశేషః :-**

10. యకారాదౌ ప్రత్యయే పరే ఓకారౌ కారయోః అవ్, ఆవ్ ఏతావా దేశౌ స్తః. గో + యత్ = గవ్యమ్; నౌ + యత్ = నావ్యమ్; (గో + యూతిః = గవ్యూతిః) ఏవం లవ్యవ్; అవశ్య లావ్యమ్. యాన్తాదేశవిషయే - శక్యార్థే క్షయ్య జయ్యావితి; క్రయణార్థమేవేత్యర్థే క్రయ్యమితి చ విశేషః. అన్యత్ర క్షేతుం యోగ్యం క్షేయమ్, జేతుం యోగ్యం జేయమ్; క్రేయమ్ = క్రయణార్హమ్.

అనువాదము :-

ఇచట నొక విశేషము.

10. యకారమాది యందుగల ప్రత్యయము పరమైనపుడు 'ఓ' కారము నకు 'అవ్' 'ఔ' కారమునకు 'ఆవ్' ఆదేశములగును.

ఎట్లనగా - గో + యత్ అనునెడ 'గో' శబ్దములోని ఓ కారమునకు 'యత్' అను యకారమాదియందుగల ప్రత్యయము పరమగుటవలన ఓ కారము నకు 'అవ్' ఆదేశమురాగా 'గవ్య' మను రూపము సిద్ధించుచున్నది.

అట్లే - నౌ + యత్ అనునెడ 'నౌ' శబ్దములోని 'ఔ' కారమునకు 'యత్' అను యకారాదియైన ప్రత్యయము పరమగుటవలన 'ఆవ్' ఆదేశము కాగా 'నావ్యమ్' అను రూపము సిద్ధించుచున్నది.

ఇట్లే - గవ్యూతిః, లవ్యమ్, అవశ్య లావ్యమ్ ఇత్యాదులూహ్యములు.

యాన్తాదేశవిషమునందు-క్షేతుం శక్యం, జేతుం శక్యం అనునర్థములలో క్షయ్య జయ్య శబ్దములు నిపాతితములు. అటే క్రయ్య శబ్దము క్రయించుటకై యుద్దేశింపఁబడిన వస్తువు నందు నిపాతితము. కావున క్షేతుం యోగ్యం, జేతుం యోగ్యం. క్రేతుం యోగ్యమను నర్థములలో యాంతాదేశములు రానందువలన క్షేయమ్. జేయమ్, క్రేతుమ్ అను రూపములు సిద్ధించుచున్నవి.

మూలమ్ :

11. పూర్వరూపసన్ధిః :- పదాన్తాత్ ఏఙః హ్రస్వాకారే పరే పూర్వ రూపం (పూర్వపరయోః స్థానే) స్యాత్. హరే + అవ=హరేఽవ. విష్ణో + అవ=విష్ణోఽవ.

అనువాదము :-

11. పూర్వరూపసంధి :- పదము చివరనున్న ఏఙునకు అనగా ఏ-ఓ లకు హ్రస్వాకారము పరమైనపుడు పూర్వరూపము పూర్వపరస్థానమునందు వచ్చును.

ఎట్లనగా- హరే + అవ అనునెడ 'హరే' అను పదము చివరి 'ఏ' కార మునకు అనగా ఏఙునకు 'అవ' అనునప్పుడు హ్రస్వమైన అకారము పరమై

యున్నందున 'హరే'లోని 'ఏ'కారమునకును 'అవ'లోని 'అ' కారమునకును కలసి పూర్వరూపము అనగా 'ఏ' కారము రాగా "హరేఽవ" అను రూపము సిద్ధించుచున్నది.

అటే విష్ణో+అవ అనునెడ విష్ణో అను పదము చివరనున్న 'ఓ' కారమునకు అనగా ఏఙునకు "అవ" అనునప్పుడు హ్రస్వమైన అకారము పరమైయున్నందున, 'విష్ణో' లోని 'ఓ' కారమునకు 'అవ' లోని 'అ' కారమునకు కలసి పూర్వరూపము అనగా 'ఓ' కారము రాగా విష్ణోఽవ అను రూపము సిద్ధించున్నది.

**మూలమ్ :—**

**12. పరరూపసన్ధిః :—** అవర్ణాన్తోపసర్గాత్ ఏజాదౌ ధాతౌ పరే పరరూపం నిత్యం స్యాత్. ఏజాదౌ సుబన్తధాతౌ పరేతు వా. సమాసే ఓష్ఠశబ్దే పరేపి వా. ప్ర+ఏజతే = ప్రేజతే, ఉప+ఓషతి = ఉపోషతి; ఉపేడకీయతి; ఉపైడకీయతి. బిమ్బ+ఓష్ఠః = బిమ్బోష్ఠః; బిమ్బౌష్ఠః, స్థూలోతుః; స్థూలౌతుః. (అసమాసే తవౌష్ఠ ఇత్యేవ.)

**అనువాదము :—**

**12. పరరూప సంధి :—** అకారము చివరగల్గిన ఉపసర్గకు ఏజ్ అనగా- ఏ - ఓ అక్షరముల నాదియందు గలిగిన ధాతువు పరమైనచో పరరూపము నిత్యముగా వచ్చును. ఏజాదియైన సుబంతధాతువు పరమైనచో వికల్పముగా వచ్చును. సమాసమందు ఓష్ఠ శబ్దము పరమైనను వికల్పముగా వచ్చును.

ఎట్లనగా— ప్ర+ఏజతే అనునెడ 'ప్ర' అనునది అకారము చివరగలిగిన యుపసర్గ. దీనికి 'ఏజతే' యని ఏజాదియైన ధాతువు పరమైయున్నందువలన పరరూపమైన ఏకారము పూర్వపరములకు రెంటికిని రాగా "ప్రేజతే" యను రూపము సిద్ధించున్నది.

అట్లే ఉప+ఓషతి అనునెడ 'ఉప' అనునది అకారము చివరగలిగిన యుపసర్గ. దీనికి 'ఓషతి' యని ఏజాదియైన ధాతువు పరమైయున్నందున పరరూపమైన ఓకారము పూర్వ పరములకు రెంటికిని రాగా "ఉపోషతి" యను రూపము సిద్ధించుచున్నది. ఈ రెండు రూపములు నిత్యములు.

కాని, ఉప+ఏడకీయతి యనునెడ 'ఉప' యనునది అకారాంతపు టుపసర్గ యైనను, 'ఏడకీయతి' యనునది సుబ్ధాతువగుటవలన నందలి ఏ కారము ఏజ్గా నున్నను వికల్పముగనే పరరూపమువచ్చును. కాన ఉప యను నుపసర్గలోని యకారమునకు 'ఏడకీయతి' లోని ఏ కారము పరమగుటవలన వికల్పముగా పరరూపమురాగా "ఉపేడకీయతి" యను రూపము వికల్పముగా సిద్ధించుచున్నది. ఇది వికల్పముకాన నిది రాని పక్షమున ఉప+ఏడకీయతి యనునెడ వృద్ధిరాగా "ఉపైడకీయతి" యను రూపాంతరము గూడ సిద్ధించుచున్నది.

బింబోష్ఠః అను సమాసమందు బింబశబ్దమునకు ఓష్ఠ శబ్దము పరము కాగా బింబ శబ్దము చివరి అకారమునకు ఓష్ఠశబ్దము మొదటనున్న ఓ కారము నకు కలసి పరరూపమైన ఓ కారము వికల్పముగా రాగా "బింబోష్ఠః" అను రూపము సిద్ధించుచున్నది. ఇది వికల్పము కావున పరరూపము రాని పక్షమున ఆ 'అ'కారమునకును 'ఓ' కారమునకును వృద్ధి రాగా 'బింబౌష్ఠః' అను రూపము గూడ సిద్ధించుచున్నది.

ఇట్లే సమాసమందు స్థూలశబ్దమునకు ఓతుశబ్దము పరమైనచో స్థూల+ఓతుః అనునెడ పూర్వమువలె పరరూపము వికల్పముగా రాగా స్థూలోతుః అనియు, అదిరాని పక్షమున వృద్ధిరాగా "స్థూలౌతుః" అనియు రూపము సిద్ధించుచున్నది.

కాని, సమాసముకాని స్థలమున అనగా తవ+ఓష్ఠః ఇత్యాది స్థలమున పరరూపము రాదు. వృద్ధియే వచ్చి "తవౌష్ఠః" అను రూపము సిద్ధించుచున్నది.

మూలమ్ :

13. శకన్ధ్వాదిగణ పఠితేషు టేః పరరూపం వక్తవ్యమ్. టిర్నామ క్వచిదన్త్యాజ్వర్ణః, క్వచిద్వ్యఞ్జనపర అన్త్యాజ్వర్ణః. యథా-శక ఇత్యత్ర అకారః, మనస్ ఇత్యత్ర అస్, పతత్ ఇత్యత్ర అత్. ఏవం సర్వత్ర బోధ్యమ్. శక+అన్ధుః = శకన్ధుః. మనస్+ఈషా = మనీషా. పతత్+అఞ్జలిః = పతఞ్జలిః. కుల+అటా=కులటా. ఏవం లాఙ్గలీషా, కర్కన్ధుః, మార్తణ్డః, సీమన్తః=కేశవేశః, తద్భిన్నార్థే సీమాన్త ఇత్యాది జ్ఞేయమ్. శకన్ధ్వాది రాకృతిగణః.

**అనువాదము :**

13. శకంధు మున్నగు శబ్దములతోఁ బ్రారంభింపఁబడిన శకంధ్వాది శబ్దముల యందు "టి" యనుసంజ్ఞగల భాగమునకు పరరూపమే చెప్పవల యును. "టి" యనగా-కొన్నియెడల అంత్యమైన అచ్చు. 'శక' అనునెడ కకారము తరువాత నున్న అకారము. కొన్నియెడల వ్యంజనము పరమైన అచ్చు. 'మనస్' అనునెడ 'అస్', 'పతత్' అనునెడ 'అత్' ఇత్యాదులరయునది.

ఉదాహరణములు—

శక+అంధుః అనునెడ కకారముపైని అకారము 'టి'. దానికి అకారము పరమైనందు వలన పరరూపము రెంటికిని రాగా 'శకంధుః' అని రూపము సిద్ధించుచున్నది.

మనస్+ఈషా అనునెడ 'అస్' అన్నునది 'టి'. దానికి ఈషా అను నప్పుడు ఈ కారము (అచ్చు) పరమైనందువలన పరరూపమురాగా 'అస్' అనబడు 'టి' తొలగి మనీషా అనురూపము సిద్ధించుచున్నది.

పతత్+అంజలిః అనునెడ 'అత్' అనునది 'టి'. దానికి అంజలిః అను నప్పుడు అకారము పరమైనందువలన పరరూపము రాగా 'అత్' అను 'టి' తొలగిపోయి "పతంజలిః" అను రూపము సిద్ధించినది.

కుల+అటా అనునెడ లకారముపైని అకారము టి. దానికి 'అటా' యని అకారము పరమైనందువలన లకారముపైని 'టి' ని తొలగించి పరరూపము 'రాగా "కులటా" యను రూపము సిద్ధించుచున్నది. ఇటే లాంగలీషా, కర్కంధుః, మార్తండః అను శబ్దములలోను సంధి యూహ్యము.

సీమన్త శబ్దము పాపట యను నర్థము నందు సంధినొందును. దానికి భిన్నమగు నర్థమున సంధినొందక 'సీమాంతః' యనియుండును. శకం ధ్వాదులు ఆ శబ్దముల యాకృతినిఁ జూచి గణింపఁదగినవి.

**మూలమ్ :-**

14 :— అవర్ణాత్ ఓఙ్కారే, అజిచపరే అనవధారణార్థ కే ఏవ శబ్దే పరే చ పరరూపంస్యాత్. శివాయ+ఓం నమః =శివాయోంనమః. శివ+ఆ+

ఇహి = శివేహి. ఏవ మవేహీత్యాది; క్వ+ఏవభోక్ష్యసే = క్వేవభోక్ష్యసే. అవధార ణార్థే తవైవ. అనుకరణే విశేషః. పటత్+ఇతి = పటితి. పటత్పటత్+ఇతి = పటత్పటేతీత్యాది.

**అనువాదము :—**

14. అవర్ణమునకు ఓంకారము 'అజ్' పరమైనవుడును, అనిశ్చయా ర్థకమైన ఏవశబ్దము పరమైనపుడును పరరూపము వచ్చును.

ఎట్లనగా- శివాయ+ఓం నమః అనునెడ యకారముపైని అకారము నకు ఓఙ్కారము పరమైయున్నది. కాన యకారముపైని అకారమును తొల గించి పరరూపమైన ఓంకారము రాగా శివాయోంనమః అను రూపము సిద్ధిం చుచున్నది.

అట్లే శివ+ఆ+ఇహి అనునెడ వకారము పైని అకారమునకు 'ఆ' యను 'అజ్' పరమైయున్నది. కావున పరరూపము రాగా శివా + ఇహి అని రూపమేర్పడినది. దానికి గుణమురాగా 'శివేహి' అను రూపము సిద్ధించుచున్నది. ఇట్లే అవేహి మున్నగు రూపము లూహ్యములు.

అట్లే - క్వ + ఏవ (భోక్ష్యసే) అనునెడ ఏవకారము అనిశ్చితార్థకము. అది పరమగుటవలన పరరూపమురాగా "క్వేవభోక్ష్యసే" యని రూపము సిద్ధించుచున్నది.

తవ+ఏవ అనునెడ ఏవకారము నిశ్చితార్థము గాన నిచట పరరూపము రానందున వృద్ధి ఐకారము రాగా "తవైవ" యను రూపము సిద్ధించుచున్నది.

అనుకరణ శబ్దముల సంధిలో విశేషము :—

పటత్+ఇతి అనునెడ 'అత్' అను 'టి'ని తొలగించి పరరూపము రాగా "పటితి" యను రూపము సిద్ధించుచున్నది.

కాని పటత్పటత్+ఇతి యను ద్విరుక్త స్థలమున 'అత్' అను 'టి' పూర్తిగాఁ దొలగింపఁబడదు. అందులోని తకారము మాత్రమే తొలగిపోగా పటత్పట+ఇతి అను రూప మేర్పడి, తరువాత "పటత్పటేతి" యను రూపము సిద్ధించును.

**మూలమ్ :**

15. **అవజాదేశసన్ధిః :-** పదాన్తే గో శబ్దస్య అచి పరే అవజాదేశో క్వచిత్ వా స్యాత్. ఇన్ద్రశబ్దే పరే నిత్యమ్. గో+అగ్రమ్=గవాగ్రమ్; గోఽగ్రమ్; గో+ఈశః=గవేశః, గవీశః (నిత్యమ్) గవాక్షః; గో+ఇన్ద్రః.

**ఇత్యచ్ సన్ధిః.**

**అనువాదము :**

15. **అవజాదేశసంధి :-** పదాంతమందలి గో శబ్దమునకు అచ్చు పరమైనచో నొకచోట అవజాదేశము వికల్పముగా వచ్చును. ఇన్ద్రశబ్దము పరమైనచో నిత్యముగా వచ్చును.

ఎట్లనగా — గో+అగ్రమ్ అనునెడ గో శబ్దము పదాంతము. దానికి 'అగ్రమ్' అననప్పుడు అచ్చు పరమైనది కావున ఓ కారమునకు అవజాదేశము రాగా గ్+అవ+అగ్రమ్=గవాగ్రమ్. వికల్పము కావున అవజాదేశము రాని పక్షమున గోఽగ్రమ్.

గో+ఈశః అనునెడ అవజాదేశము వికల్పమైనందున, అది వచ్చిన పక్షమున గ్+అవ+ఈశః=గవేశః అనియు, అవజాదేశమురాని పక్షమున అవాదేశమురాగా గ్+అవ్+ఈశః=గవీశః అనియు రూపములు సిద్ధించును.

గో+అక్షః అనునెడ వ్యవస్థితవిభాష ననుసరించి యీ యవజాదేశము నిత్యముగాన, గవాక్షః అను రూపము.

గో+ఇన్ద్రః అనునెడ వ్యవస్థితవిభాష ననుసరించి యీ యవజాదేశము నిత్యముగాన గవేంద్రః అను రూపము సిద్ధించును.

శాస్త్రము, శిష్టప్రయోగములనను సరించి కొన్నిచోట్ల ప్రవర్తింపక పోవుటయు, కొన్నిచోట్ల నిత్యముగా ప్రవర్తించుటయు వ్యవస్థిత విభాష యనబడును.

**ఇట్లు అచ్ సంధి సమాప్తము.**

**మూలమ్ :- అథ ప్రకృతిభావసన్ధిః.**

16. పదాన్తా ఇకః అసవర్ణే అచి పరే ప్రకృత్యా స్యుః, హ్రస్వశ్చ

వా భవతి. సమాసేతు న. చక్రి+అత్ర = చక్రిఅత్ర; చక్రీఅత్ర; చక్ర్యత్ర. సమాసే-వాపీ+అశ్వః = వాప్యశ్వః.

అనువాదము:- ప్రకృతిభావసంధి.

16. పదము చివరనున్న ఇక్కునకు అనగా ఇ-ఉ-ఋ-ౡ వర్ణములకు అచ్చు పరమైనచో నెట్టి వికృతినిబొందక యెట్లున్నవి యట్లేయుండును. ఇట్లుండుటయే ప్రకృతిభావము. అవి వికల్పముగా హ్రస్వమగును. సమాసమునం దీ నియమము వర్తించదు. ఎట్లనగా-చక్రీ+అత్ర అనునెడ ప్రకృతి భావము రాగా చక్రీఅత్ర యని యేర్పడినది. వికల్పముగా హ్రస్వమురాగా చక్రిఅత్ర అను రూపము సిద్ధించును. హ్రస్వము వికల్పము కావున అదిరాని పక్షమున ప్రకృతిభావము తొలగగా యణాదేశము వచ్చుటచే 'చక్ర్యత్ర' అను రూప మేర్పడును.

సమాసమునందీ శాస్త్రము ప్రవర్తించదని చెప్పుట వలన వాప్యామశ్వః = వాప్యశ్వః అనునెడ వాపీ అశ్వః ఇత్యాది ప్రకృతిభావాదులురావు.

మూలమ్ :-

17. పదాన్తస్య అకః ఋకారే పరే సమ్బుద్ధి నిమిత్తకోకారస్య ఇతిశబ్దే పరే; గోశబ్దస్య హ్రస్వాకారే పరే చ ప్రకృతిభావో వా స్యాత్.

సప్త+ఋషయః = సప్తఋషయః, సప్తర్షయః. విష్ణో+ఇతి = విష్ణో ఇతి; విష్ణవితి, గో+అగ్రమ్ = గోఅగ్రమ్; గోఽగ్రమ్.

అనువాదము:-

17. పదాంతమైన అనగా పదము చివరనున్న అక్కునకు అనగా 'అక్' ప్రత్యాహారములో చేరిన అ-ఇ-ఉ-ఋ-ౡ వర్ణములకు ఋకారము పరమైనపుడును; సంబుద్ధివలన నేర్పడునట్టి ఓ కారమునకు 'ఇతి' శబ్దము పరమైనపుడును; గో శబ్దమునకు హ్రస్వాకారము పరమైనపుడును ప్రకృతి భావసంధి వికల్పముగా వచ్చును.

ఎట్లనగా — సప్త+ఋషయః అనునెడ 'ప్త'పైని అకారము అక్కు. దానికి ఋషయః అని ఋ వర్ణము పరమైయున్నది గాన ప్రకృతిభావసంధి రాగా 'సప్తఋషయః' అను రూపమేర్పడును. ఇది వికల్పముగాన, ప్రకృతి

భావము రాని పక్షమున రేఫ సహితమైన ఆ కారము గుణముగాగా స్రష్టయః అనియు రూపమేర్పడినది.

అట్లే విష్ణో+ఇతి అనునెడ "విష్ణో" అను దానిలోని ఓ కారము సంబోధనయందు వచ్చినది అట్టి సంబుద్ధినిమిత్తకమైన ఓకారమునకు 'ఇతి' శబ్దము పరముగానున్నందున ప్రకృతిభావసంధి రాగా 'విష్ణోఇతి' అను రూపమేర్పడును. ఈ ప్రకృతిభావ సంధి వికల్పము కావున ఇదిరాని పక్షమున అవాదేశము రాగా విష్ణవితి యనియు రూపము సిద్ధించుచున్నది.

అట్లే-గో+అగ్రమ్ అనునెడ 'గో' శబ్దమునకు అగ్రమనునపుడు హ్రస్వమైన అకారము పరమైనందువలన ప్రకృతిభావ సంధిరాగా ''గో అగ్రమ్'' అను రూపము సిద్ధించినది. ప్రకృతిభావము రాని పక్షమున పూర్వరూపము రాగా 'గోఽగ్రమ్' అనియు రూపమేర్పడుచున్నది.

మూలమ్:—

18. :- ఈ-ఊ-ఏ, ఏతదన్త ద్వివచనేభ్యః; (మీ,మూ) ఏతదన్తాదదశ్శబ్దాత్; ప్లుతాత్, ఓకారాన్తనిపాతాచ్చ; అచిపరే ప్రకృతిభావః స్యాత్. క్రమాదుదాహరణాని-

హరీ + ఏతౌ = హరీ ఏతౌ; విష్ణూ + ఇమౌ = విష్ణూఇమౌ; గఙ్గే+అమూ = గఙ్గేఅమూ. అమీ+ఈశాః = అమీఈశాః అమూఆసాతే, హేకృష్ణ౩ః ఆ గచ్ఛ; అహో ఈశాః; భో అయుష్మన్.

ఇతి ప్రకృతిభావ సన్ధిః

అనువాదము :—

18. ఈ-ఊ-ఏ వర్ణములను చివర గల్గిన ద్వివచనములకును; 'మీ-మూ' లను చివర గల్గిన అదః శబ్దమునకును; ప్లుతమునకును; ఓ కారము చివరగల్గిన నిపాతమునకును అచ్చు పరమైనచో ప్రకృతిభావము వచ్చును.

ఎట్లనగా-హరీ + ఏతౌ అనునెడ 'హరీ' అనునది ఈ కారము చివర గల్గిన ద్వివచనము. దానికి 'ఏతౌ' అను నప్పుడేకారమచ్చు పరమగుటవలన ప్రకృతిభావసంధిరాగా ''హరీఏతౌ'' అను రూపమేర్పడుచున్నది.

అట్లే-విష్ణూ+ఇమౌ అనునెడ "విష్ణూ" అనునది ఊ కారము చివర గల్గిన ద్వివచనము. దానికి 'ఇమౌ' అనునప్పుడికారమచ్చుపరమై యున్నందున ప్రకృతిభావసంధిరాగా విష్ణూ ఇమౌ అను రూపమేర్పడినది.

అటే గఙ్గే+అమూ అనునెడ "గఙ్గే" అనునది ఏ కారము చివరగల్గిన ద్వివచనము. దానికి 'అమూ' అను నప్పు డకారమచ్చు పరమై యున్నందున ప్రకృతిభావసంధివచ్చి "గఙ్గేఅమూ" అనురూపము సిద్ధించుచున్నది.

అమీ + ఈశాః అనునెడ "అమీ" అనునది 'మీ' యను వర్ణమును చివరగల్గిన అదశ్శబ్దము. దీనికి ఈశాః అనునప్పుడీ కారమచ్చు పరమై యున్నందున ప్రకృతిభావసంధిరాగా "అమీ ఈశాః" అను రూపము సిద్ధించుచున్నది.

అమూ+ఆసాతే అనునెడ 'అమూ' అనునది 'మూ' వర్ణమును చివర గల్గిన అదశ్శబ్దము. దీనికి ఆసాతే అనునప్పుడాకారమచ్చు పరమైయుండుట వలన ప్రకృతిభావసంధిరాగా 'అమూఆసాతే' అనురూపము సిద్ధించుచున్నది.

హేకృష్ణ౩+అగచ్ఛ అనునెడ 'కృష్ణ' శబ్దముపైని అకారము ప్లుతము. దానినే ౩ సూచించుచున్నది. ఈ ప్లుతమునకు 'అగచ్ఛ' అనునప్పుడా కారమచ్చు పరమైనందున ప్రకృతిభావము రాగా "హేకృష్ణ ౩ అగచ్ఛ" యను రూపము సిద్ధించుచున్నది.

అహో+ఈశాః అనునెడ 'అహో' అనునది ఓకారము చివరగల్గిన నిపాతము అనగా అవ్యయము. దీనికి ఈశాః అను నప్పుడీకారమచ్చు పర పరమైనందున ప్రకృతిభావము రాగా 'అహో ఈశాః' అను రూపము సిద్ధించినది.

అట్లే భో+అయుష్మన్ అనునెడ 'భో' అనునది ఓకారాన్త నిపాతము. దీనికి అ యుష్మన్ అననప్పుడా కారమచ్చు పరమైయున్నందున ప్రకృతి భావసంధిరాగా "భోఅయుష్మన్" అను రూపము సిద్ధించుచున్నది.

**ఇంతటితో ప్రకృతిభావసంధి సమాప్తము.**

## అథ హల్ సన్ధిః

**మూలమ్ :—**

**19. శ్చుత్వ సంధిః :—** పూర్వత్ర పరత్ర వా శకార చవర్గాన్యతర యోగే సతి సకార తవర్గయోః క్రమాత్ శకారచవర్గౌ స్తః.

యథా — హరిస్ + శేతే = హరిశ్శేతే; రామస్ + చినోతి = రామశ్చినోతి; సత్ + చిత్ = సచ్చిత్. శార్ఙ్గిన్ + జయ = శార్ఙ్గిఞ్ జయ. [శాత్పర తవర్గస్య న - విశ్నః, ప్రశ్నః.]

**అనువాదము:-** హల్సంధి.

**19. శ్చుత్వసంధి:** —పూర్వమందు గాని పరమందుగాని శకారచవర్గములలో దేనితోదనైన సంబంధమున్నప్పుడు సకార తవర్గములకు క్రమముగా శకార చవర్గలు వచ్చును.

ఎట్లనగా—హరిస్+శేతే అనునెడ పరపదమైన 'శేతే' అను దానిలోని శకారముతో సంబంధముండుటవలన 'హరిస్' లోని సకారమునకు శకారము రాగా హరిశ్+శేతే = "హరిశ్శేతే"యను రూపము సిద్ధించుచున్నది.

అట్లే రామస్+చినోతి అనునెడ "రామస్" లోని సకారమునకు 'చినోతి' లోని చవర్గాక్షరముతో సంబంధముండుటవలన, సకారమునకు శకారమురాగా రామశ్+చినోతి = రామశ్చినోతి అను రూపమేర్పడినది.

అట్లే సత్+చిత్ అనునెడ సత్ లోని తకారమునకు చిత్‌లోని చవర్గాక్షరముతో సంబంధముండుటవలన తకారమునకు చకారము రాగా సచ్+చిత్ = సచ్చిత్ అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే శార్ఙ్గిన్+జయ అనునెడ "జయ" లోని చవర్గాక్షరమైన జకారముతో 'శార్ఙ్గిన్' లో చివరనున్న తవార్గక్షర నకారమునకు సంబంధముండుట వలన ఆ నకారమునకు అనగా తవర్గపంచమాక్షరమునకు చవర్గలోని పంచమాక్షరమైన "ఞ" ఆదేశమై "శార్ఙ్గిఞ్ జయ" అను రూపము సిద్ధించుచున్నది.

కాని శకారమునకంటె పరమైన తవర్గకు శ్చుత్వమురాదు.

ఎట్లన—విశ్+నః అనునెడ పైనియమము ప్రకారము శకారమునకు తవర్గతో సంబంధమున్నందువలన తవర్గపంచమాక్షరమైన నకారమునకు చవర్గపంచమాక్షరము 'ఞ్' రావలసియున్నను పైనిషేధము వలన రాజాలదు.

అట్లే—ప్రశ్+నః అనునెడగూడ శ్చుత్వము రానేరదు.

మూలమ్ :-

**20.** ష్టుత్వసన్ధిః :— సకారతవర్గయోః క్రమేణ షకారటవర్గౌ స్తః, షకార టవర్గయోర్యోగే సతి. నతు పదాన్తస్థాత్ టవర్గాత్పరయోస్సకార తవర్గయోః; నచాపి తవర్గస్య షకారేపరే.

యథా—రామస్+షష్ఠః = రామష్షష్ఠః; హరిస్+టీకతే = హరిష్టీకతే; పేష్+తా=పేష్టా; తత్+టీకా=తట్టీకా; చక్రిన్+ఢౌకసే=చక్రిణ్ఢౌకసే; షట్+సన్తః=షట్సన్తః; షట్+తే=షట్తే; సన్+షష్ఠః=సన్షష్ఠః.

అనువాదము:-

**20.** ష్టుత్వసంధి : — సకారమునకుగాని తవర్గకుగాని షకార టవర్గలతో సంబంధమున్నచో క్రమముగా షకారటవర్గలు వచ్చును. కాని పదము చివరమున్న టవర్గకు పరమైన సకార తవర్గలకును, తవర్గకు షకారము పరమైనను ఈష్టుత్వమురాదు.

ఎట్లనగా—రామస్+షష్ఠః అనునెడ 'రామస్' లోని సకారమునకు 'షష్ఠః' లోని షకారముతో సంబంధముండుట వలన సకారమునకు షకారము రాగా రామష్+షష్ఠః=రామష్షష్ఠః అను రూపము సిద్ధించినది.

అట్లే-హరిస్+టీకతే అనునెడ 'హరిస్' లోని సకారమునకు 'టీకతే' లోని ట కారముతో సంబంధముండుటవలన సకారమునకు షకారమురాగా హరిష్+టీకతే="హరిష్టీకతే" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే-పేష్+తా అనునెడ 'పేష్' లోని షకారమునకు 'తా' అనునప్పుడు తకారముతో సంబంధముండుటవలన తకారమునకు టకారమురాగా 'పేష్టా' యను రూపము సిద్ధించుచున్నది.

అట్లే—తత్+టీకా అనునెడ తకారమునకు టకారముతో సంబంధ ముండుట వలన త కారమునకు ట కారమురాగా తట్+టీకా='తట్టీకా' అను రూపము సిద్ధించుచున్నది

అట్లే-చక్రిన్+ఢౌకసే అనునెడ తవర్గ పంచమాక్షరమైన న కార మునకు టవర్గాక్షరమైన ఢ కారముతో సంబంధముండుటవలన తవర్గ పంచ మాక్షరమైన 'న' కారమునకు ట వర్గ పంచమాక్షరమైన 'ణ' కారమురాగా చక్రిణ్+ఢౌకసే=చక్రిణ్ఢౌకసే యను రూపము సిద్ధించుచున్నది.

ఇందు విశేషము.

షట్+సన్తః, షట్+తే అను స్థలములయందు పదాంతమునందు టకారముండుట వలన సంధి రాలేదు, అనగా ష్టుత్వమురాలేదు.

సన్+షష్ఠః అనునెడ తవర్గాక్షరమైన నకారమునకు షకారము పర మగుటవలనను ష్టుత్వమురాలేదు.

**మూలమ్ :**

**21.** జశ్త్వసన్ధిః- పదాన్తే వర్తమానానాం ఝలాం స్థానే సవర్ణా జశస్స్యుః.

యథా-అచ్+అన్తః=అజన్తః; అజ్వర్ణః; అప్+లిఙ్గమ్ = అబ్లిఙ్గమ్; అబిన్ద్రియమ్; వాక్+ఈశః వాగీశః; వాగ్వాదః; షట్+అఙ్గః = షడఙ్గః; షడ్వారమ్; చిత్+రూపమ్=చిద్రూపమ్; చిదంశః.

**అనువాదము :**

**21.** జశ్త్వసంధి :- పదాన్తమునందున్న ఝల్ వర్ణములకు అనగా- "ఝ భ ఞ్"; "ఘ ఢ ధ ష్", "జ బ గ డ ద శ్"; "ఖ ఫ ఛ ఠ థ చ ట తవ్; "క ప య్"; "శ ష స ర్"; "హల్"; అను సూత్రముల యందున్న "ఝ" మొదలు "హ" వరకు గలవర్ణములయొక్క స్థానమున సవర్ణములైన జశ్ వర్ణములు అనగా "జ బ గ డ ద శ్" అను సూత్రము లోని వర్ణములు వచ్చును.

ఎట్లనగా-అచ్+అన్తః అనునెడ 'అచ్' అను పదము చివరనున్న

ఝల్ చకారమునకు సవర్ణమైన జశ్ అనగా జకారము రాగా అజన్తః అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే అచ్+వర్ణః అనునెడ 'అచ్' అను పదము చివరనున్న ఝల్ చకారమునకు సవర్ణమైన జశ్ అనగా జకారము రాగా అజ్వర్ణః అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే అప్+లింగమ్ అనునెడ "అప్" అను పదాంతమందున్న ఝల్ వర్ణమైన పకారమునకు సవర్ణమైన జశ్ అనగా బకారమురాగా "అబ్లింగమ్" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే అప్+ఇంద్రియమ్=అబింద్రియమ్ అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే వాక్+ఈశః అనునెడ 'వాక్' అను పదము చివరనున్న ఝల్ వర్ణమైన కకారమునకు సవర్ణమైన జశ్ వర్ణము గకారము రాగా 'వాగీశః' అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే వాక్+వాదః=వాగ్వాదః అను రూపము సిద్ధించును.

షట్+అఙ్గః అనునెడ 'షట్' అను పదము చివరనున్న ఝల్ వర్ణమైన టకారమునకు సవర్ణమైన జశ్ వర్ణము డ కారమురాగా 'షడఙ్గః' అను రూపము సిద్ధించినది.

అట్లే షట్+వారమ్=షడ్వారమ్ అను రూపము సిద్ధించును.

చిత్+రూపమ్ అనునెడ 'చిత్' అను పదము చివరనున్న ఝల్ వర్ణమైన తకారమునకు సవర్ణమైన జశ్ వర్ణము దకారమురాగా 'చిద్రూపము' అను రూపము సిద్ధించినది.

అట్లే చిత్+అంశః=చిదంశః అనురూపమూహ్యము.

**మూలమ్ :-**

**22.-అనునాసికసన్ధిః**—పదాన్తస్య యరః అనునాసికే పరే సవర్ణానునాసికో వా స్యాత్, తత్ర అనునాసికాది ప్రత్యయే పరే నిత్యమ్.

యథా-తత్ + మురారిః = తన్మురారిః; తద్మురారిః; కకుప్ + నేతా కకుమ్నేతా; కకుబ్నేతా; వాక్ + మహిమా = వాఙ్మహిమా; వాగ్మహిమా. విట్ + మూత్రమ్ = విణ్మూత్రమ్; విడ్మూత్రమ్; చిత్ + మయమ్ = చిన్మయమ్; చిన్మాత్రమ్. గరుత్మాన్-కకుద్మ న్త్విత్యాదౌ గణేనిపాతనాన్న.

**అనువాదము :—**

**22. అనునాసిక సంధి :—** పదము చివరనున్న యర్ నకు అనగా - 'అ ఇ ఉ ణ్' మున్నగు అక్షర సమామ్నాయమందలి 'య వ ర ట్' సూత్రము మొదలు ''శ ష స ర్'' వరకున్న సూత్రముల యందలి వర్ణములకు అనునాసికము పరమైనచో సవర్ణమైన యనునాసికము వికల్పముగా వచ్చును. అనునాసికాది ప్రత్యయము పరమైనచో నిత్యముగా ననునాసికము వచ్చును.

ఎట్లనగా - తత్ + మురారిః అనునెడ 'తత్' అనుపదము చివరనున్న యర్ వర్ణమైన తకారమునకు మురారి యనుపదమునందలి మువర్ణ మనునాసికము పరమైనందున, త సవర్ణమైన అనునాసికము (ముక్కుతోను నోటితోను కలసి యుచ్చరింపఁబడువర్ణము) న కారము రాగా తన్ + మురారిః = ''తన్మురారిః'' అను రూపము సిద్ధించినది. అనునాసికసంధి వికల్పము గాన ఇది రాని పక్షమున తత్ + మురారిః = ''తద్మురారిః'' అను రూపము జశ్త్వముచే సిద్ధించును.

కకుప్ + నేతా అనునెడ 'కకుప్' అను పదాంతమందలి యర్ వర్ణమైన ప కారమునకు నేతా అనునప్పుడు నకార మనునాసికము పరమైయున్నందున, పకారమునకు సవర్ణమైన అనునాసికము మ కారమురాగా కకుమ్ + నేతా = కకుమ్నేతా అను రూపము సిద్ధించినది. ఈ సంధి వికల్పము కావున ఇది రానిపక్షమున జశ్త్వముచే 'కకుబ్నేతా' యను రూపము సిద్ధించును.

వాక్ + మహిమా అనునెడ 'వాక్' అను పదముచివరనున్న కకారము యర్. దానికి 'మహిమా' అనునప్పుడు మకార మనునాసికము పరమైనందున కకారమునకు సవర్ణమైన అనునాసికము 'ఙ' కారముురాగా ''వాఙ్మహిమా'' అను రూపము సిద్ధించినది. ఇది వికల్పముగాన అనునాసికము రాని పక్షమున వాక్ + మహిమా = వాగ్మహిమా యను రూపము జశ్త్వముచే సిద్ధించును.

విట్ + మూత్రమ్ అనునెడ 'విట్' అనుపదము చివరనున్న యర్ వర్ణమైన టకారమునకు 'మూ' యని మకార మనునాసికము పరమైయున్నందున

టకారమునకు సవర్ణమైన 'ణ'కారమనునాసికము రాగా "విణ్మాత్రమ్" అను రూపము సిద్ధించినది. ఇది వికల్పముగాన అనునాసిక సంధి రానిపక్షమున జశ్త్వముచే 'విడ్మాత్రమ్' అను రూపము సిద్ధించును.

చిత్ + మయమ్ అనునెడ 'చిత్' అనుపదము చివరనున్న యర్ వర్ణమైన తకారమునకు 'మయమ్' అను మకార మనునాసికాక్షరమాదియందుగల ప్రత్యయము పరముగానున్నది కావున తకారమునకు సవర్ణమై అనునాసికము నకారము నిత్యముగా రాగా "చిన్మయమ్" అను రూపము సిద్ధించినది.

అట్లే - చిత్+మాత్రమ్ అనునెడ 'చిత్' అను పదము చివరనున్న యర్ వర్ణమైన తకారమునకు 'మాత్రమ్' అను మకార మనునాసికాక్షరమాదియందు గల ప్రత్యయము పరముగా నున్నందున చిత్ తకారమునకు సవర్ణమైన అనునాసికము 'న' కారము నిత్యముగారాగా "చిన్మాత్రమ్" అను రూపము సిద్ధించినది.

గరుత్మాన్- కకుద్మన్తః ఇత్యాదులలో గణమందు నిపాతనము చేయుట వలన అనునాసికములు రాలేదు. అనగా గరున్మాన్, కకున్మన్తః అను రూపము లేర్పడలేదు.

**మూలమ్:-**

**23.అనుస్వారసన్ధిః :** అపదాన్త మకార నకార యోర్ఝలి పరే, మకారాన్తపదస్య హలిపరేచ అనుస్వారః (ం) స్యాత్.

యథా - ఆక్రమ్ + స్యతే = ఆక్రంస్యతే; యశాన్+సి = యశాంసి; హరిమ్+వన్దే=హరింవన్దే. రాట్ శబ్దే పరే సమో మస్య నానుస్వారః. సమ్ + రాట్ = సమ్రాట్.

**అనువాదము:—**

**23. అనుస్వారసంధి :—** పదాంతముకాని మకారమునకును, నకారమునకును, ఝల్లు పరమైనప్పుడును అనగా "ఝ భ ఞ్" మొదలు 'హల్' సూత్రము వరకు గల నక్షరములలో నొకటి పరమైనప్పుడును, మకారాన్తమైన పదమునకు హల్లు పరమైనప్పుడును అనుస్వారము (ం) వచ్చును.

ఎట్లనగా ఆక్రమ్+స్యతే అనుచోట 'ఆక్రమ్' చివరనున్న మకారము పదమధ్యము నందున్నది గాని పదాంతమునందులేదు. కాన అపదాంతమైనది. దానికి 'స్యతే' అనునెడ సకారము ఝల్లు పరమైనందువలన మకారమునకు అనుస్వారము రాగా "ఆక్రంస్యతే" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే యశాన్+సి అనునెడ 'యశాన్' చివరనున్న న కారము పదమధ్యస్థమైనందువలన పదాంతముకాలేదు. కాన అపదాంతము. దానికి 'సి' యని ఝల్లు పరమగుటవలన అనుస్వారము రాగా "యశాంసి" అను రూపము సిద్ధించినది.

ఇక హరిమ్+వన్దే అనునెడ 'హరిమ్' అనునది మకారాంతపదము. దానికి 'వన్దే' అని వకారము హల్లు పరమగుటవలన అనుస్వారమురాగా "హరిం వన్దే" యను రూపము సిద్ధించుచున్నది.

రాట్ శబ్దము పరమైనప్పుడు 'సమ్' లోని మకారమునకు అనుస్వారము రాదు.

ఎట్లన—సమ్+రాట్ అనునెడ 'సమ్' నకు 'రాట్' శబ్దము పరమై యున్నది. కాన 'సమ్' లోని మకారమునకు అనుస్వారము రాలేదు. కాన "సమ్రాట్" అనియే రూపము సిద్ధించును.

**మూలమ్ :-**

**24.** పరసవర్ణసన్ధిః :- అపదాన్తానుస్వారస్యయయి పరే నిత్యం పరసవర్ణ స్స్యాత్. పదాన్తానుస్వారస్య తు వా. తవర్గస్య లకారే పరే నిత్యమ్.

యథా - అఙ్కితః; అఞ్చితః; కుణ్ఠితః; శాన్తః; గుమ్ఫితః; త్వం కరోషి; తఙ్కరోషి; త్వంచతురః త్వఞ్చతురః; తంధర్మమ్; తన్ధర్మమ్; ఏవం సంయన్తా-సయ్యన్తా; సంవత్సరః, సవ్వత్సరః; యంలోకమ్ యల్లోకమ్; తత్+లయః = తల్లయః; విద్వాన్+లిఖతి = విద్వాల్లిఖతి.

**అనువాదము :-**

**24.** పరసవర్ణ సంధి :- అపదాంతమైన అనగా పదము చివరనుండని అనుస్వారమునకు యయ్ అనగా "యవరట్" మొదలు 'కపయ్' వరకున్న

సూత్రములయందలి వర్ణములలో నొక్కటి పరమైనను, పరవర్ణమునకు సమాన మైన వర్ణము నిత్యముగా వచ్చును. పదాంతమందలి యనుస్వారమునకో వికల్ప ముగా వచ్చును. తవర్గమునకు లకారము పరమైనచో నిత్యముగా వచ్చును.

ఎట్లనగా - అం + కితః అనునెడ 'అం' లోనున్న అనుస్వారము పద మధ్యమందుండుటవలన అపదాంతము. దానికి 'కితః' లోని కకారము యయ్ పరమైనందున దానికి సవర్ణమైన 'ఙ' కారము రాగా అఙ్ + కితః = అఙ్కితః అను రూపము సిద్ధించినది.

అట్లే—అం + చితః అనునెడ 'అం'లోని అనుస్వారము పదాంతమైనది. దానికి 'చితః' లోని చకారము యయ్ పరమైనందున దానికి అనగా చకారము నకు సవర్ణమైన 'ఞ' రాగా అఞ్ + చితః 'అఞ్చితః' అను రూపము సిద్ధించినది.

అట్లే—కుం + ఠితః అనునెడ అనుస్వారమునకు, పరమైన ఠ కారమునకు సవర్ణమైన 'ణ' కారమురాగా "కుణ్ఠితః" అను రూపము సిద్ధించినది.

అట్లే—గుం + ఫితః అనునెడ 'గుం' లోని యనుస్వారమునకు పరమైన ఫకారమునకు సవర్ణమైన మకారమురాగా గుమ్ + ఫితః = గుమ్ఫితః అను రూపముసిద్ధించుచున్నది

అట్లే శాం + తః అనునెడ అనుస్వారమునకు పరమైన తకారమునకు, సవర్ణమైన'న' కారము—శాన్ + తః = శాన్తః అను రూపము సిద్ధించుచున్నది.

త్వం + కరోషి అనునెడ త్వంలోని అనుస్వారము పదాంతము. దానికి కరోషిలోని కకారము యయ్ పరమైనందున కకారమునకు సవర్ణమైన 'ఙ' యను నది అనుస్వారమునకు వికల్పముగారాగా 'త్వఙ్కరోషి' అను రూపమేర్పడు చున్నది. ఇది వికల్పము గాన పరసవర్ణము రాని పక్షమున 'తంకరోషి' అనియే రూపముండును.

అట్లే త్వం + చతురః అనునెడ పరమైన చకారమునకు సవర్ణము "ఞ". అది యనుస్వారమునకురాగా త్వఞ్ + చతురః = "త్వఞ్చతురః" అను రూపము సిద్ధించుచున్నది. ఇది వికల్పము గాన రానిపక్షమున త్వం చతురః అనియే రూపమేర్పడును.

అట్లే తం + ధర్మమ్ అనునెడ పరమైన ధకారమునకు సవర్ణమైన న కారము అనుస్వారమునకు రాగా తన్ + ధర్మమ్ = తన్ధర్మమ్ అను రూపము

అట్లే సం+యన్తా అనునెడ "యన్తా" లోని యకారము యమ్ పరమైనందున 'సం'లోని యనుస్వారమునకు అనునాసికమైన యకారముగాగా (పరసవర్ణముగాగా) సయ్ఁయన్తా=సయ్ఁయ్యన్తా అని రూపము సిద్ధించును. ఇది వికల్పము కావున, ఇది రాని పక్షమున సంయన్తా అనియే రూపముండును.

అట్లే సం+'వత్సరః'అనునెడవకారము యమ్ పరమైనందున 'సం'లోని యనుస్వారమునకు సవర్ణమైన వకారము రాగా సవ్ఁ+వత్సరః=సంవ్వఁత్సరః అను రూపము సిద్ధించుచున్నది. ఈపరసవర్ణము వికల్పము కాన ఇది రాని పక్షమున 'సంవత్సరః' అనియే రూపముండును.

అట్లే – యం+లోకమ్ అనునెడ 'లోకమ్' లోని లకారమునకు సవర్ణమైన లకారము అనుస్వారముయొక్క స్థానమునందు రాగా 'యఁల్లోకమ్'' అను రూపము సిద్ధించును. ఇది వికల్పమైనందున రాని పక్షమున 'యంలోకమ్' అనియే రూపమేర్పడును.

తత్+లయః అనునెడ తవర్గ తకారమునకు లకారము పరమైనది గాన నా లకారమునకు సవర్ణమైన మఱియొక లకారము తకారమునకు రాగా తత్+లయః=తల్లయః అనురూపము సిద్ధించుచున్నది.

అట్లే విద్వాన్+లిఖతి అనునెడ 'విద్వాన్' లోని తవర్గాక్షరమైన నకారమునకు 'లిఖతి' లోని లకారమునకు సవర్ణమైన మఱియొక లకారము రాగా విద్వాఁల్+లిఖతి='విద్వాఁల్లిఖతి' యను రూపము సిద్ధించును.

**మూలమ్:—**

**25**. పూర్వసవర్ణసన్ధిః :– ఝయః పరస్య హకారస్య పూర్వసవర్ణో వాస్యాత్, ఉదుప సర్గాత్పరయోః స్థా స్తమ్భ ధాత్వోః నిత్యమ్.

యథా వాక్+హరిః=వాగ్ఘరిః; షట్+హయాః=షడ్ఢయాః; తత్+హితమ్=తద్ధితమ్; అప్+హవిః = అబ్భవిః, రూపాన్తరాణి సిద్ధాని. ఉత్+స్థానమ్=ఉత్థానమ్. ఉత్+స్తమ్భనమ్=ఉత్తమ్భనమ్.

**అనువాదము:–**

**25**. పూర్వసవర్ణసంధి:– ఝయ్ ప్రత్యాహారమునఁ జేరిన వర్ణమునకు అనగా "ఝభఞ్'' మొదలు 'కపయ్' వరకు గల సూత్రముల యందలి వర

ములలో న్నే యొక్క వర్ణమున కంటెను పరమైన హకారమునకు పూర్వసవర్ణము వికల్పముగా వచ్చును.

వాక్+హరిః అనునెడ వాక్ లోని పదాన్తమైన ఝల్ కకారమునకు జశ్త్వము 'గ' కారమురాగా వాగ్+హరిః నిలుచును. ఇయ్యెడ వాగ్ లోని గ కారము ఝయ్ ప్రత్యాహారమునకుఁ జెందిన వర్ణము. దానికి హకారము పరమై యున్నది. కావున పూర్వవర్ణమైన గ కారమునకు సవర్ణమైన 'ఘ' కారము వికల్పముగా హకారమునకు రాగా వాగ్ఘరిః "వాగ్ఘరిః" అను రూపము సిద్ధించుచున్నది. ఇది రాని పక్షమున 'వాగ్హరి' అను రూపముండును.

అట్లే షట్+హయాః అనునెడ జశ్త్వమురాగా షడ్+హయాః అని నిల్చును. ఇయ్యెడ 'షడ్' లోని డకారమునకు సవర్ణమైన ఢకారము హకారమునకు వికల్పముగారాగా "షడ్ఢయాః"అను రూపముసిద్ధించును. ఈ పూర్వసవర్ణ సంధి వికల్పముగాన ఇదిరాని పక్షమున 'షడ్హయాః' అని రూపముండును.

అట్లే — తత్+హితమ్ అనునెడ జశ్త్వము రాగా తద్+హితమ్ అని నిలుచును. ఇయ్యెడ 'తద్' లోని దకారమునకును సవర్ణమైన ధ కారము హకారమునకు వికల్పముగా రాగా తద్+ధితమ్ = "తద్ధితమ్" అనురూపము సిద్ధించును. ఇదిరాని పక్షమున 'తద్హితమ్' అనియే రూపముండును.

అటే అప్+హవిః అనునెడ జశ్త్వము రాగా అబ్+హవిః అని నిల్చును. ఇయ్యెడ 'అబ్' లోని బకారమునకు సవర్ణమైన భకారము హకారమునకు వికల్పముగా రాగా అబ్+భవిః = అబ్భవిః అను రూపము సిద్ధించును. వికల్పపక్షమున 'అబ్హవిః' అనియే రూపముండును.

ఇట్లే వికల్పముచే రూపాంతరములు సిద్ధములైనవి.

ఉత్+స్థానమ్ అనునెడ 'ఉత్' అను ఉపసర్గకు స్థాధాతువు పరమైనందున, ఆ స్థాధాతువులోని సకారమునకు పూర్వ మందలి తకారమునకు సవర్ణమైన థ కారము నిత్యముగారాగా ఉత్థ్థానమ్ అనురూప మేర్పడును. అందొక థకారమునకు వికల్పముగా లోపమురాగా 'ఉత్థానమ్' అను రూపము సిద్ధించును.

అట్లే ఉత్+స్తంభనమ్ అనునెడ స్తంభధాతువు నందలి సకారమునకు తత్పూర్వమైన తకారమునకు సవర్ణమైన తకారమురాగా ఉత్ తంభనమ్, ఉత్తంభనమ్ అను రూపము సిద్ధించుచున్నది.

మూలమ్ :

**26.** ఛత్వసన్ధిః :- ఝయః పరస్య శకారస్య ఛకారో వాస్యాత్ అమిపరే.

యథా-తత్ × శివః (శ్చుత్వమ్) తచ్ఛివః. తచ్ × శ్లోకః = తచ్ఛ్లోకః. అత్రవిశేషః.

అనువాదము :-

**26.** ఛత్వసంధి : పూర్వము చెప్పిన 'ఝయ్' ప్రత్యాహార వర్ణములకంటె పరమైన శకారమునకు అమ్ పరమైనచో ఛకారము వికల్పముగా వచ్చును.

ఎట్లనగా-తత్+శివః అనునెడ 'తత్' లోని చివరి తకారము ఝయ్. దానికంటె పరమైయున్నది శకారము. ఆ శకారమునకు 'ఇ' యనెడి 'అమ్' ప్రత్యాహారమునకుఁజెందిన వర్ణము పరమైయున్నది. కాన శకారమునకు ఛ కారమురాగా తత్+ఛివః అను రూపమేర్పడినది. తర్వాత 'తత్' లోని చివరి 'త' కారమునకు శ్చుత్వమురాగా తచ్ ఛివః 'తచ్ఛివః' అను రూపము సిద్ధించినది.

అట్లే-తత్+శ్లోకః అనునెడ మొదట ఛత్వము రాగా తత్ ఛ్లోకః అనియు తదుపరి 'తత్' లోని రెండవతకారమునకు శ్చుత్వము రాగా తచ్ ఛ్లోకః = "తచ్ఛ్లోకః" అను రూపము సిద్ధించును.

ఇందలి విశేషమిటఁజెప్పఁబడును-

మూలమ్ :—

**27.** చర్త్వసన్ధిః : ఖరి పరే ఝలాం స్థానే చరః స్యుః. తచ్ శివః; తచ్ శ్లోకః; షట్ శాస్త్రమ్; వాక్పతిః; తత్ సరః; కకుప్పతిః.

అనువాదముః—

**27.** చర్త్వసంధి:- పూర్వము చెప్పిన తత్+శివః ఇత్యాద్యుదాహరణములలో తత్+శివః అనునెడ తకారము జశ్త్వముచే దకారముకాగా తద్+శివః అనియు, తదుపరి శ్చుత్వముచే తజ్+శివః అనియు కాగా -

ఖర్ ప్రత్యాహారవర్ణములు అనగా "ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్" మొదలు 'శ ష స ర్' సూత్రమువరకు గల ఖర్ ప్రత్యాహార వర్ణములు పరమైనచో 'ఝల్' ప్రత్యాహారమునకుఁజెందిన వర్ణముల స్థానమునందు 'చర్'లు అనగా "చటతవ్" మొదలు "శషసర్" వరకు గల ప్రత్యాహారములోని వర్ణములు వచ్చును. అట్లు తజ్+శివః లోని జకారమునకు చకారమనెడి చర్ రాగా తచ్+శివః=తచ్శివః అను రూపమేర్పడినది.

అట్లే తజ్+శ్లోకః అనునెడ 'జ'కారమునకు చర్త్వము చేయగా తచ్ శ్లోకః అను రూపమేర్పడినది.

అట్లే షడ్+శాస్త్రమ్ అనునెడ 'డ'కారమునకు చర్త్వము చేయగా షట్ శాస్త్రమ్ అని రూపమేర్పడినది.

అట్లే వాగ్+పతిః అనునెడ 'గ'కారమునకు చర్త్వముచేయగా 'వాక్పతి' యను రూపమేర్పడుచున్నది.

అట్లే తద్+సరః అనునెడ 'ద'కారమునకు చర్త్వము చేయగా తత్సరః అను రూపము సిద్ధించినది.

అట్లే కకుబ్+పతిః అనునెడ 'బ'కారమునకు చర్త్వము చేయగా "కకుప్పతిః" అను రూపము సిద్ధించినది.

**మూలమ్:-**

**28.** సత్వసన్ధిః ;-అమ్పరక ఛవి పరతః నాన్తస్య పదస్య; అమ్పరక ఖయి పరతః పుమ్ శబ్దస్య; కాన్నకారస్యామ్రేడితే పరేఽపి; రుః స్యాత్తతః పూర్వమనుస్వారశ్చ. ప్రశాన్ శబ్దస్య న. తస్య రోః విసర్గః, విసర్గస్య సకార ఇతి జ్ఞేయమ్.

యథా- చక్రిన్+త్రాయస్వ, (చక్రింరు + త్రాయస్వ; చక్రింః + త్రాయస్వ; చక్రింస్+త్రాయస్వ)-చక్రింస్త్రాయస్వ. ఏవం శార్ఙ్గిన్+ఛిన్ధి= శార్ఙ్గింశ్ఛిన్ధి; రాజన్+టఙ్కారః = రాజంష్టఙ్కారః; పుమ్+కోకిలః = పుంస్కోకిలః; కాన్+కాన్=కాంస్కాన్, ప్రశాన్+తనోతి=ప్రశాన్తనోతి.

**అనువాదము :-**

**28.** సత్వసంధి :- 'అమ్' ప్రత్యాహారములోని వర్ణములు పరముగా

గల్గిన ఛవ్ ప్రత్యాహార వర్ణములు పరమైనచో నకారాన్త పదమునకు 'రు' వచ్చును.

అవ్విధముగనే 'అమ్' ప్రత్యాహారములోని వర్ణములు పరముగాఁగల్గిన 'ఖయ్' ప్రత్యాహారవర్ణములు పరమైనచో 'పుమ్' శబ్దమునకు 'రు' వచ్చును.

అటే కాన్ లోని నకారమునకు ఆమ్రేడితము అనగా ద్విరుక్త పదము పరమైనను 'రు' వచ్చును. దానికంటెపూర్వము అనుస్వారముగూడ వచ్చును.

కాని ప్రశాన్ శబ్దమునకు రుత్వము రాదు. ఆ 'రు'నకు విసర్గయు, విసర్గకు సకారము వచ్చునని తెలియనగును.

ఉదా : చక్రిన్ + త్రాయస్వ అనునెడ త్రా = (త్ + ర్ + ఆ) ర్ అమ్. అది పరముగాగల్గిన ఛవ్ = తకారము. అది పరముగా నున్నందున నకారాన్తమైన 'చక్రిన్' పదము చివరకు రుత్వమురాగా చక్రింర్ + త్రాయస్వ యని కాగా, తదుపరి రువర్ణమునకు విసర్గరాగా చక్రింః + త్రాయస్వ అనియైనది. తరువాత నా విసర్గలకు సత్వము చేయగా చక్రింస్ + త్రాయస్వ = చక్రింస్త్రాయస్వయని రూపము సిద్ధించుచున్నది.

ఇట్లే శార్ఙ్గిన్ + ఛిన్ధి అనునెడ పైవిధముగా

శార్ఙ్గింరు + ఛిన్ధి అని తదుపరి

శార్ఙ్గింః + ఛిన్ధి యని తరువాత

శార్ఙ్గింస్ + ఛిన్ధి యని చేయగా

శ్చుత్వముచే శార్ఙ్గింశ్ + ఛిన్ధి = "శార్ఙ్గింశ్ఛిన్ధి" యని రూపము సిద్ధించుచున్నది.

ఇట్లే రాజన్ + టంకారః అనునెడ 'రు' త్వము చేయగా రాజఞరు + టంకారః యని నిల్వగా, తరువాత నకారమునకు ననుస్వారము చేయగా— రాజంరు + టంకారః యని కాగా. తదుపరి రు వర్ణమునకు విసర్గ చేయగా రాజంః + టంకారః యని కాగా, తరువాత విసర్గకు సత్వము చేయగా రాజంస్ + టంకారః కాగా ష్టుత్వము—"రాజంష్టంకారః" అను రూపము సిద్ధించును.

అట్లే-పుమ్+కోకిలః అనునెడ రుత్వము చేయగా
పుమ్రు+కోకిలః అనియు అనుస్వారముచే
పుంరు+కోకిలః అనియు, విసర్గచేయగా
పుంః+కోకిలః అనియు, సత్వము చేయగా
పుంస్+కోకిలః అనియు అనగా
పుంస్కోకిలః అని రూపము సిద్ధించినది.
అట్లే కాన్+కాన్ అనునెడ రుత్వము చేయగా
కాన్రు+కాన్ అనియు, అనుస్వారముచేయగా
కాంరు+కాన్ అనియు, విసర్గచేయగా
కాంః+కాన్ అనియు, సత్వముచేయగా
కాంస్+కాన్=కాంస్కాన్ అను రూపము సిద్ధించినది.

కాని ప్రశాన్+తనోతి అనునెడ రుత్వాదులు రావు గాన ప్రశాన్తనోతి యనియే రూపమేర్పడును.

**మూలమ్ :**

**29. తుగాగమసన్ధిః** :— అజన్తస్య ఛకారే పరే తుగాగమో నిత్యం స్యాత్. ఆఙ్మాఙ్ భిన్న పదాన్త దీర్ఘస్యతు వా. (కిత్వాదన్తావయవః)

యథా:— రామచ్ఛత్రమ్; చేచ్ఛిద్యతే. లక్ష్మీ+ఛాయా=లక్ష్మీచ్ఛాయా, లక్ష్మీఛాయా (ఆచ్ఛాదయతి మాచ్ఛిదత్). నాన్తపదస్య శకారే పరేపి వా తుగాగమః. పక్షే ఛత్వం, శ్చుత్వ మనుస్వార పరసవర్ణతా చ. సన్+శివః = సఞ్ఛివః, సఞ్ చ్ ఛివః; సఞ్ చ్ శివః, సఞ్ శివః. ఏవం రూపచతుష్టయమ్.

**అనువాదము :—**

**29. తుగాగమసంధి**:—అచ్చు అంతమునందుగల శబ్దమునకు ఛ కారము పరమైనప్పుడు 'తుక్' ఆగమముగా వచ్చును. ఆగమ మనగా మిత్రుని వలె (ప్రక్కనుండుట). ఇది నిత్యము.

ఆఙ్ - మాఙ్లకు భిన్నమైన పదము చివరి దీర్ఘమునకు వికల్పముగా వచ్చును. ఈ తుక్ కకారమిత్తుగా గల్గియున్నదిగాన నిది పదము చివరి భాగమునకు వచ్చును.

ఎట్లనగా—రామ + ఛత్రమ్ అనునెడ 'రామ' అనునది అచ్చు చివర గల్గిన పదము. దానికి 'ఛత్రము' లోని ఛకారము పరముగా నున్నది. కాన రామ శబ్దముయొక్క చివరిభాగమునకు 'త్' ఆగమముగా వచ్చినది. అందువలన రామత్+ఛత్రమ్ అని రూపమేర్పడినది. దానికి జశ్త్వచర్త్వములు చేయగా రామచ్ఛత్రమ్=రామచ్ఛత్రమ్ అను రూపము సిద్ధించినది.

అట్లే చే+ఛిద్యతే అనునెడ తుగాగమము రాగా చేత్+ఛిద్యతేయని కాగా, జశ్త్వముచే

చేద్+ఛిద్యతే యని యేర్పడగా శ్చుత్వముచే

చేజ్+ఛిద్యతే యనికాగా, చర్త్వముచే

చేచ్+ఛిద్యతే=చేచ్ఛిద్యతే యని రూపము సిద్ధించుచున్నది.

లక్ష్మీ+ఛాయా అనునెడ తుగాగమము రాగా

లక్ష్మీత్+ఛాయా యని కాగా జశ్త్వముచే

లక్ష్మీద్+ఛాయా యనికాగా శ్చుత్వముచే

లక్ష్మీజ్+ఛాయా యనికాగా చర్త్వముచే

లక్ష్మీచ్+ఛాయా యను రూపము సిద్ధించుచున్నది. ఇది వికల్పము కావున లక్ష్మీఛాయా యనియు రూపముండును.

ఆ+ఛాదయతి యనునెడ తుగాగమముజశ్త్వశ్చుత్వ చర్త్వములు పూర్వమువలె రాగా ఆచ్ఛాదయతి యను రూపము నిత్యముగా సిద్ధించును.

అట్లే—మా+ఛిదత్ అనునెడ తుగాగమాదులు చేయగా మాచ్ఛిదత్ అను రూపము నిత్యముగా సిద్ధించును.

నకారాన్త పదమునకు శకారము పరమైనను వికల్పముగా తుగాగమము. అదిరాని పక్షమున ఛత్వము, శ్చుత్వము అనుస్వారమునకు పరమైన వర్ణముతో సవర్ణతవచ్చును.

సన్+శివః అనునెడ నకారాన్తపదము సన్ అనునది. దానికి శివః యని శకారము పరమైనది కాన తుగాగమము రాగా సన్+త్+శివః అని రూపమేర్పడినది. ఇచట తకారమునకు చుత్వము రాగా సన్‌చ్+శివః అనికాగా, దానికి లోపముతాగా నకారమునకు శ్చుత్వము వచ్చుటచే నఞ్+శివః అని

కాగా, శకారమునకు ఛత్వమురాగా సఞ్ + ఛివః అని రూపము సిద్ధించు చున్నది. తకారమునకు లోపమురాని పక్షమున 'సన్' లోని నకారమునకు శ్చుత్వము రాగా సఞ్ + ఛివః అని రూపము సిద్ధించును.

శకారమునకు ఛత్వము రాని పక్షమున తకార నకారములకు శ్చుత్వము చేయగా—సఞ్ చ్ శివః అని రూపమేర్పడును.

తుగాగమము రాని పక్షమున నకారమునకు శ్చుత్వము చేయగా సఞ్ శివః అను రూపమేర్పడును. ఇట్లు నాల్గు రూపములు సిద్ధించును.

**మూలమ్ :—**

**30. ధుడాగమసన్ధిః :—** ఢకారాత్పరస్య నకారాత్పరస్య చ సకారస్య ధుడాగమో వాస్యాత్–టిత్వాదాద్యవయవః. (చర్త్వమ్) షడ్ + సన్తః (షడ్ ధ్ సన్తః) షట్ త్ సన్తః—షట్త్సన్తః. షట్సన్తః; సన్+సః = సన్త్సః. సన్సః.

**అనువాదము :—**

**30. ధుడాగమసంధి :** ఢకారమునకంటె పరమైన సకారమునకును, నకారమునకంటె పరమైన సకారమునకును ధుడాగమము వికల్పముగా వచ్చును. ఈ ధుట్‌నకు టకారము ఇత్తు అగుటవలన నీ యాగమము మొదటి భాగమునకు వచ్చును. ఆ షడ్ లోని ఢకారమునకు చర్త్వము చేయవలయును.

ఎట్లన–షడ్ + సన్తః అనునెడ ధుడాగమము రాగా షడ్ ధ్ + సన్తః యని కాగా చర్త్వము చేయుటవలన షట్ త్ సన్తః "షట్త్సన్తః" అను రూపమేర్పడును.

ఈ యాగమము వికల్పముగాన, రాని పక్షమున 'షట్సన్తః' అను రూపమేర్పడును.

అట్లే సన్+సః అనునెడ నకారమున కంటె పరమైన సకారమునకు ధుట్ ఆగమమురాగా సన్ధ్ + సః అనికాగా, ధకారమునకు చర్త్వము చేయగా సన్ త్ + సః అని, 'సన్త్సః' అను రూపము సిద్ధించుచున్నది. ఇది వికల్పమైనందున ధుడాగమము రాని పక్షమున 'సన్సః' అను రూపమేర్పడును.

**మూలమ్ :**

**31.** జముడాగమసన్ధిః :-హ్రస్వాత్పరో యో ఙమ్ తదన్తం యత్పదం తస్మాత్పరస్య అచః నిత్యం ఙముడాగమస్స్యాత్.

ప్రత్యఙ్ + ఆత్మా = ప్రత్యఙ్ఙాత్మా; సుగణ్ + ఈశః = సుగణ్ణీశః; సన్ + అచ్యుతః = సన్నచ్యుతః.

॥ ఇతి హల్ సన్ధిః ॥

**అనువాదము :**

**31.** ఙముడాగమసంధి :- హ్రస్వమునకంటె పరమైన ఙమ్ (అనగా- 'ఙమగణనమ్' అను ప్రత్యాహారమును జెందిన వర్ణములు) అంతమందు గల్గిన యే పదముగలదో, దానికంటెపరమైన అచ్చునకు నిత్యముగా ఙముడాగమము వచ్చును.

ఎట్లనగా-ప్రత్యఙ్ + ఆత్మా అనునెడ 'త్య'లోని అకారము హ్రస్వము. దానికంటె పరమైన ఙమ్ - ఙ. అది అంతమందుగల పదము ప్రత్యఙ్. దానికంటె పరమైన అచ్చు ఆత్మా లోని ఆకారము. దానికి ఙముడాగమము రాగా అనగా-'ఙ' కారమురాగా ప్రత్యఙ్ఙ్ + ఆత్మా = "ప్రత్యఙ్ఙాత్మా" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే సుగణ్ + ఈశః అనునెడ ఙముడాగమము రాగా అనగా వర్ణ సామ్యము ననుసరించి ణ కారమురాగా సుగణ్ణ్ + ఈశః = "సుగణ్ణీశః" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే సన్ + అచ్యుతః అనునెడ "ఙ"ముడాగమమురాగా అనగా వర్ణ సామ్యముచే నకారమురాగా సన్న్ + అచ్యుతః = "సన్నచ్యుతః" అను రూపము సిద్ధించుచున్నది.

ఇట్లు హల్సంధి సమాప్తము.

# అథ విసర్గ సన్ధిః

**మూలమ్:-**

32:- పదాన్త సకారస్య రేఫాదేశః. తస్య ఖరి పరే, అవసానే చ విసర్గః స్యాత్

యథా-రామస్+ఖాదతి=రామర్+ఖాదతి రామః ఖాదతి; హరిస్, హరిర్, హరిః; ఏవమ్ పునర్=పునః, ప్రాతర్=ప్రాతః.

**అనువాదము :** విసర్గసంధి

32. పదాంతమందలి సకారమునకు రెఫము ఆదేశమగును. దానికి ఖర్ అనగా- ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్" "కపయ్" "శషసర్" అను సూత్రములలోని వర్ణములు పరమైనపుడును, అవసానమందును అనగా- అక్షరములేవియు పరముగా లేనపుడును విసర్గలు వచ్చును.

ఎట్లనగా-రామస్+ఖాదతి అనునెడ సకారమునకు రేఫము రాగా రామర్+ఖాదతి యని నిల్చును. దానికి ఖర్ పరమైనందున విసర్గలు రాగా రామఃఖాదతి యను రూపము సిద్ధించుచున్నది.

హరిస్ అనునెడ పదముచివర నున్న స కారమునకు రేఫమురాగా, హరిర్ అనియు, దానికి నేయక్షరమును పరముగా లేనందున అనగా అవసానమగుటవలన విసర్గలు రాగా 'హరిః' యను రూపము సిద్ధించినది.

అట్లే పునస్, పునర్, పునః అనియు, ప్రాతస్, ప్రాతర్, ప్రాతః అనియు రూపముల నూహించునది.

**మూలమ్ :**

33. విసర్గస్య ఖరిపరే సకారాదేశః. శరిపరే తు వా. శర్పరక ఖరి పరే విసర్గస్య విసర్గ ఏవ నాన్యః.

హరిః+తరతి=హరి స్తరతి; రామః+చరతి = రామశ్చరతి; హరిః శేతే=హరిశ్శేతే, హరిః శేతే; రసాఃషట్, రసాష్షట్; జనాఃసర్వే=జనాస్సర్వే, కఃత్సరుః.అద్భిః ప్సాతమ్. నరఃక్షుభ్యతి ఇత్యాది.

**అనువాదము :**

33. విసర్గకు ఖర్ పరమైనచో సకారాదేశము. శర్ అనగా 'శషసర్' సూత్రఘటక వర్ణములు పరమైనచో వికల్పముగా సకారాదేశము. శర్ పరముగా గల్గిన ఖర్ పరమైనచో విసర్గకు విసర్గయే వచ్చును. మఱియొండు రాదు.

ఎట్లనగా-హరిః+తరతి అనునెడ విసర్గకు ఖర్ అనగా తకారము పరమైనందున సకారమురాగా హరిస్+తరతి = హరిస్తరతి యను రూపము సిద్ధించుచున్నది.

రామః+చరతి యనునెడ విసర్గకు పైవిధముగనే ఖర్ అనగా చకారము పరముగా నున్నది గాన సకారమురాగా-రామస్+చరతి యని కాగా, తదుపరి శ్చుత్వము చేయగా, రామశ్+చరతి = 'రామశ్చరతి' యను రూపము సిద్ధించుచున్నది.

హరిః+శేతే అనునెడ విసర్గకు శర్ అనగా శకారము పరమైనందువలన స కారమురాగా హరిస్+శేతే యని కాగా స కారమునకు శ్చుత్వముచేయగా హరిశ్ శేతే = హరి శ్శేతే యను రూపము సిద్ధించుచున్నది.

శర్ పరమైనపుడు సత్వము వికల్పము గాన రానిపక్షమున హరిః శేతే యను రూపముండును.

రసాః+షట్ అనునెడ విసర్గకు షకారము శర్ పరమైనందువలన, విసర్గకు సకారమురాగా రసాస్+షట్ అని కాగా తదుపరి ష్టుత్వము రాగా రసాష్+షట్ = రసాష్షట్ అను రూపము సిద్ధించుచున్నది.

జనాః+సర్వే అనునెడ విసర్గకు సకారము శర్ పరమైనందున సత్వము చేయగా జనాస్+సర్వే = జనాస్సర్వే యను రూపము సిద్ధించుచున్నది. ఇది వికల్పము గాన రాని పక్షమున "జనాః సర్వే" యని రూపము సిద్ధించును.

కః+త్సరుః అనునెడ త్స అనునది శర్‌ను పరముగాగల్గిన ఖర్. అది పరమైనందున కః లోని విసర్గకు విసర్గరాగా "కఃత్సరుః" అని రూపము సిద్ధించును.

అట్లే అద్భిః+ప్సాతమ్ అనునెడ వరః+క్షుభ్యతి అనునెడ శర్‌ను

పరముగా గల్గిన ఖర్ పరమైనందున విసర్గకు విసర్గయేరాగా "అద్భిఃప్స్నాతమ్" అనియు "నరఃత్సురత్యతి" యనియు రూపములు సిద్ధించుచున్నవి.

మూలమ్:—

34. ఖర్పరక శరి పరే వా విసర్గస్య లోపస్స్యాత్. పక్షే సత్వం విసర్గశ్చ.

రామః+స్థాతా=రామస్థాతా; రామస్స్థాతా. ఏవం హరిః+స్ఫురతి=హరిస్ఫురతి, హరి స్స్ఫురతి.

అనువాదము:

34. ఖర్‌ను పరముగా గల్గిన శర్ పరమైనచో వికల్పముగా విసర్గకు లోపము వచ్చును. అది రానిపక్షమున సత్వము విసర్గయు వచ్చును.

ఎట్లనగా—రామః+స్థాతా అనునెడ 'స్థా' సకారము ఖర్ అనగా థ కారమును పరముగాగల్గిన శర్. అది పరమైనందున విసర్గకు వికల్పముగా లోపమురాగా "రామస్థాతా" అను రూపము సిద్ధించును.

ఈ లోపము వికల్పము గాన, రానిపక్షమున విసర్గకు సత్వము రాగా రామస్+స్థాతా=రామస్స్థాతా అను రూపము సిద్ధించును. విసర్గయే యున్నచో 'రామఃస్థాతా' అనురూపము.

ఇట్లే—హరిః+స్ఫురతి అనునెడ పై విధముగనే విసర్గకు వికల్పముగా లోపమురాగా హరిఃస్ఫురతి యను రూపము సిద్ధించుచున్నది. అభావ పక్షమున విసర్గకు సత్వము వచ్చి హరిస్+స్ఫురతి="హరిస్స్ఫురతి" యను రూపము సిద్ధించును. విసర్గయే యున్నచో "హరిఃస్ఫురతి" అనురూపము.

మూలమ్:

35. విసర్గస్య కఖయోః పఫయోశ్చపరయోః క్రమాత్ జిహ్వామూలీయో పధ్మానీయౌ వాస్తః. పక్షే విసర్గశ్చ.

కᳵకవిః, కఃకవిః; యᳵఖలః, యఃఖలః; కᳶపఠతి. కఃపఠతి; ద్రుᳶఫలతి, ద్రుఃఫలతీత్యాది.

అనువాదము:

35. విసర్గకు క ఖ లు, ప ఫ లు పరమైనచో క్రమముగా జిహ్వామూలీయము, ఉపధ్మానీయము వికల్పముగా వచ్చును. రాని పక్షమున విసర్గవచ్చును.

ఎట్లనగా — కః + కపిః అనునెడ విసర్గకు క పరమైనందువలన వికల్పముగా జిహ్వామూలీయము రాగా 'కఁకపిః' యను రూపము సిద్ధించును.

ఇది రాని పక్షమున విసర్గరాగా కఃకపిః యను రూపమేర్పడును.

అట్లే యః + ఖలః అనునెడ విసర్గకు ఖ పరమైనందున జిహ్వామూలీయము వికల్పముగా రాగా 'యఁఖలః' అను రూపము సిద్ధించును.

ఇదిరాని పక్షమున విసర్గరాగా 'యఃఖలః' అను రూపమేర్పడును.

అట్లే కః + పఠతి అనునెడ విసర్గకు ప పరమైనందున ఉపధ్మానీయము వికల్పముగా రాగా కఁపఠతి యను రూపము సిద్ధించును.

ఇది రాని పక్షమున విసర్గరాగా "కఃపఠతి" అను రూపమేర్పడును.

అట్లే ద్రుః + ఫలతి యనునెడ విసర్గకు 'ఫ' పరమైనందువలన ఉపధ్మానీయము వికల్పముగా రాగా "ద్రుఁఫలతి" అను రూపము సిద్ధించినది.

ఇది రాని పక్షమున విసర్గ వచ్చి "ద్రుఃఫలతి" యను రూపమేర్పడుచున్నది.

**మూలమ్:-** అత్రవిశేషః

36. పాశ, కల్ప, క, కామ్య ప్రత్యయేషు పరతః అనవ్యయస్య విసర్గస్య సకారాదేశః; ఇణః పరస్య విసర్గస్యాపి తథైవ షకారస్స్యాత్.

యథా - పయస్పాశమ్, కుత్సితంపయః. యశస్కల్పమ్, యశస్కమ్, పయస్కామ్యతి, సర్పిష్పాశమ్, సర్పిష్కల్పమ్, సర్పిష్కమ్, సర్పిష్కామ్యతి, సర్పిష్కుణ్డికాది గణ పఠితానామపి షః. ధనుష్కపాలమ్, భ్రాతుష్పుత్రః (మాతుః కృపా) ఆకృతిగణః.

**అనువాదము** ఇచ్చట నొకవిశేషము.

36. పాశ, కల్ప, క, కామ్య ప్రత్యయములు పరమైనప్పుడు అవ్యయమునకు సంబంధించని విసర్గకు సకారమ్మాదేశమగును. ఇణ్ణుకంటె పరమైన విసర్గకును అప్పుడే షకారము వచ్చును.

ఎట్లనగా - పయః + పాశమ్ అనునెడ పాశప్రత్యయము పరమైనందున

విసర్గకు సకారము రాగా పయస్+పాశమ్ = పయస్పాశమ్ అను రూపము సిద్ధించుచున్నది. చెడిన పాలనియర్థము.

అట్లే యశః+కల్పమ్ అనునెడ విసర్గకు కల్పప్రత్యయము పరమగుట వలన సకారమురాగా యశస్కల్పమ్ అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే యశః + కమ్ అనునెడ విసర్గకు కప్రత్యయము పరమగుటవలన సకారమురాగా యశస్కమ్ అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే పయః+కామ్యతి అనునెడ కామ్యతి యను ప్రత్యయము పరమైనందువలన విసర్గకు సత్వమురాగా పయస్కామ్యతి యను రూపము సిద్ధించుచున్నది.

సర్పిః+పాశమ్ అనునెడ 'సర్పి' పైని ఇకారము ఇణ్; దానికంటె పరమైన విసర్గకు పాశమను ప్రత్యయము పరమైయున్నందున షకారము రాగా "సర్పిష్పాశమ్" అను రూపము సిద్ధించును.

అట్లే సర్పిః+కల్పమ్ అనునెడ సర్పిఃపైని ఇకారము ఇణ్. దానికంటె పరమైన విసర్గకు కల్పప్రత్యయము పరమైయున్నందున షత్వము రాగా "సర్పిష్కల్పమ్" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే సర్పిః+కమ్ అనునెడ సర్పిఃలోని ఇణ్పైని విసర్గకు కప్రత్యయము పరమైనందున, షకారమురాగా "సర్పిష్కమ్" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే సర్పిః+కామ్యతి అనునెడ కామ్యతి ప్రత్యయము పరమైయున్నందున 'సర్పిః' లోని ఇణ్పైని విసర్గకు షకారము రాగా "సర్పిష్కామ్యతి" యను రూపము సిద్ధించుచున్నది.

సర్పిష్కుణ్డికా మున్నగు గణమునందు పఠింపఁబడిన శబ్దములకును షకారము వచ్చును.

ఎట్లనగా- ధనుః+కపాలమ్ అనునెడ 'ధనుః' లోని ఇణ్పైని విసర్గకు కపాల శబ్దము పరమైయున్నందున షత్వము రాగా 'ధనుష్కపాలమ్' అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే భ్రాతుః+పుత్రః అనునెడ 'భ్రాతుః' లోని ఇణ్ పైని విసర్గకు పుత్ర శబ్దము పరమైయున్నందున షత్వమురాగా భ్రాతుష్పుత్రః అను రూపము

సిద్ధించుచున్నది. గణ పాఠమున లేనందువలన మాతుః కృపా యనునెడ షత్వము రాదు. అది ఆకృతినిఁబట్టి గణిఁ ప్రఁబద్ధుటవలన నాకృతిగణమైనది.

**మూలమ్:-**

37. ఇకారోకారో పధస్యా ప్రత్యయస్య విసర్గస్య షకారాదేశః కవర్గే పవర్గే పరే (ముహుశ్శబ్దస్య న.)

యథా—ఆవిః+కృతః= ఆవిష్కృతః. ఏవం దుష్కృతమ్, నిష్ప్రత్యూహమ్; బహిష్కృతమ్; (ముహుఃకామా) అగ్నిఃకరోతి, గురుః కరోతీత్యాదౌ విసర్గస్య ప్రత్యయ సంబంధిత్వాన్న షత్వమ్. అన్త్యవర్ణా త్పూర్వో వర్ణః ఉపధాసఞ్జ్ఞకః.

**అనువాదము :**

37. ఇకారమునుగాని, ఉకారమునుగాని ఉపధగాఁగల్గిన ప్రత్యయ సంబంధములేని విసర్గకు కవర్గముగాని పవర్గముగాని పరమైనచో షకారాదేశము వచ్చును.

ఎట్లనగా-ఆవిః+కృతః అనునెడ 'ఆవిః' లోని వకారముపైని ఇకారము ఉపధ. ఆ ఇకారమును ఉపధగాగల్గిన విసర్గకు 'కృతః' అని కవర్గము పరమైనందువలన షకారాదేశమురాగా "ఆవిష్కృతః" అను రూపము సిద్ధించుచున్నది.

ఇట్లే దుః+కృతమ్ అనునెడ ఉదుపధయైన విసర్గకు షత్వము రాగా "దుష్కృతమ్".

నిః+ప్రత్యూహమ్=నిష్ప్రత్యూహమ్,
బహిః+కృతమ్=బహిష్కృతమ్,
మున్నగు స్థలములయందు షత్వము నూహించునది.

ముహుః+కామా అనునెడ విసర్గ ప్రత్యయసంబంధము కలది కాకపోయినను నిషేధముండుటవలన షత్వమురాదు.

అగ్నిః+కరోతి, గురుః+కరోతి మున్నగు స్థలములయందు విసర్గ 'సు' ప్రత్యయమునకు సంబంధించినది కాన షత్వము రాదు.

**మూలమ్:—**

౩౮. ఇస్, ఉస్ ప్రత్యయ విసర్గస్య కృత్వసుచ్ ప్రత్యయార్థే (క్రియాభ్యావృత్తి గణనే) విద్యమాన విసర్గస్య చ షకారో వా స్యాత్కవర్గే పవర్గే చ పరే.

యథా-సర్పిస్+కరోతి=సర్పిష్కరోతి; సర్పిః కరోతి. ఏవం = ధనుష్కరోతి, ధనుఃకరోతి. ద్విష్కరోతి; ద్విఃకరోతీత్యాది.

**అనువాదము :-**

౩౮. ఇస్, ఉస్ ప్రత్యయసంబంధమైన విసర్గకును, ప్రత్యయార్థమునందు అనగా-క్రియలెన్నియో అన్నింటి యావృత్తిని గణించు నర్థమునందుండెడి విసర్గకును కవర్గము పవర్గము పరమైనచో ష కారము వికల్పముగా వచ్చును.

ఎట్లనగా-సర్పిస్+కరోతి అనునెడ 'సర్పిస్' లోని 'ఇస్' ప్రత్యయ సంబంధమైన 'సర్పిః' అనుదానిలోని విసర్గకు షత్వము రాగా సర్పిష్కరోతి= సర్పిష్కరోతి" యను రూపము సిద్ధించుచున్నది.

ఇది వికల్పముగావున, రాని పక్షమునందు "సర్పిఃకరోతి" అనియే రూపముండును.

ఇట్లే ధనుస్+కరోతి అనునెడ ధనుస్‌లోని 'ఉస్' ప్రత్యముసంబంధమైన 'ధనుః' లోని విసర్గకు షత్వము రాగా 'ధనుష్కరోతి' యను రూపము సిద్ధించుచున్నది. రాని పక్షమున "ధనుఃకరోతి'' యన్నియే రూపముండును.

**మూలమ్ :-**

౩౯. అకారాత్పరస్యానవ్యయస్య విసర్గస్య సమాసే నిత్యం సకారాదేశః స్యాత్. కృ, కమ్ ధాత్వోః కంస, కుమ్భ, పాత్ర, కుశా, కర్ణీషు చ పరేషు, గతి సజ్ఞ్జకయోః పురస్, నమశ్శబ్దయో ర్విసర్గస్య కవర్గ పవర్గయోః పరతశ్చ నిత్యం సకారాదేశః. తథాభూత తిరశ్శబ్దస్యతు వా.

యథాక్రమముదాహరణాని-యశస్కరః, యశస్కామః, అయస్కం

సః, పయస్కుమ్భః, పయస్పాత్రమ్, అయస్కుశా, అయస్కర్ణీ, పురస్కృత్య, నమస్కృత్య, తిరస్కర్తా, తిరఃకర్తా.

**అనువాదము :—**

38. అకారమునకు పరమైన అవ్యయమునకు సంబంధించని విసర్గకు సమాసమందు నిత్యముగా సకారమాదేశమగును.

కృధాతువు కమ్-ధాతువు పరమైనప్పుడును, కంస-కుంభ-పాత్ర-కుశా కర్ణీశబ్దములు పరమైనపుడును గతిసఞ్జ్ఞగల పురస్, నమస్‌శబ్దమునకు సంబంధించిన విసర్గకు కవర్గ పవర్గలు పరమైనచో నిత్యముగా సకారాదేశము వచ్చును.

అట్లే గతిసంజ్ఞ కల తిరస్ శబ్దమునకు వికల్పముగా సకారాదేశము వచ్చును.

క్రమముగా నుదాహరణములు:—

యశః+కారః అనునెడ 'యశః' అను పదమునందలి విసర్గకు 'కారః' అను కృఞ్ ధాతురూపము పరమగుటవలన సకారాదేశమురాగా యశస్ + కారః = "యశస్కారః" అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే – యశః+కామః అనునెడ 'యశః' చివరి విసర్గకు 'కమ్' ధాతు రూపమైన కామ శబ్దము పరమైనందున సకారాదేశము రాగా యశస్+కామః = "యశస్కామః" అను రూపము సిద్ధించినది.

అట్లే - అయః + కంసః అనునెడ 'కంస' శబ్దము పరమైనందున 'అయః' లోని విసర్గకు సకారమాదేశమురాగా అయస్ + కంసః = "అయస్కంసః" అను రూపము సిద్ధించును.

అట్లే పయః + కుమ్భః అనునెడ "కుమ్భ" శబ్దము పరమైనందున 'పయః' లోని విసర్గకు సకారమాదేశము రాగా "పయస్కుమ్భః" రూపము సిద్ధించును.

అట్లే పయః + పాత్రమ్ = పయస్ + పాత్రమ్ = పయస్పాత్రమ్.

అయః + కుశా = అయస్ + కుశా = అయస్కుశా.

అయః + కర్ణీ = అయస్ + కర్ణీ అయస్కర్ణీ అను రూపములూహ్యములు.

"యశస్కార" శబ్దము మొదలు "ఆయస్కర్ణీ" శబ్దము వరకును సమాసములు. ఇందలి విసర్గలు అవ్యయవమునకును సంబంధించినవి కావు.

పురః + కృత్వా, నమః + కృత్వా అనునెడ పురశ్శబ్దము నమశ్శబ్దము గతిసంజ్ఞ కలవి. కావున ఈ శబ్దముల యందలి విసర్గలకు కవర్గ పరమగుట వలన సకారాదేశము నిత్యముగా రాగా, పురస్కృత్వా అనియు నమస్కృత్వా అనియు రూపములు సిద్ధించుచున్నవి. ఇవియు సమాసములే.

తిరః + కర్తా అనునెడ విసర్గకు కవర్గ పరమైనందున సకారాదేశము వికల్పముగా వచ్చుటవలన తిరస్కర్తా అనియు రాని పక్షమున తిరఃకర్తా యనియు రూపములు సిద్ధించుచున్నవి.

**మూలమ్ :—**

40. నౄనిత్యస్య పకారే పరే నకారస్య వా విసర్గః, పక్షే ఉపధ్మానీయశ్చ వా.

నౄన్ + పాహి = నౄఃపాహి; నౄᳵపాహి = నౄన్పాహి.

**ఇతి విసర్గ సన్ధిః**

**అనువాదము:—**

40. నౄన్ అను శబ్దమునకు పకారము పరమైనచో నకారమునకు వికల్పముగా విసర్గ వచ్చును. రాని పక్షమున ఉపధ్మానీయము వికల్పముగా వచ్చును.

ఎట్లనగా—నౄన్ + పాహి యనునెడ న కారమునకు పకారము పరమైనందువలన విసర్గ రాగా "నౄః + పాహి" యనియు, అది వికల్పము గాన, అభావ పక్షమున ఉపధ్మానీయము వికల్పముగా రాగా "నౄᳵపాహి" యనియు ఈ యుపధ్మానీయము కూడ వికల్పమైనందున మామూలు నకారముతో(గూడి "నౄన్పాహి" యనియు రూపములు సిద్ధించును.

**ఇట్లు విసర్గసంధి సమాప్తము.**

## అథ స్వాది సన్ధిః

**మూలమ్ :—**

41. హ్రస్వాకారాత్పరస్య పదాన్త సకారస్య ఉ ఇత్యాదేశస్స్యాత్ హ్రస్వాకారే హశి చ పరే. యథా:-

రామస్+అర్చ్యః; రామ ఉ+అర్చ్యః ఇతిస్థితే గుణః (సూ. 2, 11) పూర్వరూపఞ్చ=రామోఽర్చ్యః. మనస్+రథః=మనోరథః.

**అనువాదము :—** స్వాదిసంధి

41. హ్రస్వమైన అకారమున కంటె పరమైన పదాంతమునందలి సకారమునకు హ్రస్వాకారము పరమైనను 'హశ్' ప్రత్యాకారమునజేరిన వర్ణములు అనగా 'హ య వ ర ట్' మొదలు 'జ బ గ డ ద శ్' వరకునున్న సూత్రములలోని వర్ణములు పరమైనచో "ఉ" అను ఆదేశము వచ్చును.

ఎట్లనగా—రామస్+అర్చ్యః అనునెడ 'రామస్' లోని మకారముపైని అకారము హ్రస్వమైన అకారము. దానికంటె పరమైన సకారమునకు 'అర్చ్యః' లోని హ్రస్వాకారము పరమైయున్నందున ఉ కారము రాగా రామ ఉ+అర్చ్యః అనిఏర్పడును. పదుపరి మకారముపైని అకారమునకును, ఉ కారమునకును గుణము చేయగా రామో + అర్చ్యః అని యేర్పడును. తర్వాత పూర్వరూపము అనగా ఓకారము రెంటికిని అనగా పూర్వపరములయందలి యక్షరములకు ఆదేశముచేయగా అనగా-పూర్వమందలి ఓ కారమునకు పరమందలి అకారమునకు పూర్వమందలి ఓకారము రాగా రామోఽర్చ్యః అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే మనస్ + రథః అనునెడ "మనస్" లోని నకారముపైన హ్రస్వాకారమునకంటె పరమైన పదాంతసకారమునకు 'రథః' అనునెడ 'ర' యను హశ్ పరమైనందున సకారమునకు ఉ కారము రాగా మన+ఉ+రథః అని యేర్పడును. అకార ఉకారములకు గుణము చేయగా 'మనోరథః' అను రూపము సిద్ధించుచున్నది.

**మూలమ్ :-**

42. అవర్ణాత్పరస్య పదాన్త సకారస్య అశి పరే యాదేశః.

దేవాస్ + ఇహ; దేవాస్ + నమ్యాః; దేవాయ్ + ఇహ; దేవాయ్ + నమ్యాః ఇతి స్థితే సతి.

**అనువాదము :-**

42 అవర్ణమునకంటె పరమైన పదాంత సకారమునకు 'అశ్' ప్రత్యాహారమునకు జెందిన యక్షరములు అనగా 'అ ఇ ఉ ణ్' మొదలు 'జ బ గ డ ద శ్' అను వరకు గల సూత్రములలోని వర్ణములు పరమైనచో యకారమాదేశమగును.

ఎట్లనగా-దేవాస్ + ఇహ అనునెడ 'దేవాస్' లోని 'వా' పైని అవర్ణము కంటె పరమైన పదాంత సకారమునకు 'ఇహ' లోని 'ఇ' కారము అశ్ పరమైనందున 'య' కారము రాగా దేవాయ్ + ఇహ అని యేర్పడును.

అట్లే దేవాస్ + నమ్యాః అనునెడ 'దేవాస్' లోని వకారము పైని అవర్ణముకంటె పరమైన పదాంత సకారమునకు "నమ్యాః" లోని నకారము హశ్ పరమైనందున యకారము రాగా దేవాయ్ + నమ్యాః అను రూపమేర్పడును.

ఇట్లు దేవాయ్ + ఇహ అనియు దేవాయ్ + నమ్యాః అనియు రూపములేర్పడగా.

**మూలమ్ :-**

43. అవర్ణాత్పరయోః పదాన్తయకార వకారయోః అశిపరే వాలోపః. తత్ర హలిపరేతు నిత్యమ్. లోపపక్షే అచిపరే గుణాది కార్యఞ్చ న భవతి.

యథా-"దేవాఇహ, దేవాయిహ, దేవానమ్యాః". అన్యాన్యుదాహరణాని:- హరే + ఏహి = హరయేహి, హరఏహి (సూ. 9) శ్రియై + ఉద్యతః = శ్రియాయుద్యతః; శ్రియాఉద్యతః; విష్ణో + ఇహ = విష్ణవిహ, విష్ణఇహ, గురౌ + ఉత్కః = గురావుత్కః, గురాఉత్కః, మనస్ + ఏవేత్యాది చ జ్ఞేయమ్.

**అనువాదము :-**

43. అవర్ణమునకంటె పరములైన పదాంత మందలి యకార వకారములకు అశ్ పరమైనచో వికల్పముగా లోపము హల్ పరమైనచో నిత్యముగా

లోపము. లోపము వచ్చిన పక్షమున అచ్చుపరమైనప్పుడు గుణాది కార్యములు రావు.

కాన పై నియమము ననుసరించి

దేవాయ్+ఇహ అనునెడ "దేవాయ్" లోని వకారముపైని అవర్ణమున కంటె పరమైన య కారమునకు 'ఇహ' లోని ఇకారము 'అశ్' ప్రత్యాహార ఘటక వర్ణము పరమైనందువలన యకారమునకు లోపము వికల్పముగా రాగా 'దేవాఇహ' యను రూపము సిద్ధించుచున్నది.

అట్లే దేవాయ్+నమ్యాః అనునెడ 'దేవాయ్' లోని వకారముపైని అవర్ణమున కంటే పరమైన య కారమునకు 'నమ్యాః' లోని న కారము అశ్ పరమైనందున యకారము నకు లోపము రాగా 'దేవానమ్యాః" అనురూపము సిద్ధించుచున్నది.

ఇతరోదాహరణములు-

హరే+ఏహి అనునెడ 9వ సూత్రముచే 'హరే' లోని ఏకారమునకు 'ఏహి' లోని ఏకారమచ్చు పరమైనందున అయాదేశమురాగా హర్+అయ్+ఏహి=హరయేహి అనురూపము సిద్ధించుచున్నది. తరువాత ప్రకృత సూత్రము ననుసరించి హరయ్+ఏహి అనునెడ 'హరయ్' లోని ర వర్ణము పైని అకారము కంటె పరమైన పదాంత యకారమునకు 'ఏహి' అనునప్పుడు అశ్ పరమైయున్నందున యకారమునకు లోపమురాగా హర+ఏహి = హర ఏహి యను రూపమేర్పడును. ఇచ్చట ఏహిలోని ఏకారము పరమైనందువలన వృద్ధిమున్నగు కార్యములు రావు. ఇది వికల్పముగాన యకార లోపమురాని పక్షమున 'హరయేహి' యని రూపముండును.

అట్లే శ్రియై+ఉద్యతః అనునెడ (9)వ సూత్రముననుసరించి 'శ్రియై" లోని ఐకారమునకు ఆయాదేశమురాగా శ్రియ్ఆయ్+ఉద్యతః = శ్రియాయుద్యతః అను రూపము సిద్ధింపగా ప్రకృత సూత్రముననుసరించి శ్రియామ్+ఉద్యతః అనునప్పుడు పదాంత యకారము లోపింపగా 'శ్రియా ఉద్యతః' అను రూపము సిద్ధించును. ఇది వికల్పముగాన రాని పక్షమున శ్రియాయుద్యతః అను రూపముండును.

**అనువాదము :-**

సమాసవృత్తి

పరమైన యర్థమును చెప్పుట వృత్తి. పరమనగా - విగ్రహవాక్యములో పదార్థములకంటె నితరమై విశిష్టమై ఏకార్థమేది గలదో అది పరము. దానిని ప్రతిపాదించునట్టిది వృత్తి యనఁబడును. విగ్రహవాక్యమందలి పదములకు ప్రక్రియాదశయందు ప్రత్యేకములైన యర్థములు గలవు. అట్లు ప్రత్యేకమగు నర్థము గలవిగ తొలుత గ్రహింపఁబడిన పదములకు సముదాయశక్తితో విశిష్టమగు నర్థమునుఁ బ్రతిపాదించునదియే వృత్తియనఁబడును. ఆ సముదాయశక్తి "సమర్థః పదవిధిః" అను పరిభాషచే లభ్యము. సమాసవృత్తిలో యోగ్యములైన విభక్త్యంత పదములకు ప్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడు వానికి నర్థమును బోధించు వాక్యము విగ్రహము. అట్టి పదసమూహమే విగ్రహము.

సమాసము, ఏకశేషము, తద్ధితము, కృత్, సనాద్యన్తధాతువు అని వృత్తులైదు తెఱంగులు.

పెక్కు పదముల వృత్తులెందు శేషించునో యది సమాసవృత్తి. ఆ సమాసవృత్తి సమర్థాశ్రయమైయుండును.

అదెట్లనగా — ఒక పదముగా రూపొందిన పెక్కుపదములయొక్క సమూహము సమాసము. సమాసముయొక్క అర్థమునుఁ జెప్పునట్టి వాక్యము విగ్రహమనఁబడును. ఆ విగ్రహము లౌకికము-అలౌకికము అని రెండు విధములు. లౌకికమనగాఁ బ్రయోగింపఁదగినది. అలౌకికమనగాఁ బ్రయోగింపఁ దగనిది. అట్టి సమాసము సామాన్యసమాసము మున్నగు ప్రభేదములచే నైదు తెఱంగులు గల్గియున్నది.

కావున సమాసమనగా ఏకార్థీభావమనెడి సామర్థ్యముతో అనగా పెక్కు పదములు కలసి యొక్క యర్థమునిచ్చుట యనెడి సామర్థ్యముతో కూడిన పద సమూహము. ఆ సమాసము సామాన్యముగా రెండు విధములు. అవి (1) నిత్య సమాసము (2) అనిత్యసమాసము అని. విగ్రహము అనగా విభజన చేయుటకు వీలులేనిది, గాని, సమాసఘటక పదములుగాక తదితరపదములచే విభజన చేయ సాధ్యమైనది నిత్యసమాసము. అధిహరి, ప్రాచార్యః, కుంభకారః మున్నగునవి

యుదాహరణములు. ఇచ్చట "అధిహరి" యను సమాసమునకు "హరౌ" అని విగ్రహము చేయవలయును. ఇది సమాసఘటకము గానందువలన అస్వపదము. ఇట్లే ప్రకృష్టః ఆచార్యః = ప్రాచార్యః అనియు, కుంభం కరోతీతి కుంభకారః అనియు సమాసములు, అస్వపద విగ్రహములుగాఁ దెలియఁదగినవి.

ఋషులు నా సమాసము ఐదు తెఱంగులుఁ గల్గియున్నది. అదెట్లనగా—

1. సామాన్య సమాసము.
2. అవ్యయీభావ సమాసము.
3. తత్పురుష సమాసము.
4. బహువ్రీహి సమాసము.
5. ద్వంద్వ సమాసము అని.

అందు అవ్యయీభావము మొదలగు నాల్గుసమాసములకంటె భిన్నమైనది సామాన్యసమాసము. అవ్యయీభావము మున్నగు సమాసములకు నాయా పదములచేతనే పేర్లు తెలియఁదగినవి.

కొందఱు పూర్వపదార్థము ప్రధానముగా గలది అవ్యయీభావమనియు, ఉత్తరపదార్థము ప్రధానముగా గలది తత్పురుషమనియు, అన్యపదార్థము ప్రధానముగాఁ గలది బహువ్రీహి యనియు, ఉభయపదార్థములు అనగా - పూర్వోత్తర పదార్థములు ప్రధానముగా గలది ద్వంద్వమనియు చెప్పుదురు. ఈ లక్షణములన్నియు తఱచుగా సరిపోవునవి కాని పూర్తిగా సరిపోవు.ఏలయనగా ఉన్మత్తగఙ్గమ్, ఆయతీగవమ్ మున్నగు నవ్యయీభావమందును, అతి మాలః, అర్ధపిప్పలి మున్నగు తత్పురుషమునందును, పఞ్చషాః, ద్విత్రాః మున్నగు బహువ్రీహియందును, దంతోష్ఠమ్,పాణిపాదమ్ మున్నగు ద్వంద్వము నందుమ పూర్వముచెప్పిన లక్షణములు లేవు. ఇతర సమాసములకు సరిపోయెడి లక్షణములున్నవి.

సామాన్యసమాసము నలుతెఱంగులై యున్నది.

1. ఇవసమాసము.
2. ఇవార్థసమాసము.
3. గుణసమాసము

4 క్రియావిశేషణ సమాసము అని.

అందు ఇవసమాస మెట్లనగా-

1. **వాగర్థావివ** :— వాగర్థసదృశౌ = వాగర్థావివ యని విగ్రహము.

2. ఇవార్థసమాస మెట్లనగా-

**కాకతాళీయమ్** :— కాకాగమనమివ తాళపతనమివ = కాకతాళమ్. కాకతాళమివ కాకతాళీయమ్.

3. గుణసమాస మెట్లనగా-

**విస్పష్టపటుః** :— విస్పష్టం పటుః = విస్పష్టపటుః.

4. క్రియావిశేషణ సమాస మెట్లనగా-

**భూతపూర్వః** :— పూర్వం భూతః = భూతపూర్వః.

ఆ సామాన్య సమాసము మఱల రెండు విధములు.

1. నామపూర్వపదము.

2. అవ్యయపూర్వపదము.

1. నామపూర్వపదసమాసములు పూర్వము చెప్పఁబడినవి.

2. అవ్యయపూర్వపదము:— నైకధా = అనగా న + ఏకధా = నైకధా.

నాన్తరీయకమ్ :- న + అంతరీయకమ్ = నాఁతరీయకమ్ మున్నగునవి తెలియఁదగినవి.

ఇట్లు సామాన్య సమాసములు నిరూపింపఁబడినవి.

**మూలమ్** :-

## అథ అవ్యయీభావ సమాసః

స చ ప్రాయేణ పూర్వపదార్థ ప్రధానోఽవ్యయశ్చ. స త్రివిధః అవ్యయ రహితః, అవ్యయపూర్వపదః, అవ్యయోత్తరపదశ్చేతి.

1. **అవ్యయరహితావ్యయీ భావసమాసో యథా:**

గఙ్గాయాః పారే = పారేగఙ్గమ్.

గఙ్గాయాః మధ్యే = మధ్యేగఙ్గమ్.

ఉన్మత్తాగఙ్గా యస్మిన్దేశే తదున్మత్తగఙ్గమ్

తిష్ఠన్తి గావో యస్మిన్కాలే స తిష్ఠద్గు = దోహనకాలః.

ఆయాన్తి గావో యస్మిన్ తదాయతీగవమ్.

2. అథావ్యయపూర్వపదావ్యయీభావసమాసో యథా:—

దిశోర్మధ్యే = అపదిశమ్.
హరౌ = అధిహరి.
కృష్ణస్య సమీప ముపకృష్ణమ్.
మద్రాణాం సమృద్ధిః సుమద్రమ్.
యవనానాం వ్యృద్ధిః దుర్యవనమ్.
మక్షికాణా మభావో నిర్మక్షికమ్.
హిమస్యాత్యయోఽతిహిమమ్.
నిద్రా సమ్ప్రతి న యుజ్యత ఇత్యతినిద్రమ్.
హరిశబ్దస్య ప్రకాశః ఇతిహరి.
విష్ణోః పశ్చాదనువిష్ణు.
రూపస్య తుల్య మనురూపమ్.
వృక్షం వృక్షం ప్రతివృక్షమ్.
శక్తిమనతిక్రమ్య యథాశక్తి.
హరేః సాదృశ్యం సహరి.
జ్యేష్ఠస్యానుపూర్వ్యేణే త్యనుజ్యేష్ఠమ్.
చక్రేణ యుగపత్-సచక్రమ్.
సదృశస్సఖ్యా ససఖి.
క్షత్రాణాం సమ్పత్తిస్సక్షత్రమ్.
బుద్ధేరాధిక్యం సమృద్ధిః
తృణమప్యపరిత్యజ్య సతృణమ్,
రామాయణపర్యన్తం సరామాయణమ్.
యావన్తః శ్లోకాః యావచ్ఛ్లోకమ్.
వనాద్బహి ర్బహిర్వనమ్.
వనాత్ప్రాక్ ప్రాగ్వనమ్.
బాలానభివ్యాప్య ఆబాలమ్.
అగ్నిమ్ప్రతి ప్రత్యగ్ని.
అప విష్ణోః అపవిష్ణు.
పరి విష్ణోః పరివిష్ణుః.
ముక్తిం వినా ఆముక్తి—ఇత్యాదయ స్సూత్రక్రమాద్బోధ్యాః. *

* అవ్యయం విభక్తి సమీపసమృద్ధి వ్యృద్ధ్యర్థా భావాత్యయా సమ్ప్రతి శబ్ద ప్రాదుర్భావ పశ్చాద్యథాను పూర్వ్యయౌగపద్యసాదృశ్య సమ్పత్తి సాకల్యాన్త వచనేషు. సూ॥ ॥ ౨-౧-౬॥

**3. అవ్యయోత్తరపదో యథా:—**

**శాకస్య లేశః శాకప్రతి.**

**అక్షేణ విపరీతం వృత్తమక్షపరీత్యాది. త్రివిధో ఽప్యవ్యయీభావ సమాసో ఽవ్యయమేవ.**

## ఇత్యవ్యయీభావసమాసః

### అవ్యయీభావసమాసము.

**అనువాదము:—**

ఈ అవ్యయీభావ సమాసమునకు పూర్వపదార్థముప్రధానము. ఇది యవ్యయముగనే యుండును.

ఇది మూడు తెఱంగులు గల్గియున్నది.

(1) అవ్యయరహితము

(2) అవ్యయ పూర్వపదము

(3) అవ్యయోత్తరపదము.

అందు **1. అవ్యయరహితము :-**

(1) **పారేగఙ్గమ్ :-** గంగాయాః పారే = పారేగఙ్గమ్.

(2) **మధ్యేగఙ్గమ్ :-** గంగాయాః మధ్యే = మధ్యేగఙ్గమ్.

(3) **ఉన్మత్తగఙ్గమ్ :-** ఉన్మత్తా గఙ్గా యస్మిన్దేశే ఉన్మత్తగఙ్గమ్.

(4) తిష్ఠద్గు :- తిష్ఠన్తి గావోయస్మిన్కాలే = తిష్ఠద్గు = దోహన కాలః = పాలుపిదుకు కాలము.

(5) ఆయతీగవమ్ :- ఆయాంతిగావో యస్మిన్ తత్ = ఆయతీగవమ్.

పైనఁజెప్పిన సమాసముల యందెచ్చట నవ్యయములు లేవు.

**2. అవ్యయపూర్వపదము :-**

(1) అపదిశమ్ = దిశోర్మధ్యే = అపదిశమ్.

(2) అధిహరి = హరౌ = అధిహరి.

(3) ఉపకృష్ణమ్ = కృష్ణస్య సమీపం = ఉపకృష్ణమ్.

(4) సుమద్రమ్ = మద్రాణాం సమృద్ధిః = సుమద్రమ్.

(5) దుర్యవనమ్ = యవనానాం వ్యృద్ధిః = దుర్యవనమ్.

(6) నిర్మక్షికమ్ = మక్షికాణాం అభావః = నిర్మక్షికమ్.

(7) అతిహిమమ్ = హిమస్య అత్యయః = అతిహిమమ్.

(8) అతినిద్రమ్ = నిద్రా సమ్ప్రతి న యుజ్యత ఇతి = అతినిద్రమ్.

(9) ఇతిహరి = హరిశబ్దస్య ప్రకాశః = ఇతిహరి.

(10) అనువిష్ణు = విష్ణోః పశ్చాత్ = అనువిష్ణు.

(11) అనురూపమ్ = రూపస్య తుల్యమ్ = అనురూపమ్.

(12) ప్రతివృక్షమ్ = వృక్షం వృక్షం = ప్రతివృక్షమ్.

(13) యథాశక్తి = శక్తిమనతిక్రమ్య = యథా శక్తి = శక్తినిమించక.

(14) సహరి = హరేస్సాదృశ్యం = సహరి = (హరితోటి సామ్యము)

(15) అనుజ్యేష్ఠమ్ = జ్యేష్ఠస్య ఆను పూర్వ్యేణ = అనుజ్యేష్ఠమ్ = (జ్యేష్ఠుని వరుసతో)

(16) సచక్రమ్ = చక్రేణ యుగపత్ = సచక్రమ్ (చక్రముతో సమానకాలము)

(17) ససఖి = సదృశః సఖ్యా = ససఖిః = (చెలికానితో సమానుడు)

(18) సక్షత్రమ్ = క్షత్రాణాం సంపత్తిః = సక్షత్రమ్ (క్షత్రియులవృద్ధి)

(19) సమృద్ధిః = ఋద్ధేరాధిక్యం = సమృద్ధిః (వృద్ధికి యాధిక్యము)

(20) సతృణమ్ = తృణమప్యపరిత్యజ్య = సతృణమ్. (గడ్డిపోచను గూడ వదలక)

(21) సరామాయణమ్ = రామాయణ పర్యంతం = సరామాయణమ్ (రామాయణమువరకు)

(22) యావచ్ఛ్లోకమ్ = యావన్తః శ్లోకాః = యావచ్ఛ్లోకమ్. (ఎన్నిశ్లోకము లున్నవో అన్నియు)

(23) బహిర్వనమ్ = వనాత్ బహిః = బహిర్వనమ్ (వనమునకు వెలుపల)

(24) ప్రాగ్వనమ్ = వనాత్ప్రాక్ = ప్రాగ్వనమ్ (వనమునకు తూర్పు)

(25) ఆబాలమ్ = బాలానభివ్యాప్య = ఆబాలమ్ (బాలురను గలిపి)

(26) ప్రత్యగ్ని = అగ్నింప్రతి = ప్రత్యగ్ని (అగ్నినుద్దేశించి)

(27) అపవిష్ణు = అపవిష్ణోః = అపవిష్ణు (విష్ణువును వదలి)

(28) పరివిష్ణు = పరివిష్ణోః = పరివిష్ణు (విష్ణువు చుట్టు)

(29) అముక్తి = ముక్తిం వినా = అముక్తి (మోక్షమును వదలి)

ఇవి మున్నగునవి సూత్రక్రమము ననుసరించి తెలియవలెను.

**3. అవ్యయోత్తరపదము :-**

(1) శాకప్రతి = శాకస్య లేశః = శాకప్రతి (కొద్ది కూర)

(2) అక్షపరి = అక్షేణ విపరీతం వృత్తం = అక్షపరి (పాచికచేత విపరీతము జరిగినది)

ఈ మూడు తెఱంగులుగల యవ్యయీభావ సమాసము అవ్యయమే యగుచున్నది.

**ఇట్లు అవ్యయీభావసమాసము.**

## అథ తత్పురుషసమాసః

**మూలమ్ :-**

తత్పురుషః ప్రాయేణ ఉత్తరపదార్థ ప్రధాన ఉత్తరపదలిఙ్గశ్చ. స ద్వివిధః వ్యధికరణ స్సమానాధికరణశ్చేతి. తత్ర వ్యధికరణ సమాసస్త్వేకాదశవిధః.

(1) ప్రథమా తత్పురుషః
(2) ద్వితీయా తత్పురుషః
(3) తృతీయా తత్పురుషః
(4) చతుర్థీ తత్పురుషః
(5) పఞ్చమీ తత్పురుషః
(6) షష్ఠీ తత్పురుషః
(7) సప్తమీ తత్పురుషః
(8) నఞ్ తత్పురుషః
(9) ప్రాది సమాసః
(10) ఉపపదసమాసః
(11) మయూర వ్యంసకాది సమాసశ్చేతి.

**ప్రథమా తత్పురుషో యథా :-**

మాసో జాతస్య యస్య = మాసజాతః.

అర్ధం పిప్పల్యాః = అర్ధపిప్పలీ
ఋచోఽర్ధమర్ధర్చమ్.

అయమేవ ఏకదేశి సమాసస్తత్పురుష ప్రభేద ఇతి ప్రథమా తత్పురుషో నాస్తీతి చ ప్రామాణికాః. ప్రథమా పదముద్దిశ్య ద్వితీయాది వత్తత్పురుష విధానాభావాత్.

**ద్వితీయా తత్పురుషో యథా:-**

కృష్ణం శ్రితః = కృష్ణశ్రితః
గ్రామం గతో = గ్రామగతః.

ఏవం దుఃఖాతీతః, అన్నబుభుక్షుః.

**తృతీయాతత్పురుషో యథా:-**

శఙ్కులయా ఖణ్డః = శఙ్కులాఖణ్డః
ధాన్యేనార్థో = ధాన్యార్థః
మాసేన పూర్వో మాసపూర్వః

ఏవం పితృ సదృశః, వాక్కలహః, మాసావరః, ఆచారనిపుణః, మాషవికలమ్, పితృసమః, ఆచారశ్లక్షః.

**చతుర్థీ తత్పురుషో యథా:-**

కుణ్డలాయ హిరణ్యమ్ = కుణ్డలహిరణ్యమ్.
ద్విజాయాయమ్ = ద్విజార్థః.
భూతేభ్యో బలిః భూతబలిః. యూపదారు. గోహితమ్, గోరక్షితమ్.

**పఞ్చమీ తత్పురుషో యథా:-**

చోరాద్భయం = చోరభయమ్.
వృకభీతః
జలాజ్జాతం = జలజాతమ్
చక్రముక్తః, స్వర్గపతితః, సుఖాపేతః.

**షష్ఠీ తత్పురుషో యథా:-**

రాజ్ఞః పురుషో = రాజపురుషః
దేవానాం పూజకః = దేవపూజకః.

సీతాపతిః, మృగపదమ్.

దన్తానాం రాజా రాజదన్తః.

ఏవం హంసానాం రాజా = రాజహంసః.

సర్వేషాం శ్వేతతరః సర్వశ్వేతః.

సర్వేషాం మహత్తరః సర్వమహాన్.

అర్థగౌరవమ్, బుద్ధిమాన్ద్యమ్.

సప్తమీ తత్పురుషో యథా:—

అక్షేషు శౌణ్డో = అక్షశౌణ్డః.

స్థాల్యాం పక్వః = స్థాలీపక్వః.

ఆతపశుష్కః, చక్రబన్ధః, తీర్థధ్వాఙ్క్షః.

నఞ్ తత్పురుషోయథా:—

శ్లో॥ తత్సాదృశ్య మభావశ్చ తదన్యత్వం తదల్పతా।
అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాష్షట్ప్రకీర్తితాః॥

క్రమేణ షణ్ణాముదాహరణాని:—

సాదృశ్యే:— బ్రాహ్మణసదృశోఽబ్రాహ్మణః.

అభావే:— సన్దేహస్యాభావోఽసన్దేహః.

తదన్యత్వే:— అశ్వభిన్నోఽనశ్వః*

తదల్పతాయామ్:— అల్పముదర మనుదరమ్,

అప్రాశస్త్యే- అప్రశస్తాః పశవోఽపశవః.

విరోధే:— సురవిరోధినోఽసురాః.

ఏవ మధర్మః.*

---

*మూలమ్:- తస్మాన్నుడచి ॥౬-౩-౭౪॥

*నభ్రాణ్న పాన్న వేదానాసత్యా నముచి నకుల నఖ నపుంసక నక్షత్ర నక్ర నాకేషు ప్రకృత్యా ॥౬-౩-౭౫॥

నగోఽప్రాణిష్వన్యతరస్యామ్ ॥౬-౩-౭౭॥ ఏతేనిపాత్యన్తే

అనువాదము :- తస్మాన్నుడచి ॥౬-౩-౭౪॥ దీనివలన అనశ్వః ఇత్యాది సమాసములయందు నుడాగమము వచ్చి అనశ్వః ఇత్యాదులు సిద్ధించును.

నభ్రాణ్న పాన్న వేదానాసత్యానముచి నకుల నఖ నపుంసక నక్షత్ర నక్రనాకేషు ప్రకృత్యా ॥౬-౩-౭౫॥

ప్రాది సమాసో యథా:-

ప్రాదయః ఉదాహృతాః.

ప్రగత ఆచార్యః = ప్రాచార్యః.

అతిక్రాన్తో మాలామ్ = అతిమాలః.

అవకృష్టః కోకిలయా = అవకోకిలః.

పరిగ్లానోఽధ్యయనాయ = పర్యధ్యయనః.

నిష్క్రాన్తః కౌశామ్బ్యాః = నిష్కౌశామ్బిః.

ప్రకర్షేణ క్షాళయిత్వా = ప్రక్షాళ్య.

శోభనః పురుషః = సుపురుషః.

కుత్సితో రాజా = కింరాజా.

కుత్సితః పురుషః = కాపురుషః

కుత్సితమన్నం = కదన్నమ్ ఇత్యాదయః.

ఉపపద సమాసో యథా:-

కుమ్భం కరోతీతి కుమ్భకారః.

సోమేనేష్టవాన్ సోమయాజీ.

జలాజ్జాతం జలజమ్.

మన్దురాయాం జాత ఇతి మన్దురాజః.

స్వాదుం కృత్వా స్వాదుఙ్కారమ్.

అగ్రే భుక్త్వా అగ్రభోజమ్.

ఉచ్చైః కృత్వా ఉచ్చైఃకృత్య = ఇత్యాదయః.

మయూరవ్యంసకాది సమాసో ద్వివిధః:-

సుబన్త సమాసస్తిఙన్త సమాసశ్చేతి.

సుబన్తసమాసో యథా:-

వ్యంసకశ్చాసౌ మయూరశ్చ మయూర వ్యంసకః.

ఉదక్చా వాక్చ ఉచ్చావచమ్

నిశ్చితం చ ప్రచితం చ నిశ్చప్రచమ్

---

నగోఽప్రాణిష్వన్యతరస్యామ్ ॥౬-౩-౭౭॥ ఏతేనిపాత్యన్తే. పై రెండు సూత్రముల వలన "నక్షత్రాట్" మున్నగు 'నఞ్' సమాసములును నక్షత్ర మున్నగు నఞ్ సమాసములును నిపతింపఁబడినవి.

నాస్తి కిఞ్చన యస్య సః అకిఞ్చనః
నాస్తి కుతో భయం యస్య సః అకుతోభయః.
అన్యో రాజా రాజాన్తరమ్.
చిదేవ చిన్మాత్రమ్

తిఙన్తసమాసో ద్వివిధః—క్రియా పూర్వ పదః, క్రియోభయపదశ్చేతి.

ఆద్యో యథా :—

జహిజోడం జహిజోడమితి అభీక్ష్ణ్యేన య ఆహ స జహిజోడః.

ఏవం జహిసింహః.

ద్వితీయో యథా:-

ఖాదత మోదతేతి యస్యాం క్రియాయాం సా ఖాదతమోదతా

ఏహీడ ఇతి యస్మిన్ కర్మణి తదేహీడమ్. ఏహియవ మిత్యాది.

ఇతి వ్యధికరణ తత్పురుషః.

అనువాదము :—

## తత్పురుషసమాసము

తత్పురుషసమాసము తఱచుగా ఉత్తర పదార్థమును ప్రధానముగా గల్గియుండును. దానికి ఉత్తరపదలింగము గూడ వచ్చును.

అది రెండు విధములు.

(1) వ్యధికరణ తత్పురుషము
(2) సమానాధికరణ తత్పురుషము

అందు వ్యధికరణ తత్పురుషము పదునొకండు తెఱంగులు గల్గి యున్నది. ఎట్లనగా—

(1) ప్రథమా తత్పురుషము
(2) ద్వితీయా తత్పురుషము
(3) తృతీయా తత్పురుషము.
(4) చతుర్థీ తత్పురుషము
(5) పంచమీ తత్పురుషము
(6) షష్ఠీ తత్పురుషము
(7) సప్తమీ తత్పురుషము

(8) నఞ్ తత్పురుషము
(9) ప్రాది సమాసము
(10) ఉపపద సమాసము
(11) మయూరవ్యంస కాది సమాసము అని.

**1. ప్రథమా తత్పురుషము :-**

(1) **మాసజాతః**=మాసః జాతస్య యస్య = మాసజాతః (పుట్టి ఒక మాసము నిండినవాడు)
(2) **అర్ధపిప్పలీ**=అర్ధం పిప్పల్యాః=అర్ధపిప్పలీ (పిప్పలిలో నర్ధభాగము)
(3) **అర్ధర్చమ్**=ఋచః అర్ధమ్=అర్ధర్చమ్ (ఋక్కులో సగపాలు)

తత్పురుష భేదములకుఁజెందిన ఏకదేశసమాసమిదియే యనియు ప్రథమా తత్పురుషము లేదనియు ప్రామాణికులు వచింతురు. ఏలయనగా - ద్వితీయాది విభక్తుల నుద్దేశించి తత్పురుషమును విధించినట్లు ప్రథమావిభక్తి నుద్దేశించి తత్పురుషము విధింపఁబడలేదు.

**2. ద్వితీయా తత్పురుషము :-**

(1) **కృష్ణశ్రితః** :- కృష్ణం శ్రితః = కృష్ణశ్రితః. (శ్రీకృష్ణుని ఆశ్రయించినవాడు )
(2) **గ్రామగతః** :- గ్రామం గతః = గ్రామగతః. (గ్రామమును పొందినవాడు.) ఇట్లే
(3) **దుఃఖాతీతః** :- దుఃఖము నతిక్రమించినవాడు.
(4) **అన్నబుభుక్షుః** :- (అన్నముఁ దినగోరినవాడు)

మున్నగునవి యూహ్యములు. ఇచ్చట కృష్ణం, గ్రామం మున్నగునవి ద్వితీయాంతములు.

**తృతీయా తత్పురుషము :-**

(1) శఙ్కులాఖండః :- శఙ్కులయా ఖండః=శఙ్కులాఖండః.
(2) ధాన్యార్థః :- ధాన్యేన అర్థః=ధాన్యార్థః.
(3) మాసపూర్వః :- మాసేన పూర్వః=మాసపూర్వః.

ఇట్లే-పితృసదృశః, వాక్కలహః, మాసావరః, ఆచారనిపుణః, మాషవికలమ్, పితృసమః, ఆచారశ్లక్ష్ణః, అనునవి యూహ్యములు.

4. చతుర్థీతత్పురుషము :-

(1) కుణ్డలహిరణ్యమ్ :- కుణ్డలాయ హిరణ్యమ్ = కుణ్డలహిరణ్యమ్
(2) ద్విజార్థః : ద్విజాయాఽయం ద్విజార్థః.
(3) యూపదారు :-యూపాయ దారు = యూపదారు.
(4) గోహితమ్ :- గవే హితమ్ = గోహితమ్.
(5) గోరక్షితమ్ :- గవే రక్షితమ్ = గోరక్షితమ్.
(6) భూతబలిః :- భూతేభ్యో బలిః = భూతబలిః. మున్నగు చతుర్థ్యంతములతో సమాసము లూహ్యములు.

5. పఞ్చమీ తత్పురుషము :—

(1) చోరభయమ్ :- చోరాత్ భయమ్ = చోరభయమ్.
(2) వృకభీతః :- వృకాత్ భీతః = వృకభీతః.
(3) జలజాతమ్ :- జలాత్ జాతం = జలజాతమ్.

ఇత్యాది పఞ్చమ్యన్తములతో సమాసము లూహ్యములు.

అట్లే-చక్రముక్తః, స్వర్గపతితః, సుఖాపేతః, మున్నగు పఞ్చమీ తత్పురుషములుగ నూహ్యములు.

6. షష్ఠీతత్పురుషము :-

(1) రాజపురుషః :- రాజ్ఞః పురుషః = రాజపురుషః.
(2) దేవపూజకః :- దేవానాం పూజకః = దేవపూజకః.
(3) సీతాపతిః :- సీతాయాః పతిః = సీతాపతిః.
(4) మృగపదమ్ :- మృగస్య పదమ్ = మృగపదమ్.
(5) రాజదన్తః :- దన్తానాం రాజా = రాజదన్తః
(6) రాజహంసః :- హంసానాం రాజా = రాజహంసః
(7) సర్వశ్వేతః :- సర్వేషాం శ్వేతతరః = సర్వశ్వేతః.
(8) సర్వమహాన్ :- సర్వేషాం మహత్తరః = సర్వమహాన్ మున్నగు షష్ఠ్యన్తములతో సమాసములూహ్యములు. ఇట్లే అర్థగౌరవమ్, బుద్ధిమాంద్యమ్, మున్నగునవి షష్ఠీతత్పురుషములుగ నూహ్యములు.

**7. సప్తమీ తత్పురుషము :—**

(1) అక్షశౌణ్డః :- అక్షేషు శౌణ్డః=అక్ష శౌణ్డః.
(2) స్థాలీపక్వః :- స్థాల్యాం పక్వః=స్థాలీపక్వః.
(3) ఆతపశుష్కః :- ఆతపే శుష్కః=ఆతపశుష్కః,
ఇత్యాది సప్తమ్యంతములతో సమాసము లూహ్యాములు.
ఇట్లే- చక్రబన్ధః, తీర్థధ్వాంక్షః మున్నగునవి సప్తమీ తత్పురుషములుగ నూహ్యాములు.

**8. నఞ్ తత్పురుషము:—**

సాదృశ్యము, అభావము, తదన్యత్వము, అల్పత్వము, అప్రాశస్త్యము, విరోధము అని నఞ్‌నకు ఆరు అర్థములు కలవు. వానికుదాహరణములు:-

సాదృశ్యమునకు :- అబ్రాహ్మణః-బ్రాహ్మణ సదృశః-అబ్రాహ్మణః.
అభావమునకు :- అసందేహః-సందేహస్య అభావః-అసందేహః.
తదన్యత్వమునకు :- అనశ్వః-అశ్వభిన్నః=అనశ్వః.
అల్పత్వమునకు :- అనుదరమ్ - అల్పముదరమ్=అనుదరమ్.
అప్రాశస్త్యమునకు :— అపశవః-అప్రశస్తాః పశవః=అపశవః.
విరోధమునకు: అసురాః-సురవిరోధినః=అసురాః. ఇట్లే అధర్మః. మున్నగునవియు నూహ్యాములు,

**9. ప్రాది సమాసము :—**

వెనుక పుటలలో ప్ర-పరా-అప-సమ్, అను, అవ, నిస్, దుస్, (నిర్, దుర్) వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి పరి, ఉప, యని ప్రాదులు ఉదాహరింపఁబడినవి. ఆయుపసర్గలతో నేర్పడు సమాసము ప్రాది సమాసమనబడును.

ప్రాచార్యః :- ప్రగతః ఆచార్యః=ప్రాచార్యః. ఇచ్చట 'ప్ర' యను నుపసర్గకు ప్రగతః యనునర్థము. దానితోడ సమాసము చేయగా ప్రాచార్యః అను రూపము సిద్ధించు చున్నది.

అట్లే-
అతిమాలః అనునెడ 'మాలామతిక్రాంతః' యనియు
అవకోకిలః అనునెడ 'అవకృష్టః కోకిలయా' అనియు

పర్యధ్యయనః అనునెడ, 'పరిగ్లానోఽధ్యయనాయ పర్యధ్యయనః' యనియు
నిష్కౌశాంబిః అనునెడ 'నిష్క్రాన్తః కౌశాంబ్యాః నిష్కౌశాంబిః' యనియు
ప్రక్షాల్య అనునెడ='ప్రకర్షేణ క్షాలయిత్వా' యనియు
సుపురుషః అనునెడ 'శోభనః పురుషః' యనియు
కింరాజా అనునెడ 'కుత్సితో రాజా' యనియు
కాపురుషః అనునెడ 'కుత్సితః పురుషః=కాపురుషః' యనియు
కదన్నమ్ అనునెడ 'కుత్సితమన్నం కదన్నమ్' అనియు విగ్రహము లెఱుంగునది.

10. **ఉపపద సమాసము :-**

కుంభకారః :-కుంభం కరోతి యను విగ్రహమున కుంభమ్ అను ద్వితీయాంతము ఉపపదము. అది కరోతి యను వ్యుత్పత్తిచే సిద్ధమైన సమర్థమైన 'కార' శబ్దముతో సమాసము నొందుటచే కుంభకార యను సమాసము సిద్ధించుచున్నది.

అట్లే-

సోమయాజీ అనునెడ 'సోమేన ఇష్టవాన్' అను విగ్రహము ననుసరించి సోమయాజీ యను రూపము సిద్ధించుచున్నది.

అట్లే-

జలజమ్ అనునెడ 'జలాజ్జాతమ్' అను విగ్రహము ననుసరించి 'జలజమ్' అను రూపము సిద్ధించుచున్నది.

అట్లే-

మన్దురాజః అనునెడ 'మన్దురాయాం జాతః' యనియు
స్వాదుఙ్కారమ్ అనునెడ 'స్వాదుం కృత్వా' యనియు
అగ్రేభోజమ్ అనునెడ 'అగ్రే భుక్త్వా' యనియు
ఉచ్చైఃకృత్య అనునెడ 'ఉచ్చైః కృత్వా' యనియు విగ్రహము లూహ్యములు.

11. **మయూరవ్యంసకాది సమాసము :-**

ఇది రెండు విధములు.

1. సుబన్తసమాసము.
2. తిఙన్త సమాసము అని.

**అందు సుబన్త సమాసము :-**

*మయూరవ్యంసకః* :- వ్యంసకశ్చాపౌ మయూరశ్చ మయూరవ్యంసకః. వ్యంసక మనగా దుష్టమైనది. గుణవాచకమైన వ్యంసకశబ్దమునకు పూర్వప్రయోగము రాకుండుటకై ఇవి-ఈ సమాసములు, సమాసకార్యములలో నిపతింపఁబడినవి.

*నిశ్చప్రచమ్* అనునెడ 'నిశ్చితం చ ప్రచితం చ' యనియు
*అకిఞ్చనః* అనునెడ ''నాస్తి కిఞ్చన యస్య సః'' యనియు
*అకుతోభయః* అనునెడ ''నాస్తి కుతో భయం యస్య సః'' యనియు
*రాజాన్తరమ్* అనునెడ 'అన్యో రాజా' యనియు
*చిన్మాత్రమ్* అనునెడ 'చిదేవ' యనియు విగ్రహము తెలియంగునది.

తిజన్త సమాసము రెండు విధములు.

(1) క్రియా పూర్వపదము.

(2) క్రియోభయ పదము అని.

*అందు మొదటిది* :-

*జహిజోడః* :- జహిజోడం జహిజోడమితి ఆభీక్ష్ణ్యేన య ఆహ సః = జహిజోడః.
జోడును చంపుము జోడును చంపుము అని పలుమాఱు లెవ్వఁడు చెప్పునో యతడు జహిజోడుడని యర్థము. ఇందు జహియను క్రియ పూర్వమందుండుటవలన నిది క్రియా పూర్వపదము. ఇట్లే-జహిసింహః అనునెడను విగ్రహవాక్యము.

*రెండవదియైన క్రియోభయపదము*

*ఖాదతమోదతా* అనునెడ 'ఖాదత మోదత ఇతి యస్యాం క్రియాయాం సా' అను విగ్రహముచే "ఖాదతమోదతా" యను సమాసము సిద్ధించుచున్నది. ఇచ్చట ఖాదత యను క్రియ పూర్వపదముగను, మోదత యను క్రియ యుత్తరపదముగను యుండుట వలన నిది క్రియోభయ పద సమాసమైనది. తినుడు, సంతసింపుడు అని యే క్రియ యందు చెప్పఁబడునో ఆక్రియ "ఖాదతమోదత" యని దాని యర్థము.

**ఏహీడమ్** అనునెడ "ఏహి ఈడే ఇతి యస్మిన్ కర్మణి తత్" అని విగ్రహ మెఱుంగునది. రమ్ము ప్రార్థింపుము అని ఏ క్రియయందుఁ జెప్పఁ బడునో అది ఏహీడమని చెప్పఁబడును.

ఇచ్చట "ఏహి" యను క్రియ పూర్వమందును, 'ఈడే' (స్తౌమి) యను క్రియ ఉత్తరమందు నుండుటవలన నిది క్రియో భయపద మైనది.

ఇట్లే 'ఏహియవమ్' అనునదియు నూహింపఁదగినది.
ఇంతవరకును వ్యధికరణతత్పురుషము, విభిన్న విభక్త్యంత పదము లతోఁ గూడిన తత్పురుషము, నిరూపితము.

**మూలమ్ :-**

అథ సమానాధికరణ తత్పురుషో ద్వివిధః. కర్మధారయో ద్విగుశ్చేతి.

**అథ కర్మధారయః**

కర్మధారయో నవవిధః

(1) విశేషణ పూర్వపదః.
(2) విశేష్యపూర్వపదః
(3) విశేషణో భయపదః
(4) ఉపమాన పూర్వపదః.
(5) ఉపమనోత్తర పదః
(6) సమ్భావనాపూర్వపదః
(7) అవధారణా పూర్వపదః
(8) భిన్న పూర్వ పదః
(9) లుప్త మధ్యమ పదశ్చేతి.

1. **విశేషణ పూర్వపద కర్మధారయో యథా :—**

నీలశ్చా సౌ ఘటశ్చ నీలఘటః.
నీలౌ చ తౌ ఘటౌ చ నీలఘటౌ
నీలాశ్చతే ఘటాశ్చ నీలఘటాః.

రక్తా చ సా పటీచ రక్తపటీ
రక్తే చ తే పట్యౌ చ రక్తపట్యౌ
రక్తాశ్చ తాః పట్యశ్చ రక్తపట్యః.
నీలఞ్చ తత్ ఉత్పలఞ్చ నీలోత్పలమ్.
నీలే చ తే ఉత్పలే చ నీలోత్పలే.
నీలాని చ తాని ఉత్పలాని చ నీలోత్పలాని. ఏవ ముత్తరత్ర.

2. విశేష్య పూర్వపద కర్మధారయో యథా:-
వైయాకరణశ్చాసౌ ఖసూచిశ్చ = వైయాకరణఖసూచిః.
మీమాంసకశ్చాసౌ దుర్దురూటశ్చ = మీమాంసక దుర్దురూటః,

3. విశేషణోభయపదో యథా:-
కృష్ణశ్చాసౌ సారఙ్గశ్చ కృష్ణసారఙ్గః (వర్ణవిశేషావేతా)
స్నాతశ్చా సౌ అనులిప్తశ్చ = = స్నాతానులిప్తః.

4. ఉపమాన పూర్వపదో యథా:—
చన్ద్ర ఇవ ముఖం = చన్ద్రముఖమ్.
ఘన ఇవ శ్యామః = ఘనశ్యామః

5. ఉపమానోత్తరపదో యథా:—
పురుషో వ్యాఘ్ర ఇవ = పురుషవ్యాఘ్రః.
నా సింహ ఇవ = నృసింహః.

6. సమ్భావనా పూర్వపదో యథా:—
గుణ ఇతి బుద్ధిః గుణబుద్ధిః
ముఖమితి పద్మం ముఖపద్మమ్.
సహ్య ఇతి నగః సహ్యనగః.

7. అవధారణా పూర్వపదో యథా:-
ముఖమేవ చన్ద్రః ముఖచన్ద్రః
విద్యైవ ధనం విద్యాధనమ్.

8. ఖిన్నపూర్వో యథా :—
అశ్రేణయః శ్రేణయః సమ్పద్యమానాః కృతాః శ్రేణీకృతాః.

కృతఇ్చ తత్ అకృతఇ్చ కృతాకృతమ్. ఏవం శుక్లీభూతః, కృష్ణీభూతః.

9. లుప్తమధ్యమపదో యథా:—

శాకప్రియః పార్థివః శాకపార్థివః

దేవపూజకో బ్రాహ్మణః దేవబ్రాహ్మణః. అయమేవ శాక పార్థివాది సమానః.

ఇతి కర్మ ధారయః.

**అనువాదము :—**

ఇక సమానాధికరణ తత్పురుషము అనగా-సమాన విభక్త్యంతములగు పదములతో వేర్పడు సమాసము.

ఇది రెండు విధములు.

(1) కర్మధారయము
(2) ద్విగువు.

*కర్మధారయ సమాసము :—*

ఇది తొమ్మిది విధములు :

(1) విశేషణ పూర్వపదము.
(2) విశేష్య పూర్వ పదము.
(3) విశేషణో భయపదము.
(4) ఉపమాన పూర్వ పదము.
(5) ఉపమానో త్తరపదము.
(6) సంభావనా పూర్వపదము.
(7) అవధారణాపూర్వపదము.
(8) భిన్నపూర్వపదము.
(9) లు ప్త మధ్యమపదము అని.

1. విశేషణ పూర్వపద కర్మధారయము :

నీలఘటః అనునెడ "నీలశ్చాసౌ ఘటశ్చ" అని విగ్రహము.
నీలఘటౌ అనునెడ "నీలౌ తౌ ఘటౌ చ" అని విగ్రహము.
నీలఘటాః అనునెడ 'నీలాశ్చ తే ఘటాశ్చ' అని విగ్రహము.

ఇచ్చట నీలఘటః అనగా నల్లనికుండ యని యర్థము. ఇందు నల్లని యను నర్థముగల నీలశబ్దము విశేషణము. ఘటము విశేష్యము. విశేషణ వాచకమైన నీలశబ్దము పూర్వమందుండుట వలన విశేషణ పూర్వపదకర్మధారయము.

నీలఘటౌ అనునెడ ద్వివచనాంతములైన నీలఘట శబ్దములకును, నీలఘటాః అనునెడ బహువచనాంత నీలఘటశబ్దములకును సమాసములు. ఇవి పుంలిఙ్గముల కుదాహరణములు ఇట్లే-

రక్తపటీ అనునెడ 'రక్తా చ సా పటీ చ' యనియు
రక్తపట్యౌ అనునెడ 'రక్తే చ తే పట్యౌ చ' యనియు
రక్తపట్యః అనునెడ 'రక్తాశ్చ తాః పట్యశ్చ' యనియు

ఏక వచన - ద్వివచన - బహువచనములయందు విశేషణ పూర్వపద కర్మధారయములు ఊహ్యములు. ఇచట రక్తశబ్దము విశేషణ వాచకము, పటీ శబ్దము విశేష్యవాచకమనియు నరయునది. ఇవి స్త్రీలిఙ్గముల కుదాహరణములు. ఇట్లే—

నీలోత్పలమ్ అనునెడ 'నీలం చ తత్ ఉత్పలం చ' యనియు.
నీలోత్పలే అనునెడ 'నీలే చ తే ఉత్పలే చ' యనియు
నీలోత్పలాని అనునెడ 'నీలాని చ తాని ఉత్పలాని చ' యనియు

ఏకవచన-ద్వివచన-బహువచన నపుంసకములతోటి విశేషణ పూర్వపదకర్మ ధారయము లరయునది.

ఇచ్చట నంతట నీల శబ్దము విశేషణ వాచకముగను, ఉత్పలశబ్దము విశేష్యవాచకముగను నరయునది.

**2. విశేష్య పూర్వపద కర్మధారయము : —**

వైయాకరణఖసూచిః అనునెడ 'వైయాకరణశ్చాసౌ ఖసూచిశ్చ' అని విగ్రహము.

ఇచ్చట వైయాకరణ శబ్దము విశేష్యవాచకపదము. అది పూర్వపదముగా నున్నది.

ఇట్లే-

**మీమాంసకదుర్దురూటః** అనునెడ 'మీమాంసకశ్చాసౌ దుర్దురూటశ్చ' యని విగ్రహము. ఇచ్చట మీంమాంసక శబ్దము విశేష్యవాచకము. అది పూర్వ పదముగా నున్నది.

**3. విశేషణోభయపద కర్మధారయము :-**

కృష్ణసారఙ్గః అనునెడ 'కృష్ణశ్చాసౌ సారఙ్గశ్చ' యని విగ్రహము. ఇందు కృష్ణ శబ్దము, సారఙ్గశబ్దము వర్ణవాచకములై, విశేషణవాచకములై యున్నవి. అందు కృష్ణశబ్దము పూర్వమందును, సారఙ్గశబ్దము ఉత్తరమందును నుండుటవలన విశేషణోభయపద కర్మధారయము.

**4. ఉపమాన పూర్వపద కర్మధారయము :-**

చన్ద్రముఖమ్ అనునెడ 'చన్ద్ర ఇవ ముఖమ్' అని విగ్రహము. ఇందు చంద్ర శబ్దము ఉపమానవాచకము గాన నది పూర్వమందుండుటవనన ఉప మాన పూర్వపద కర్మధారయము.

**ఘనశ్యామః** అనునెడ 'ఘన ఇవ శ్యామః' యని విగ్రహము. ఇచ్చట ఘనశబ్దము ఉపమానవాచకము గాన నది పూర్వపదముగా నున్నందువలన ఉపమాన పూర్వపద కర్మధారయము.

**5. ఉపమానోత్తరపదకర్మధారయము :-**

పురుషవ్యాఘ్రః అనునెడ 'పురుషో వ్యాఘ్ర ఇవ' యని విగ్రహము. ఇచ్చట ఉప మానము వ్యాఘ్రము. అది యిచ్చట ఉత్తరపదముగా నున్నందువలన నిది ఉపమానోత్తరపద కర్మధారయము.

నృసింహః అనునెడ 'నా సింహః ఇవ' యని విగ్రహము. ఇచ్చట ఉపమానము సింహము. అది ఉత్తరపదముగా నుండుటవలన నిది ఉపమానోత్తర పద కర్మధారయము.

**6. సంభావనా పూర్వపద కర్మధారయము :-**

**గుణబుద్ధిః** అనునెడ 'గుణ ఇతి బుద్ధిః' యని విగ్రహము. ఇచ్చట గుణము బుద్ధిగా సంభావింపఁబడినది. ఆ సంభావన ఇతి శబ్దముచే ద్యోతితము.

అట్లే-

ముఖపద్మమ్ అనునెడ 'ముఖమితి పద్మమ్' అని విగ్రహము. ఇచ్చట ముఖము పద్మముగా సంభావింపఁబడినది.

సహ్యానగః అనునెడ 'సహ్యా ఇతి నగః' యని విగ్రహము. ఇచ్చట సహ్యము నగముగా అనగా పర్వతముగా సంభావింపఁబడినది.

7. అవధారణా పూర్వపద కర్మధారయము :-

ముఖచన్ద్రః అనునెడ 'ముఖమేవ చంద్రః = ముఖచంద్రః' యని విగ్రహము. ఇచ్చట ముఖము చంద్రునిగా అవధారణ చేయఁబడినది. అనగా నిర్ధారణ చేయబడినది. ఆ నిర్ధారణ ఏవకారముచే ద్యోతితము.

విద్యాధనమ్ అనునెడ 'విద్యా ఏవ ధనమ్' అని విగ్రహము. ఇచ్చట విద్య ధనముగా నిర్ధారణ చేయఁబడినది కావున అవధారణా పూర్వపదకర్మధారయము.

8. భిన్నపూర్వపద కర్మధారయము.

శ్రేణీకృతాః అనునెడ అశ్రేణయః శ్రేణయః సంపద్యమానాః కృతాః అని విగ్రహము.

కృతాఽకృతమ్ అనునెడ 'కృతఞ్చ తత్ అకృతం చ' యని విగ్రహము.
ఇట్లే—
శుక్లీభూతః, కృష్ణీకృతః ఇత్యాదు లెఱుంగునది.

9. లుప్త మధ్యమ పదకర్మధారయము :-

శాకపార్థివః అనునెడ 'శాకప్రియః పార్థివః' అని విగ్రహము. ఇచ్చట ప్రియః అను మధ్యమ పదము లోపించినది కాన నిది లుప్తమధ్యమ పదకర్మధారయము.

దేవబ్రాహ్మణః అనునెడ 'దేవపూజకో బ్రాహ్మణః దేవబ్రాహ్మణః' అని విగ్రహము. ఇచ్చట పూజకః అను మధ్యమ పదము లోపించినది.

ఇదియే శాకపార్థివాది సమాసము.

ఇంతటితో కర్మధారయసమాసము సమాప్తము.

మూలమ్ :-

## అథ ద్విగు సమాసః

సఙ్ఖ్యాపూర్వస్తత్పురుష విశేషో ద్విగురిత్యుచ్యతే. స త్రివిధః.

(1) తద్ధితార్థ ద్విగుః
(2) ఉత్తర పద ద్విగుః
(3) సమాహార ద్విగుశ్చేతి.

1. *తద్ధితార్థద్విగుర్యథా :—*

పూర్వస్యాం శాలాయాం భవః=పౌర్వశాలః.
షణ్ణాం మాతౄణా మపత్యం పుమాన్ = షాణ్మాతురః.
ద్వయోర్మాత్రో రపత్యం పుమాన్=ద్వైమాతురః.
అష్టసు కపాలేషు సంస్కృతః పురోడాశః=అష్టాకపాలః.

ఏవం-సప్తర్షయః, షడృతవః ఇత్యాది.
అస్యైవ అనేకవద్భావీ ద్విగురితి వ్యవహారః.

2. *ఉత్తరపద ద్విగుర్యథా :-*

పఞ్చగావో ధనం యస్య సః పఞ్చగవధనః.
దశసు గృహేషు ప్రవిష్టః దశగృహప్రవిష్టః.
ద్వే అహనీ జాతస్య యస్య ద్వ్యహ్నా జాతః.

3. *సమాహార ద్విగుర్యథా :-*

త్రయాణాం లోకానాం సమాహార స్త్రిలోకీ.
పఞ్చానాం తక్ష్ణాం సమాహారః పఞ్చతక్షీ. పఞ్చతక్షఞ్చ.
పఞ్చానాం పాత్రాణాం సమాహారః పఞ్చపాత్రమ్.

ఏవం త్రిభువనమ్, చతుర్యుగమ్, పఞ్చగవమ్, చతుష్పథమ్, ఇత్యాది. అయ మేవ ఏకవద్భావీ ద్విగురిత్యుచ్యతే.

ఇతి ద్విగుః—తత్పురుషశ్చ.

**అనువాదము :—**

## ద్విగు సమాసము

సంఖ్యలను అనగా అంకెలను చెప్పెడి శబ్దములను పూర్వమందుగల తత్పురుషము ద్విగుసమాసమని చెప్పఁబడును.

అది మూడు విధములు.

(1) తద్ధితార్థ ద్విగువు.
(2) ఉత్తరపద ద్విగువు.
(3) సమాహార ద్విగువు అని.

*1.* తద్ధితార్థద్విగువు :—

**పౌర్వశాలః** అనునెడ 'పూర్వస్యాం శాలాయాం భవః' అని విగ్రహము. ఇచ్చట పూర్వశబ్దము దిగ్వాచకము. అది ముందున్నవలన ద్విగుసమానము. ఇచ్చట ఞ-యనెడి తద్ధితప్రత్యయము వలన ఆదివృద్ధి వచ్చి పౌర్వశాలః అని యైనది.

**షాణ్మాతురః** అనునెడ 'షణ్ణాం మాతౄణా మపత్యం పుమాన్' అని విగ్రహము. ఇదియు తద్ధితార్థ ద్విగువు. కాని సంఖ్యాపూర్వకము. ఇచ్చట తద్ధిత ప్రత్యయము అణ్. దానివలన ఆది వృద్ధియు ప్రకృతికి ఉకారాదేశము వచ్చినది.

**ద్వైమాతురః** అనునెడ 'ద్వయోర్మాత్రో రపత్యం పుమాన్=ద్వైమాతురః' యని విగ్రహము. ఇదియు పూర్వమువలె సంఖ్యాపూర్వ తద్ధితార్థ ద్విగువు.

**అష్టాకపాలః** అనునెడ 'అష్టసు కపాలేషు సంస్కృతః పురోడాశః' అను విగ్రహము. ఇదియు సంఖ్యాపూర్వ తద్ధితార్థ ద్విగువు.

ఇట్లే—సప్తర్షయః, షడృతవః, మున్నగునవి యూహ్యములు. ఇది యనేక వద్భావి ద్విగువనియుఁ జెప్పఁబడుచున్నది. ఏలయనగా పురోడాశాదులు ముఖ్యార్థము లొక్కటియైనను అనేకముగా కానవచ్చుటవలన అనేకవద్భావి యని చెప్పఁబడును.

2. ఉత్తరపదద్విగువు :-

పఞ్చగవధనః అనునెడ 'పఞ్చ గావో ధనం యస్య సః' అని విగ్రహము.

దశగృహప్రవిష్టః అనునెడ 'దశసు గృహేషు ప్రవిష్టః దశగృహప్రవిష్టః' అని విగ్రహము.

ద్వ్యహ్నజాతః 'ద్వే అహనీ జాతస్య యస్య ద్వ్యహ్నజాతః' యని విగ్రహము.

పై మూడింటిలోను పఞ్చగవధన యనునెడ పఞ్చగవ యను ద్విగువునకు 'ధన' యని యుత్తరపదము, దశగృహప్రవిష్టః అనునెడ దశగృహ యను ద్విగువునకు ప్రవిష్టయను నుత్తరపదము ద్వ్యహ్నజాతః అనునెడ ద్వ్యహ్నయను ద్విగువునకు జాతః అని యుత్తరపదము పరముగా నున్నందున నిది యుత్తర పద ద్విగు యని చెప్పఁబడుచున్నది.

3. సమాహార ద్విగువు :-

త్రిలోకీ యనునెడ 'త్రయాణాం లోకానాం సమాహారః' యని విగ్రహము.

పఞ్చతక్షీ యనునెడ 'పఞ్చానాం తక్ష్ణాం సమాహారః' యని విగ్రహము. పఞ్చ తక్షమ్ అనియు రూపము.

పఞ్చపాత్రమ్ అనునెడ 'పఞ్చానాం పాత్రాణాం సమాహారః' అని విగ్రహము.

పైన జెప్పఁబడిన సమాసముల యందంతట సమాహారము వాచ్యముగ నున్నది గాన నిది సమాహారద్విగువు.

ఇట్లే-త్రిభువనమ్, చతుర్యుగమ్, పఞ్చగవమ్, చతుష్పథమ్ మున్నగు నవి యూహ్యములు.

ఇదియే ఏకవద్భావి ద్విగువని చెప్పఁబడుచున్నది. ఏలయనగా నిందలి పదార్థ కములు సమాహారముచే నొక్కటిగా కన్పడుచున్నవి కాన నేకవద్భావిత్వము.

ఇట్లు ద్విగువు -- తత్పురుషము నిరూపితములు.

**మూలమ్ :—**

## అథ బహువ్రీహిః

బహువ్రీహిః ప్రాయేణాన్యపదార్థప్రధానో విశేష్య నిఘ్నశ్చ.
స చ షోడశ విధః.

(1) ద్విపద బహువ్రీహిః
(2) బహుపద బహువ్రీహిః
(3) వ్యధికరణ బహువ్రీహిః
(4) వికార బహువ్రీహిః
(5) సఙ్ఖ్యాత బహువ్రీహిః
(6) అభ్యాస బహువ్రీహిః
(7) వికల్ప బహువ్రీహిః
(8) సామీప్య బహువ్రీహిః
(9) దిగన్తరాళ బహువ్రీహిః
(10) వ్యతిహారలక్షణ బహువ్రీహిః
(11) సమసమ్బన్ధ బహువ్రీహిః
(12) లుప్త మధ్యమ పద బహువ్రీహిః
(13) ఉపమాన బహువ్రీహిః
(14) క్రియాపూర్వపద బహువ్రీహిః
(15) నఞ్ బహువ్రీహిః
(16) ప్రాది బహువ్రీహిశ్చేతి.

1. తత్ర ద్విపద బహువ్రీహి స్సప్తవిధః.

(1) ద్వితీయా బహువ్రీహిః
(2) తృతీయా బహువ్రీహిః
(3) చతుర్థీ బహువ్రీహిః
(4) పఞ్చమీ బహువ్రీహిః
(5) షష్ఠీ బహువ్రీహిః
(6) సప్తమీ బహువ్రీహిః
(7) క్రియా విశేషణ బహువ్రీహిశ్చేతి.

1, ద్వితీయా బహువ్రీహిర్యథా :-

ప్రాప్త ఆనన్దో యం సః=ప్రాప్తానన్దః. ఏవం ప్రాప్తకామః, ఆరూఢవానరః (వృక్షః) ఇత్యాది.

2. తృతీయా బహువ్రీహిర్యథా :-

ఊఢో రథో యేన సః ఊఢరథః (అనడ్వాన్). ఏవమ్— కృతకృత్యః, ధృతవస్త్రః, జితసేనః, ఇత్యాది.

3. చతుర్థీ బహువ్రీహిర్యథా :-

ఉపహృతః పశుః యస్మై సః=ఉపహృతపశుః. (రుద్రః) ఏవ మర్పితార్ఘ్య ఇత్యాది.

4. పఞ్చమీ బహువ్రీహిర్యథా :-

ఉద్ధృత ఓదనో యస్యాస్సా ఉద్ధృతౌదనా (స్థాలీ) ఏవం నిర్జనః (దేశః)

5. షష్ఠీ బహువ్రీహిర్యథా :-

పీతమమ్బరం యస్య సః పీతామ్బరః (హరిః)
శార్ఙ్గం ధనుర్యస్య శార్ఙ్గధన్వా.
కల్యాణో ధర్మో యస్య కల్యాణధర్మా.
దీర్ఘే సక్థినీ యస్య దీర్ఘసక్థః.
రక్తే అక్షిణీ యస్య రక్తాక్షః.
ద్వే అఙ్గులీ అస్య ద్వ్యఙ్గులమ్=(దారు) దారుభిన్నే ద్వ్యఙ్గులః (హస్తః)
ద్వౌ మూర్ధానౌ అస్య ద్విమూర్ధః.

ఏవం త్రిమూర్ధః.

6. సప్తమీ బహువ్రీహిర్యథా :—

వీరాః పురుషాః యస్మిన్ సః=వీరపురుషః=(గ్రామః)
ఏవం బహువిహగః=(తరుః) ఇత్యాది.

7. క్రియా విశేషణ బహువ్రీహిర్యథా :-

నిర్గతా శఙ్కా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా నిశ్శఙ్కమ్ (ఏవమగ్రేపి బోధ్యమ్)

2. బహుపద బహుౖవ్రీహిర్యథా :-
ౖప్రియాశ్చిౖత్రా గావో యస్య సః = ౖప్రియచిౖత్రగుః.
ఏవం—చిౖత్రజరద్గవీకః, శ్యామోజ్జ్వలవపుః ఇత్యాది.

3. వ్యధికరణ బహుౖవ్రీహిర్యథా :-
* కణ్ఠే కాలో యస్య సః = కణ్ఠే కాలః.
గడుః కణ్ఠే యస్య సః = గడుకణ్ఠః.
చౖక్రం పాణౌ యస్య సః = చౖక్రపాణిః

4. వికార బహుౖవ్రీహిర్యథా :-
సువర్ణవికారః ఆభరణం యస్య సః = సువర్ణాభరణః.
ఏవం రజతముౖద్ర ఇత్యాది.

5. సఙ్జాత బహుౖవ్రీహిర్యథా :-
కేశానాం సఙ్జాతశ్చూడా యస్య సః = కేశచూడః.

6. ఆఖ్యానబహుౖవ్రీహిర్యథా :-
ౖత్రి రావృత్తా దశ = ౖత్రిదశాః. ద్విశతమ్.

7. వికల్ప బహుౖవ్రీహిర్యథా :-
ద్వౌ వా ౖత్రయో వా = ద్విౖత్రాః.
పఞ్చ షడ్వా = పఞ్చషాః
ౖత్రయశ్చత్వారో వా = ౖత్రిచతురాః.

8 సామీప్య బహుౖవ్రీహిర్యథా :-
దశానాం సమీపే యే సన్తి తే = ఉపదశాః.
ఏవ మాసన్నవింశాః, అధికౖత్రింశాః. అదూరచత్వారింశాః.

---

* యౖత్ర త్వభిధానమస్తి తౖత్ర వైయధికరణ్యేపి బహుౖవ్రీహిః. స ౖత్రివిధః:- షష్ఠీపూర్వపదకోపమానవ్యధికరణద్విపద షష్ఠీ బహుౖవ్రీహిః, సప్తమీ పూర్వపదక వ్యధికరణ ద్విపద షష్ఠీ బహుౖవ్రీహిః, సప్తమ్యుత్తరపదక వ్యధికరణ ద్విపద షష్ఠీ బహుౖవ్రీహిరితి. తౖత్రాద్యోయథా :- మృగస్య అక్షిణీ యస్యాస్సా మృగాక్షీ = నారీ. ద్వితీయో యథా :- కణ్ఠే కాలో యస్య సః = కణ్ఠేకాలః. తృతీయో యథా :- దణ్డః పాణౌ యస్య సః = దణ్డపాణిః. ఏవం- పద్మనాభః, హిరణ్యగర్భః ఇత్యాది.

9. దిగన్తరాళ బహువ్రీహిర్యథా :-

దక్షిణస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశోర్యదన్తరాళం సా = దక్షిణపూర్వా.

10. వ్యతిహారలక్షణ బహువ్రీహిర్యథా :-

కేశేషు కేశేషు గృహీత్వేదం యుద్ధం ప్రవృత్తం = కేశాకేశి.

బాహుభిర్బాహుభిః ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తం = బాహూబాహవి.

ఏవం ముష్టీముష్టి, దణ్డాదణ్డి.

ద్వౌ దణ్డౌ యస్మిన్ప్రహరణే తత్ = ద్విదణ్డి. ద్వి ముసలి. అస్య సమాసస్యావ్యయత్వం బోధ్యమ్.

11. సమసమ్బన్ధ బహువ్రీహిర్యథా :-

పుత్రేణ సహ వర్తత ఇతి సపుత్రః. సహపుత్రః. ఏవం-సధనః, సవిద్యః, సకర్మకః, సలోమకః ఇత్యాది.

12. లుప్తమధ్యమపద బహువ్రీహిర్యథా :-

కరే స్థితం ధనం యస్య సః = కరధనః.

అన్తర్గతాని లోమాని యస్య సః = అన్తర్లోమః. ఏవం బహిర్లోమః.

13. ఉపమాన బహువ్రీహిర్యథా :-

చన్ద్ర ఇవ ముఖం యస్యాస్సా = చన్ద్రముఖీ. సూర్యస్య ప్రభేవ ప్రభా యస్య సః = సూర్యప్రభః.

పుణ్డరీకే ఇవ సున్దరే అక్షిణీ యస్య సః = పుణ్డరీకాక్షః.

14. క్రియాపూర్వపదో యథా :-

అస్తి క్షీరం యస్యాస్సా = అస్తిక్షీరా (గౌః)

15. నఞ్ బహువ్రీహిర్యథా :-

అవిద్యమానం ధనం యస్య సః = అధనః.

నాస్తి ప్రజా యస్య సః = అప్రజాః.

ఏవం-అమేధాః, అనఙ్గః.

16. ప్రాది బహువ్రీహిర్యథా :-

ప్రపతితం పర్ణం యస్మాత్సః ప్రపర్ణః. నిర్జనః. అవ్యయానాం వాచ్యః. ఉచ్చైర్ముఖః. ఉన్నతా నాసికా యస్య = ఉన్నసః. ప్రగతా నాసికా యస్య = ప్రణసః. విగతా నాసికా యస్య = విగ్రః, విఖ్యశ్చ.

ఏవం-దుష్ప్రజాః, సుప్రజాః, దుర్మేధాః. సుమేధాః, సజ్గతే జానునీ అస్య సఙ్జ్ఞః. ప్రగతే జానునీ అస్య ప్రజ్ఞుః-ఊర్ధ్వజ్ఞుః,ఊర్ధ్వజానుః*

పునస్స చ బహుప్రీహి ర్ద్వివిధః:- తద్గుణసంవిజ్ఞానోఽతద్గుణసంవిజ్ఞానశ్చేతి. తత్రాద్యః-రక్తాక్షః, పీతామ్బర లమ్బకర్ణాదయః.

ద్వితీయః-చిత్రగు, జితసేనాదయః.

ఇతిబహుప్రీహిః.

**అనువాదము :-**

## బహుప్రీహి సమాసము

బహుప్రీహి సమాసము ప్రాయికముగా అన్యపర్థదామును ప్రధానము గల్గిన దగును. విశేష్యమున కధీనమైనదిగ నుండును. అనగా—విశేష్యము ఏ లింగమునందును, ఏ విభక్తివచనములయందు నుండునో అందే యిది గూడ నుండవలయును.

ఈ బహుప్రీహి పదునాఱు తెఱంగులు కల్గియున్నది. అవెట్లనగా—

(1) ద్విపద బహుప్రీహి
(2) బహుపద బహుప్రీహి
(3) వ్యధికరణ బహుప్రీహి
(4) వికార బహుప్రీహి
(5) సఙ్ఖ్యాత బహుప్రీహి
(6) అభ్యాస బహుప్రీహి
(7) వికల్ప బహుప్రీహి
(8) సామాన్య బహుప్రీహి
(9) దిగన్తరాళ బహుప్రీహి
(10) వ్యతిహారలక్షణ బహుప్రీహి
(11) సమసంబంధ బహుప్రీహి
(12) లుప్తమధ్యమపద బహుప్రీహి
(13) ఉపమాన బహుప్రీహి

(14) క్రియా పూర్వపద బహుప్రీహి
(15) నఞ్ బహుప్రీహి
(16) ప్రాది బహుప్రీహి యని.

అందు మొదటిదైన ద్విపద బహుప్రీహి యేడు విధములు. అవెట్లనగా–

(1) ద్వితీయా బహుప్రీహి
(2) తృతీయా బహుప్రీహి
(3) చతుర్థీ బహుప్రీహి
(4) పఞ్చమీ బహుప్రీహి
(5) షష్ఠీ బహుప్రీహి
(6) సప్తమీ బహుప్రీహి
(7) క్రియా పూర్వపద బహుప్రీహి యని.

అందు–

1. ద్వితీయా బహుప్రీహి :–

ప్రాప్తానన్దః అనునెడ 'ప్రాప్తః ఆనన్దః యం,' అని విగ్రహము. ఇచ్చట 'యం' అని ద్వితీయా విభక్తి యుండుటవలన నిది ద్వితీయా బహుప్రీహి. ఇట్లే ప్రాపకామః ఆరూఢవానరః (వృక్షః) ఇత్యాది స్థలములలో విగ్రహములనరయునది.

2. తృతీయా బహుప్రీహి :-

*ఊఢరథః* అనునెడ 'ఊఢః రథః యేన' అని విగ్రహము. 'యేన' తృతీయావిభక్త్యంతము గాన నిది తృతీయా బహుప్రీహి (అనడ్వాన్ = ఎద్దు అని అర్థము). ఇది అన్యపదార్థము. ఇట్లే-కృతకృత్యః, ధృతవస్త్రః, జితసేనః మున్నగునవి యూహ్యములు.

3. చతుర్థీబహుప్రీహి :-

*ఉపహృతపశుః* అనునెడ 'ఉపహృతః పశుః యస్మై సః = ఉపహృత పశుః' (రుద్రః) ఇచ్చట రుద్రుడు అన్యపదార్థము. "యస్మై" చతుర్థీ విభక్త్యంతము గాన చతుర్థీ బహుప్రీహి.
ఇట్లే-అర్పితార్ఘ్యః మున్నగునవి యూహ్యములు.

4. పఞ్చమీ బహువ్రీహి :-

ఉద్ధృతౌదనా (స్థాలీ) అనునెడ 'ఉద్ధృతః ఓదనః యస్యాస్సా=ఉద్ధృతౌదనా' యని విగ్రహము. ఇచ్చట 'స్థాలి' యన్యపదార్థము. 'యస్యాః' అని పఞ్చమీ విభక్తి కాన ఇది పఞ్చమీ బహువ్రీహి. ఇట్లే-నిర్జనః (దేశః) మున్నగునవి యూహ్యములు,

3. షష్ఠీ బహువ్రీహి :-

పీతాంబరః (హరిః) అనునెడ 'పీతం అంబరం యస్య' అని విగ్రహము. ఇచ్చట 'హరి' అన్యపదార్థము. 'యస్య' షష్ఠ్యంతముగాన నిది షష్ఠీ బహువ్రీహి.

ఇట్లే—శార్ఙ్గధన్వా, కల్యాణధర్మా, దీర్ఘసక్థః, రక్తాక్షః, ద్వ్యఙ్గులమ్ మున్నగు సమాసము లూహ్యములు.

5. సప్తమీ బహువ్రీహి :-

వీరపురుషః (గ్రామః) అనునెడ 'వీరాః పురుషాః యస్మిన్' అని విగ్రహము. ఇచ్చట 'గ్రామము' అన్యపదార్థము "యస్మిన్" అని సప్తమ్యంతము గాన సప్తమీ బహువ్రీహి.

ఇట్లే—బహువిహగః (తరుః) ఇత్యాది సమాసము లరయునది.

1. క్రియా విశేషణ బహువ్రీహి:-

నిశ్శఙ్కమ్ అనునెడ 'నిర్గతా శఙ్కా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా నిశ్శఙ్కమ్' అని విగ్రహము.

ఈ నిశ్శఙ్క మనునది క్రియకు విశేషణము గాన నిది క్రియావిశేషణ బహువ్రీహి.

2. బహుపద బహువ్రీహి :-

ప్రియచిత్రగు అనునెడ 'ప్రియాః చిత్రాః గావః యస్య సః' అని విగ్రహము. ఇచ్చట ప్రియ-చిత్ర-గో శబ్దములు పెక్కులు సమసించుచున్నవి గాన నిది బహుపద బహువ్రీహి.

3. వ్యధికరణ బహువ్రీహి :-

కణ్ఠేకాలః అనునెడ 'కణ్ఠే కాలః యస్య' అని విగ్రహము. ఇచ్చట విగ్రహ వాక్యములో 'కణ్ఠే' యని సప్తమ్యంతము. 'కాలః' అని ప్రథమాంతము.

రెండును భిన్నవిభక్తులు కల్గియుండుట వలన వ్యధికరణములైనవి. అందువలన నిది వ్యధికరణ బహువ్రీహి.

ఇట్లే—గడుకణ్ఠః, చక్రపాణిః మున్నగునవి క్రమముగా—"గడు కణ్ఠే యస్య సః" "చక్రం పాణౌ యస్య సః" అని విభిన్న విభక్తులు కల్గియున్నవి గాన వ్యధికరణ బహువ్రీహులుగా గ్రహింపఁదగినవి.

**4.** వికార బహువ్రీహి :-

సువర్ణాభరణః అనునెడ సువర్ణవికారః ఆభరణం యస్య యని విగ్రహము. ఇట్లే 'రజతవికారః ముద్రా యస్య' యని "రజతముద్రః" అనుదానికి విగ్రహము. ఇచ్చట సువర్ణవికారః, రజతవికారః, అని వికారార్థక సువర్ణాది శబ్దములతో విగ్రహము చెప్పుటవలన నిది వికార బహువ్రీహి.

**5.** సఙ్ఘాత బహువ్రీహి:-

కేశచూడః అనునెడ 'కేశానాం సఙ్ఘాతః చూడా యస్య=కేశచూడః' యని విగ్రహము. ఇచ్చట సంఘాత శబ్దము విగ్రహ దశయందు కానవచ్చి సమాసదశయందు లోపించినది గాన నిది సంఘాత బహువ్రీహి.

**6.** అభ్యాస బహువ్రీహి :-

త్రిదశాః అనునెడ 'త్రిరావృత్తాః దశయేషాం తే = త్రిదశాః' అని విగ్రహము. ఇట్లే—'ద్విశతమ్' మున్నగునవి.
ఇచ్చట అభ్యాసమనగా ఆవృత్తి. ఆవృత్తి గల్గిన బహువ్రీహి యభ్యాస బహువ్రీహి యనఁబడును.

**7.** వికల్ప బహువ్రీహి :-

ద్విత్రాః అనునెడ 'ద్వౌ వా త్రయో వా' అని విగ్రహము.
పఞ్చషాః అనునెడ 'పఞ్చ, షడ్ వా పఞ్చషాః' అని విగ్రహము.
త్రిచతురాః అనునెడ త్రియశ్చత్వారో వా = త్రిచతురాః అనివిగ్రహము.

ఇచ్చట ద్విత్రాః ఇత్యాది స్థలములయందు "వా" కారముచేత వికల్పము తెలియుచున్నందువలన నిది వికల్ప బహువ్రీహి.

**8. సామాన్య బహువ్రీహి:—**

**ఉపదశాః** అనునెడ 'దశానాం సమీపే యే సంతి తే ఉపదశ' అని విగ్రహము.

ఇట్లే—ఆసన్నవింశాః, అధికత్రింశాః, అదూరచత్వారింశాః, మున్నగు వానికి విగ్రహములూహ్యములు. ఇచ్చట దశానాం సమీపే యని సామాన్యము సూచితము కాన నిది సామాన్య బహువ్రీహి,

**9. దిగన్తరాళ లక్షణ బహువ్రీహి :—**

**దక్షిణపూర్వా** యనునెడ 'దక్షిణస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశోః యదంతరాళం సా = దక్షిణపూర్వా.' ఇది దక్షిణ దిక్కుకు తూర్పుదిక్కునకును నంతరాళము ద్యోతితముగాన నిది దిగంతరాళబహువ్రీహి.

**10. వ్యతిహార లక్షణబహువ్రీహి :—**

**కేశాకేశి** అనునెడ 'కేశేష కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తం' అని విగ్రహము.

ఒకరి జుట్టు నొకరు పట్టుకొని యుద్ధము జరిగినదని భావము. ఇచ్చట ఒకరి జుట్టును ఒకరు పట్టుకొనుటయే వ్యతిహారము అది దీనికి లక్షణముగ నుండుట వలన వ్యతిహారలక్షణ బహువ్రీహి.

ఇట్లే—బాహాబాహవి, ముష్టీముష్టి మున్నగునవి యరయునది.

**ద్విదణ్డి** అనునెడ 'ద్వౌ దణ్డౌ యస్మిన్ ప్రహరణే' యని విగ్రహము. ఒక్క దెబ్బయందు రెండు కఱ్ఱలు వారని యర్థము.

ఇట్లే—ద్విముసలమ్ మున్నగునవి యూహ్యములు.

**11. సమసమ్బన్ధ బహువ్రీహి :—**

**సహపుత్రః** అనునెడ 'పుత్రేణ సహవర్తత ఇతి సహపుత్రః' అని విగ్రహము.

ఇచ్చట వర్తతే యను క్రియయందు పుత్రునికి తండ్రికిని సమానమైన సంబంధ ముండుటవలన నిది సమసమ్బన్ధ బహువ్రీహి యైనది.

ఇట్లే—సధవః మున్నగునవి యూహ్యములు.

**12. లుప్తమధ్యమ పదబహువ్రీహి :—**

**కరధనః** అనునెడ 'కరే స్థితం ధనం యస్య సః' అని విగ్రహము.

ఇచ్చటి 'ధనమ్' అనునది మధ్యమపదము. అది సమాస దశయందు లోపించినదిగాన లుప్తమధ్యమపద బహువ్రీహి

13. ఉపమాన బహువ్రీహి :—

చన్ద్రముఖీ అనునెడ 'చన్ద్ర ఇవ ముఖం యస్యాః' యని విగ్రహము.
ఇచ్చట చన్ద్రశబ్దముపమానముగాన నిది ఉపమాన బహువ్రీహి.
ఇట్లే—సూర్యప్రభః, పుణ్డరీకాక్షః మున్నగునవి యూహ్యములు.

14. క్రియాపూర్వపద బహువ్రీహి:—

అస్తిక్షీరా అనునెడ 'అస్తి క్షీరం యస్యాస్సా' అని విగ్రహము. ఇచ్చట సమాసమునకు పూర్వమున "అస్తి" యని క్రియా పదమున్నది గాన నిది క్రియా పూర్వ పద బహువ్రీహి.

15. నఞ్ బహువ్రీహి:—

అధనః అనునెడ అవిద్యమానం ధనం యస్య యని విగ్రహము.
ఇచ్చట "అ" యని నఞ్ సమాస ఘటకము గాన నిది నఞ్ బహువ్రీహి.
ఇట్లే—అప్రజాః, అమేధాః, అనజ్ఞః మున్నగునవి యూహ్యములు.

16. ప్రాదిబహువ్రీహి :—

ప్రపర్ణః అనునెడ ప్రపతితం పర్ణం యస్మాత్ అని విగ్రహము.
సమాసమున "ప్ర" యను నుపసర్గ యున్నది గాన నిది ప్రాదిబహువ్రీహి. అవ్యయములకు నిది చెప్పదగినది:-

ఉచ్చైర్ముఖః అనునెడ 'ఉచ్చైః ముఖం యస్య' అని విగ్రహము. ఇచ్చట "ఉచ్చైః" అనునది యవ్యయము.

ఉన్నసః అనునెడ 'ఉన్నతా నాసికా యస్య' యని విగ్రహము. ఆ నాసికా శబ్దమునకు నసాఽఽదేశమురాగా "ఉన్నసః" యని రూపము సిద్ధించినది.
ఇట్లే—

ప్రణసః అనునెడ 'ప్రగతా నాసికా యస్య' యని విగ్రహము. అందు నాసికా శబ్దమునకు పూర్వమువలె నసాదేశము నకారమునకు ణత్వము వచ్చి "ప్రణసః" అని రూపము సిద్ధించినది.

విగ్రః అనునెడ 'విగతా నాసికా యస్య' యని విగ్రహము. అందునాసికా శబ్దమునకు విగ్రాదేశమురాగా "విగ్రః" అని రూపము సిద్ధించినది.

విఖ్యః అనునెడ పై విధముగనే విగ్రహము. కాని నాసికా శబ్దమునకు ఖ్యాదేశము రాగా విఖ్యః అని రూపము సిద్ధించుచున్నది.

ఇట్లే—దుష్ప్రజాః, సుప్రజాః, దుర్మేధాః సుమేధాః అను 'దుర్' మున్నగు నుప సర్గలతో గూడిన బహువ్రీహి యూహ్యము.

దుష్ప్రజాః 'దుష్టాప్రజా యస్య' యని విగ్రహము.

సుప్రజాః 'శోభనా ప్రజా యస్య' అని విగ్రహము.

దుర్మేధాః 'దుష్టా మేధా యస్యసః = దుర్మేధాః.'

సుమేధాః 'శోభనా మేధా యస్య సః = సుమేధాః' అని విగ్రహము.

సఙ్జ్ఞుః అనునెడ 'సజ్గతే జానునీ యస్య' అని విగ్రహము. ఇచ్చట 'జాను' శబ్దమునకు "జ్ఞు" అని ఆదేశమురాగా సఙ్జ్ఞుః అని రూపము సిద్ధించినది.

మఱల బహువ్రీహి రెండు విధములు.

(1) తద్గుణ సంవిజ్ఞానము.
(2) అతద్గుణ సంవిజ్ఞానము.

తస్య గుణాః = విశేషణాని = తేషాం సంవిజ్ఞానం = క్రియాన్వయితయా విజ్ఞానం యత్ర యను వ్యుత్పత్తిననుసరించి, అన్య పదార్థమునకు సంబంధించిన విశేషణములను అనగా నందలి వస్తురూపములైనవానిని క్రియతో నన్వయింపఁ జేయు విజ్ఞాన మెందుగల్గునో అది తద్గుణ సంవిజ్ఞానబహువ్రీహి. దానికి భిన్నమైనది అతద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి.

అందు మొదటిది- రక్తాక్ష-పీతామ్బర-లంబకర్ణాదులు. రెండవది - చిత్రగుజిత సేనాదులు.

ఇట్లు బహువ్రీహిసమాసము.

**మూలమ్ :—**

అథ ద్వన్ద్వః

ప్రాయేణోభయ పదార్థప్రధానో ద్వన్ద్వః ఉత్తరపదలిజ్గశ్చ.
స ద్వివిధః.

(1) ఇతరేతరయోగ ద్వన్ద్వః
(2) సమాహారద్వన్ద్వ శ్చేతి

**ఇతరేతర యోగద్వన్ద్వో యథా :—**

రామశ్చ లక్ష్మణశ్చ = రామలక్ష్మణౌ.
రమా చ వాణీ చ = రమావాణ్యౌ,
సుఖఞ్చ దుఃఖఞ్చ మహత్త్వఞ్చ = సుఖదుఃఖమహత్త్వాని.
ఏవమ్-అర్థధర్మౌ, ధర్మార్థౌ. జాయా చ పతిశ్చ దమ్పతీ, జమ్పతీ, జాయాపతీ వా. హోతా పోతానేష్టోద్గాతారః, హోతృపోతృనేష్టోద్గాతారశ్చేత్యాది.

**సమాహారద్వన్ద్వోయథా :-**

పాణీ చ పాదౌ చ ఏషాం సమాహారః = పాణిపాదమ్.
భేర్యశ్చ పటహాశ్చ ఏషాం సమాహారః = భేరీపటహమ్.
హస్తినశ్చ అశ్వాశ్చ రథాశ్చ పాదాతాశ్చ ఏషాం సమాహారః = హస్త్యశ్వరథపాదాతమ్.
గజాశ్చ సింహాశ్చ ఏషాం సమాహారః = గజసింహమ్.
ఏవమ్ - గోవ్యాఘ్రమ్, అహినకులమ్, అశ్వమహిషమ్, శీతోష్ణమ్, శీతోష్ణే, ఇత్యాది.

ఇతి ద్వన్ద్వః

**అనువాదము :-**

## ద్వంద్వసమాసము

ద్వంద్వ సమాసము తఱచుగా ఉభయ పదార్థములను ప్రధానముగాఁ గల్గియుండును. అనగా — ద్వంద్వసమాసములో నెన్ని పదార్థములు సమసించునో, అవియన్నియు ప్రధానములని యర్థము.

అది రెండు విధములు.

(1) ఇతరేతరయోగద్వంద్వము
(2) సమాహారద్వంద్వము.

1. **ఇతరేతరయోగద్వంద్వము :-**

*1.* రామలక్ష్మణౌ అనునెడ రామశ్చ లక్ష్మణశ్చ అని విగ్రహము. ఇచ్చట సమాసమునందు రామలక్ష్మణు లిఱువురు ప్రధానము.

**2.** రమావాణ్యౌ అనునెడ 'రమా చ వాణీ చ రమావాణ్యౌ' అనివిగ్రహము ఇచ్చట రమ వాణియు నిద్దఱును ప్రధానము.

**3.** సుఖదుఃఖమహత్త్వాని : అనునెడ 'సుఖం చ దుఃఖంచ మహత్త్వంచ' అని ప్రవిగహము.

ఇచ్చట సమాసమునందు సుఖ-దుఃఖమహత్త్వములు మూడును ప్రధానములు. ఇట్లే—

అర్థధర్మౌ, ధర్మార్థౌ మున్నగునవి యూహ్యములు.

*దమ్పతీ* అనునెడ 'జాయాచ పతిశ్చ' యని విగ్రహము.

*జమ్పతీ* అనునెడఁగూడ 'జాయా చ పతిశ్చ'యనియే విగ్రహము.

*జాయాపతీ* అనునెడఁగూడ 'జాయా చ పతిశ్చ' యనియే విగ్రహము.

*హోతాపోతానేష్టోద్గాతారః* అనునెడ 'హోతా చ పోతా చ నేష్టా చ ఉద్గాతా చ' యని విగ్రహము. హోతృ పోతృనేష్టోద్గాతారః అనునెడఁగూడ పైవిధముగనే విగ్రహము.

**2. సమాహారద్వంద్వము :-**

*పాణిపాదమ్* అనునెడ 'పాణీచ పాదౌ చ ఏషాం సమాహారః' యని విగ్రహము.

*భేరీపటహమ్* అనునెడ 'భేర్యశ్చ పటహాశ్చ ఏషాం సమాహారః' యని విగ్రహము.

*హస్త్యశ్వరథపాదాతమ్* అనునెడ 'హస్తినశ్చ అశ్వాశ్చ రథాశ్చ పాదాతాశ్చ ఏషాం సమాహారః' యని విగ్రహము.

*గజసింహమ్* 'గజాశ్చ సింహాశ్చ ఏషాం సమాహారః' అని విగ్రహము.

ఇట్లే—గోవ్యాఘ్రమ్, అహినకులమ్, అశ్వమహిషమ్, శీతోష్ణమ్, శీతోష్ణే మున్నగునవి యూహ్యములు.

ఇట్లు ద్వంద్వము.

**మూలమ్ :-**

## అథాలుక్సమాసః

పునస్స చాయం సమాసో ద్వివిధః.

(1) లుక్సమాసః

(2) అలుక్సమాసశ్చేతి

నిరూపిత ఏవ లుక్సమాసః.

అలుక్సమాసష్షడ్విధః.

(1) ద్వితీయాలుక్సమాసః

(2) తృతీయాలుక్సమాసః

(3) చతుర్థ్యలుక్సమాసః

(4) పఞ్చమ్యలుక్సమాసః

(5) షష్ఠ్యలుక్సమాసః

(6) సప్తమ్యలుక్సమాసశ్చేతి.

అథ క్రమేణోదాహరణాని:-

పురం దధాతీతి = పురన్ధ్రీ

ఓజసా కృతమ్ = ఓజసాకృతమ్

ఆత్మనే పద్యత ఇతి = ఆత్మనేపదమ్.

స్తోకాన్ముక్తః = స్తోకాన్ముక్తః.

పశ్యతో హరతీతి = పశ్యతోహరః.

సరసి జాత మితి = సరసిజమ్.

యుధి స్థిరః = యుధిష్ఠిరః

కణ్ఠే కాలో యస్య సః = కణ్ఠేకాలః.

ఇత్యలుక్సమాసః

అనువాదము :-

## అలుక్సమాసము

మఱల సమాసము రెండు విధములు

(1) లుక్సమాసము.

(2) అలుక్సమాసము.

ఇంతవరకు లుక్సమాసము నిరూపింపఁబడినది. ఇక అలుక్సమాసము నిరూపింపఁబడుచున్నది.

అలుక్సమాసము ఆఱు విధములు:

(1) ద్వితీయాఽలుక్సమాసము

(2) తృతీయాఽలుక్సమాసము

(3) చతుర్థ్యలుక్సమాసము.
(4) పఞ్చమ్యలుక్సమాసము
(5) షష్ఠ్యలుక్సమాసము.
(6) సప్తమ్యలుక్సమాసము అని

క్రమముగా నుదాహరణములు:-

1) పురన్ధ్రి అనునెడ 'పురం దధాతీతి' యని విగ్రహము.
2) ఓజసాకృతమ్ అనునెడ 'ఓజసా కృతమ్' అని విగ్రహము.
3) ఆత్మనేపదమ్ అనునెడ 'ఆత్మనే పద్యత ఇతి' అని విగ్రహము.
4) స్తోకాన్ముక్తః అనునెడ 'స్తోకాత్ ముక్తః' అని విగ్రహము.
5) పశ్యతోహరః అనునెడ 'పశ్యతో హరతీతి' అని విగ్రహము.
6) సరసిజమ్ అనునెడ 'సరసిజాతమితి' అని విగ్రహము.
7) యుధిష్ఠిరః అనునెడ 'యుధి స్థిరః' అని విగ్రహము.

పురన్ధ్రి య నెడ "పురమ్" అను ద్వితీయా విభక్తి, ఓజసాకృతమ్ అనునెడ "ఓజసా" యను తృతీయా విభక్తి, ఆత్మనేపదమ్ అనునెడ "ఆత్మనే" యని చతుర్థీ విభక్తి, స్తోకాన్ముకః అనునెడ "స్తోకాత్" అని పఞ్చమీవిభక్తి, పశ్యతోహరః అనునెడ "పశ్యతః" అని షష్ఠీ విభక్తి సరసిజమ్ అనునెడ "సరసి" అని సప్తమీవిభక్తి, అట్లే యుధిష్ఠిరః అనునెడ "యుధి" యని సప్తమీ విభక్తి లోపించనందువలన నివి యలుక్సమాసములు.

అట్లే కణ్ఠేకాలః అనునెడ 'కణ్ఠే' యని సప్తమీవిభక్తి లోపించనందు వలన నిదియు నలుక్సమాసము.

ఇట్లు అలుక్సమాసము

**మూలమ్ :—**

## అథైకశేషవృత్తిః

**శిష్యమాణానేకపదార్థకైక పదవృత్తిః, ఏకశేషవృత్తిః. ద్వన్ద్వాపవాద ఏకశేషః. స ద్వివిధః.**

(1) సరూపైకశేషః
(2) **విరూపైకశేషశ్చేతి.**

సరూపైకశేషో యథా :—

రామశ్చ రామశ్చ = రామౌ.

రామశ్చ రామశ్చ రామశ్చ = రామాః.

విరూపైకశేషో ద్వివిధః.

(1) ఏకార్థ విరూపైక శేషః

(2) భిన్నార్థ విరూపైక శేషశ్చేతి.

ఏకార్థ విరూపైక శేషోయథా :-

వక్రదణ్డశ్చ కుటిలదణ్డశ్చ = వక్రదణ్డౌ కుటిలదణ్డౌ వా.

భిన్నార్థ విరూపైకశే షో యథా :-

వత్సస్య గోత్రాపత్యం పుమాన్ = వాత్స్యః.

వత్సస్య యువాపత్యం పుమాన్ = వాత్స్యాయనః.

వత్సశ్చ వాత్స్యాయనశ్చ = వాత్స్యౌ.

శివాచ్చ శివశ్చ = శివౌ.

స్వసా చ భ్రాతా చ = భ్రాతరౌ.

దుహితా చ పుత్రశ్చ = పుత్రౌ.

మాతా చ పితాచ = పితరౌ, మాతాపితరౌ వా.

శ్వశ్రూశ్చ శ్వశురశ్చ = శ్వశురౌ, శ్వశ్రూ శ్వశురౌవా.

స చ దేవదత్తశ్చ = తౌ.

స చ యశ్చ = యౌ, తౌ వా.

సా చ దేవదత్తశ్చ = తౌ.

తచ్చ దేవదత్తశ్చ = తే

ఇమేచ ఇమాశ్చ = ఇమాః (గావః). వీప్సాయామపి క్వచిద్ద్వన్ద్వః.

అహాని చ దివా చ = అహర్దివమ్. అహర్నిశమ్ ఇత్యాది.

ఇత్యేక శేష వృత్తిః.

**అనువాదము :—**

## ఏక శేష వృత్తి

అనేక పదార్థములతో సమాసను చేసినపుడు ఒక పదము శేషించినచో నది ఏకశేషవృత్తి. ఇది ద్వంద్వమునకు అపవాదము. ద్వంద్వమునందు ఎన్ని పదములతో సమాసము చేయుదుమో అవి యన్నియు మిగులును.

అది రెండు విధములు.

(1) సరూపైకశేషము.
(2) విరూపైకశేషము.

*అందు సరూపైకశేషము :-*

రామాః :- 'రామశ్చ రామశ్చ రామశ్చ' అని విగ్రహము. ఇచ్చట సమానరూపముగల పదములు మూడింటికిని సమాసముఁ జేయగా నొక్కటియే శేషించినది. కావున నిది సరూపములలో నేక శేషము.

విరూపైక శేషము రెండు విధములు.

(1) ఏకార్థ విరూపైకశేషము.
(2) భిన్నార్థ విరూపైక శేషము అని.

*అందు ఏకార్థ విరూపైకశేషము :-*

*వక్రదణ్డౌ కుటిలదణ్డౌ వా* అనునెడ 'వక్రదణ్డశ్చ కుటిలదణ్డశ్చ' యని విగ్రహము. వక్రశబ్ద కుటిల శబ్దములు ఏకార్థకములు. కాని భిన్నరూపములు, అందువలన ఏకార్థ విరూపకములు. వానికి సమాసము జేయగా వానిలో వక్రదణ్డ శబ్దముగాని కుటిలదణ్డ శబ్దముగాని శేషించును.

**2. భిన్నార్థ విరూపైకశేషము :-**

వాత్స్యౌ అనునెడ 'వాత్స్యశ్చ వాత్స్యాయనశ్చ' యని విగ్రహము. వాత్స్యశబ్దమునకు 'వత్సస్య గోత్రాపత్యం పుమాన్ వాత్స్యః' అని విగ్రహము. వత్సగోత్రమున జన్మించిన పురుషుడని యర్థము. వాత్స్యాయన శబ్దమునకు 'వత్సస్య యువాపత్యం పుమాన్' అని విగ్రహము. వత్సునికి యువకుఁడైన కుమారుడు. కావున వాత్స్య శబ్దమునకు వాత్స్యాయన శబ్దమునకు అర్థములు వేఱుగాన భిన్నార్థకములు. ఇవి భిన్నరూపములతో నుండుటవలన విరూపములు. కావున వానికి 'వత్సశ్చ, వాత్స్యాయనశ్చ వాత్స్యః యని విగ్రహము.

*శివౌ* అననెడ 'శివా చ శివశ్చ' అని విగ్రహము. ఇవి సరూపములు కావున సరూపైకశేషము.

*భ్రాతరౌ* అనునెడ 'స్వసా చ భ్రాతాచ' అని విగ్రహము. ఇచ్చటి పదములు విరూపములు గాన విరూపైకశేషము.

పుత్రౌ అనునెడ 'దుహితాశ్చ పుత్రశ్చ' అని విగ్రహము. ఇదియు విరూపైకశేషము.

పితరౌ అనునెడ 'మాతా చ పితా చ' యని విగ్రహము. ఇదియు విరూపైకశేషము.

మాతాపితరౌ అనునెడ 'మాతా చ పితా చ' యని విగ్రహము పైదాని వలెనే.

శ్వశురౌ అనునెడ 'శ్వశ్రూశ్చ శ్వశురశ్చ' అని విగ్రహము. ఇది సరూపైకశేషము.

శ్వశ్రూశ్వశురౌ అనునెడ పైదానివలెనే దీనికిని విగ్రహము.

తౌ అనునెడరెండవ వ్యక్తి దేవదత్తుఁడని వివక్షితమైనచో 'స చ దేవదత్తశ్చ' అని విగ్రహము.

యౌ అనునెడ 'స చ యశ్చ' అని విగ్రహము.

తౌ అనునెడ 'స చ యశ్చ' యనియు విగ్రహము.

తౌ అనునెడ దేవదత్తుఁడు వివక్షితుడైనచో 'సా చ దేవదత్తశ్చ'; అని విగ్రహము.

స్త్రీలింగ శబ్దముతో పుంలింగ శబ్దమునకు విగ్రహము చెప్పినను పుంలింగ రూపమే శేషించును. గాన—ఇచ్చట తౌ అను రూపము సిద్ధించినది.

తే అనునెడ 'తచ్చ దేవదత్తశ్చ' అని విగ్రహము.

నపుంసకలింగ శబ్దముతో పుంలింగ శబ్దమునకు విగ్రహము చెప్పినచో నపుంసక లింగము మాత్రమే శేషించును. కావున తే యనునది నపుంసకలింగ తచ్ఛబ్దమునకు ద్వివచనము.

ఇమాః అనునెడ ఇమే చ (పుం) ఇమాశ్చ (స్త్రీ) అని విగ్రహము.

ఇచ్చట స్త్రీ లింగములోని ఇదం శబ్ద ద్వివచనమునకు స్త్రీలింగములోని ఇదం శబ్ద బహువచనముతో సమాసము చెప్పినందువలన స్త్రీలింగ బహువచనమే శేషించినది. ఇందు విశేష్యము గోవులు.

వీప్సయందుఁగూడ అనగా—ఒకదానిని రెండుమాఱులు చెప్పినప్పుడు కూడ నొకచోట ద్వంద్వము వచ్చునున్నది.

ఇట్లు ఏకశేషవృత్తి నిరూపితము.

**మూలమ్ :-**

## అథ తద్ధిత వృత్తిః

ప్రాతిపదికాధికారోక్త ప్రత్యయాన్త ప్రాతిపదిక వృత్తిస్తద్ధిత వృత్తిః.

తత్రాపత్యార్థక తద్ధితో యథా :-

రఘో రపత్యం పుమాన్ రాఘవః.
దశరథస్యాపత్యం పుమాన్దాశరథిః.
దితే రపత్యం పుమాన్ దైత్యః.
వ్యాసస్యాపత్యంపుమా న్వైయాసకిః.
కన్యాయాః అపత్యం పుమాన్ కానీనః.
వినతాయాః అపత్యం పుమాన్ వైనతేయః.
పితృష్వసురపత్యం పుమాన్ పైతృష్వసేయః; పైతృష్వస్రీయశ్చ.
రాజ్ఞోఽపత్యం పుమా న్రాజన్యః.
క్షత్రస్యాపత్యం పుమాన్ క్షత్రియః.
కులస్యాపత్యం పుమాన్ కులీనః.
కురోః* రపత్యం పుమాన్ రాజా చ కౌరవ్యః.

---

* శ్లో॥ రూఢ్యాదేశస్య రాజ్ఞశ్చ కస్యచిద్వాచకా ఇమే।
అఙ్గవఙ్గాదయో ద్వ్యచ్కాః కోసలాద్యాస్తు కీర్తితాః ॥౧॥
తస్య రాజన్యపత్యేఽపి సుజనో దృశ్యతే భిదా।
తథా విధానాం శబ్దానాం రూపభేదోఽత్ర కథ్యతే ॥౨॥
అఙ్గస్య రాజా చాఙ్గస్స్యా దఙ్గాపత్యం పుమానపి.
రాజానోఽఙ్గాస్త్వపత్యాని పుమాంసశ్చైవ మూహ్యతామ్ ॥౩॥
అఙ్గ ఆఙ్గౌ జనిత్వఙ్గా బహుత్వే ప్రత్యయస్య లుక్
రాజాపత్యవివక్షాయాం న స్త్రియాం త్వేష నిర్ణయః ॥౪॥
వాఙ్గో వాఙ్గౌ వఙ్గాః సైంహః సైంహౌ స్మృతాః సింహాః।
కౌరవ్యశ్చ కౌరవ్యౌ కురవస్స్యుశ్చైవ మన్యేఽపి ॥౫॥
మాత్స్యో మత్స్యా ఏవం పౌరవ్యశ్చ పూరవో ద్వ్యచ్కాః।
చైద్యశ్చేదయ ఏవం పాణ్డ్యాస్తే పాణ్డవశ్చ ప్రోక్తాః ॥౬॥
తస్యాయమితి వివక్షాయామపి తే పాణ్డవో జ్ఞేయాః।
పాఞ్చాలః పఞ్చాలాశ్చ కాలిఙ్గాస్తే కలిఙ్గాశ్చ ॥౭॥
ఆమ్బష్ఠ్యశ్చామ్బష్ఠాః సౌవీర్యాస్తే తు సౌవీరాః।

ఏవమ్-ఇక్ష్వాకో రపత్యం పుమాన్ రాజా ఐక్ష్వాకః.

రోహిణ్యా అపత్యం పుమాన్ రౌహిణేయః.

ఉపగోరపత్యం పుమా నౌపగవః.

కులటాయాః అపత్యం కౌలటినేయః; కౌలటేయః.

గర్గస్య గోత్రాపత్యం పుమా న్గార్గ్యః;** అపత్యాని పుమాంసః గర్గాః.

ఏవం-వత్సా ఇత్యాది.

గర్గస్య యువాపత్యం పుమాన్ గార్గ్యాయణ ఇత్యాది.

అథ రక్తార్థకః :-

కషాయేణ రక్తం కాషాయం వస్త్రమ్.

నీల్యా రక్తం నీలమ్.

---

నైషధ్యో నిషధా స్తే సౌంమహో జనితు సూరమసాః ॥౮॥
అజాద్యశ్చాజాదాశ్చ కౌసల్యశ్చకోసలా అపి చ।
మాగధ ఏతే మగధాశ్చావన్త్యశ్చావ న్తయశ్చామీ ॥౯॥
ప్రాత్యగ్రథి రేకత్వే తే తు ప్రత్యగ్రథా జ్ఞేయాః ।
సాల్వకాలకూటి రేకశ్చ కలకూటా ఏవమన్యేపి ॥౧౦॥

** శ్లో॥ అథగోత్రమపత్యన్తు పౌత్రప్రభృతి కథ్యతే.
గర్గస్య గోత్రాపత్యమ్పుమాన్గార్గ్య ఇతి ఉచ్యతే ॥౧॥
తే గర్గా బార్హ ఉర్వాశ్చ వాత్స్య వత్సాశ్చ తే స్మృతాః ।
బైదో బిదాశ్చ వాతణ్డ్యో వతణ్డా ఏవ మూహ్యతామ్ ॥౨॥
కౌణ్డ్యాయన్యశ్చ తే కుణ్డ్యాయనా స్తద్గణనా అపి ।
సాయనై ఙత్రేయో మిత్రయవా ఆత్రేయశ్చాత్రయ స్తథా ॥౩॥
భార్గవో భృగవ స్తద్వత్కౌత్సః కుత్సాః ప్రకీర్తితాః ।
ఆఙ్గిరసశ్చాఙ్గిరసో గౌతమో గోతమా అపి ॥౪॥
అగస్త్యగ స్తయశ్చైవ కౌణ్డిన్యశ్చ కుణ్డినా స్తథా ।
అర్జునిశ్చార్జునా యాధిష్ఠిరశ్చైవ యుధిష్ఠిరాః ॥౫॥
విశేషవిధినాలో మ్నో బహ్వపత్యే త్వకారవత్ ।
అపత్య ముడులో మ్నస్స్యా దౌడులోమి స్తుతే పునః ॥౬॥
ఉడులోమా బహుత్వే స్యు రేవం కేచిద్విశేషగాః ।
యథా:- ఔడులోమిః - ఔడులోమీ - ఉడులోమాః.
హే ఔడులోమే-హే ఔడులోమీ-హే ఉడులోమాః.
ఔడులోమిమ్-ఔడులోమీ-ఉడులోమాన్, ఏవంరీత్యా రూపాణి బోధ్యాని.

యుక్తార్థక తద్ధితో యథా:-

పుష్యేణ యుక్తం పౌషమహః.

పుష్యేణ యుక్తా రాత్రిః పౌషీ.

దృష్టార్థక తద్ధితో యథా :-

వశిష్ఠేన దృష్టం వాశిష్ఠం సామ.

ఉశనసా దృష్టం సామ ఔశనమ్, ఔశనసమ్.

పరివృతార్థకః :-

వస్త్రైః పరివృతో వాస్త్రో రథః.

శరావే ఉద్ధృతః శారావః ఓదనః.

శయిత్రర్థకః :-

స్థణ్డిలే శేతే స్థాణ్డిలో భిక్షుః.

సంస్కృతార్థకః :-

దధ్ని సంస్కృతం దాధికమ్.

ఉదశ్వితి సంస్కృత ఔదశ్విత్కః.

క్షీరే సంస్కృతా క్షైరేయీ.

అధికరణార్థకః :-

పౌషీ పౌర్ణమాసీ అస్మిన్వర్తత ఇతి పౌషో మాసః.

ఫాల్గునీ పౌర్ణమాసీ అస్మిన్నితి ఫాల్గునికః, ఫాల్గునో మాసః.

ఏవం-శ్రావణికః, శ్రావణః. కార్తికికః, కార్తికః. చైత్రికః, చైత్రః.

దేవతార్థకః :—

ఇన్ద్రో దేవతాఽస్యేతి ఐన్ద్రమ్ (హవిః)

భ్రాత్రర్థకః :-

పితుర్భ్రాతా పితృవ్యః

మాతుర్భ్రాతా మాతులః.

పితుః పితా పితామహః

మాతుః పితా మాతామహః.

సమూహార్థకః :-

శుకానాం సమూహః శౌకకమ్

గర్భిణీనాం సమూహః గార్భిణమ్.

యువతీనాం సమూహః యౌవతమ్, యౌవనఞ్చ.

జనానాం సమూహో జనతా.

ఏవం-గ్రామతా. బన్ధుతా. గజతా. సహాయతా. రాజన్యకమ్. వార్ధకమ్.

బ్రాహ్మణానాం సమూహః బ్రాహ్మణ్యమ్ ఇత్యాది.

అధ్యేతృవేదితృత్యర్థకః :-

వ్యాకరణ మధీతే వేత్తివా = వైయ్యాకరణః.

ఏవం–నైయాయికః, పౌరాణికః ఇత్యాది.

సాధ్వర్థకః :-

శరణే సాధుః శరణ్యః.

శైషికార్థో యథా :

చక్షుషా గృహ్యతే చాక్షుషం (రూపమ్). శ్రావణ శ్శబ్దః.

అశ్వై రుహ్యతే ఆశ్వో రథః.

గ్రీవాయాః అలఙ్కారః గ్రైవేయకః.

దివి భవం దివ్యమ్

ప్రాచ్యమ్.

అమా (సహ) తిష్ఠతీతి అమాత్యః.

ఏవం-క్వత్యః, ఇహత్యః, తత స్త్యః, తత్రత్యః, నిత్యః.

తస్యాయంతదీయః.

భవతశ్ఛాత్రః భావత్కః.

భవదీయః, భావతః.

అరణ్యే భవః ఆరణ్యకః.

పరస్యేదం పరకీయమ్.

జనకీయమ్, రాజకీయమ్, స్వకీయమిత్యాది. యువయో ర్యుష్మాకం వా

అయం యుష్మదీయః.

అస్మదీయః-యౌష్మాకీణః-ఆస్మాకీనః-యౌష్మాకః-ఆస్మాకః.

తవ మమ వా అయం తావకీనః.

తావకః – మామకీనః – మామకః.

త్వదీయః — మదీయః.

మాసే భవం మాసికమ్-సాంవత్సరికమ్.

ప్రావృషి భవః ప్రావృషేణ్యః.

వర్షాసు సాధు వార్షికమ్.

పథి జాతః పన్థకః. సైన్ధవః

కోశే సమ్భూతం కౌశేయమ్.

మాసే దేయమృణం మాసికమ్.

వనే భవః వన్యః.

దిశి భవం దిశ్యమ్. గాంభీర్యమ్.

అధ్యాత్మభవమ్ ఆధ్యాత్మికమ్.

ఆధిదైవికమ్ ఆధిభౌతికమ్.

ఐహలౌకికమ్—పారలౌకికమ్.

తీర్థాదాగతస్త్రైర్థికః. పిత్ర్యమ్-పైతృకమ్. మక్షికాభిః కృతం మాక్షికమ్ (మధు)

అధికృత్య కృతగ్రన్థార్థకః.

శకున్తలామధికృత్య కృతో గ్రన్థః శాకున్తలః.

ప్రోక్తార్థకః :-

పాణినినా ప్రోక్త ముపజ్ఞాతం వా పాణినీయమ్.

సమ్బన్ధసామాన్యార్థకః :-

దశరథస్యాయ న్దాశరథః.

పృథాయా అయ మ్పార్థః.

ఉపగో రిదమ్ ఔపగవమ్

వికారార్థకః :-

మయూరస్య వికారోఽవయవో వా

మాయూరః, మయూరమయశ్చ.

గోః పురీషం గోమయమ్.

గోర్వికారః గవ్యమ్

పయసో వికారః పయస్యమ్

జతునో వికారః జాతుషమ్.

ఏవం—త్రాపుషమ్.

సోఽస్యేత్యర్థకః :

భరతా యోద్ధారోఽస్య సఙ్గ్రామస్య భారతః.

పఙ్క్తిరావి రస్యేతి పాఙ్క్తః ప్రగాథః.

పృచ్ఛత్యర్థకః :—

సుస్నాతం పృచ్ఛతి సౌస్నాతికః.

తరణార్థకః :—

నా వా తరతి నావికః.

చరత్యర్థకః :-

రథేన చరతి రథికః.

జీవత్యర్థకః :-

ధనుషా జీవతి ధానుష్కః.

రక్షత్యర్థకః :-

సమాజం రక్షతి సామాజికః.

నిర్వృత్తార్థకః :-

అక్షద్యూతేన నిర్వృత్త మాక్షద్యూతికమ్ వైరమ్.
కృత్యా నిర్వృత్తం కృత్రిమమ్.
పక్త్యా నిర్వృత్తం పక్త్రిమమ్.
పాకేన నిర్వృత్తం పాకిమమ్.
త్యాగిమమ్.
యాచితేన నిర్వృత్తం యాచితకమ్.
అపమిత్య నిర్వృత్తమాపమిత్యకమ్.

శబ్దకర్త్రర్థకః :-

శబ్దం కరోతి శాబ్దికః.

ధర్మంచరతీత్యర్థకః :-

ధర్మం చరతీతి ధార్మికః.
అధర్మం చరతి ఆధర్మికః.

ప్రహరణార్థకః :—

ధనుః ప్రహరణమస్య ధానుష్కః.
ఏవ మాసికః, పారశ్వధికః, శాక్తీకః, యాష్టీకః.

అస్తీత్యాద్యర్థకః :-

అస్తి పరలోక ఇత్యేవం మతిర్యస్య స ఆస్తికః
నాస్తి పరలోక ఇత్యేవం మతిర్యస్య స నాస్తికః.
దిష్టమితి మతి ర్యస్య స దైష్టికః.

శీలమిత్యర్థకః :-

అపూపభక్షణం శీలమస్య ఆపూపికః. కర్మశీలః కార్మః ఇత్యాది.

నిర్మితాద్యర్థకః :-

ఉరసా నిర్మిత ఔరసః పుత్రః.

గవే హితం గవ్యమ్.

ఆత్మనే హితం ఆత్మనీనమ్.

ఏవం — విశ్వజనీనమ్. రాజభోగీనః. సర్వస్మై హితం సార్వమ్.

సర్వీయ మిత్యాది.

తద్వహత్యాద్యర్థకః :-

రథం వహతి రథ్యః

యుగం వహతి యుగ్యః.

ధురం వహతి ధుర్యః, ధౌరేయః, ధురీణశ్చ.

శకటం వహతి శాకటః.

నావా తార్యం నావ్యమ్.

విషేణ వధ్యః విష్యః.

తులయా సమ్మితం తుల్యమ్.

ధర్మాదనపేతం ధర్మ్యమ్.

ఏవం-పథ్యం, అర్థ్యం, న్యాయ్యమిత్యాది.

తస్యేశ్వర స్తత్రవిదిత ఇత్యర్థకః :-

సర్వ భూమే రీశ్వరస్సార్వభౌమః.

సర్వ భూమౌ విదిత స్సార్వభౌమః.

క్రీతార్థకః :-

నిష్కేణ క్రీతం నైష్కికమ్.

శతేన క్రీతం శతికమ్, శత్యమ్.

ద్విశతేన క్రీతం ద్విశతమ్

పఞ్చభిః క్రీతః పఞ్చకః

అర్హార్థకః :

దణ్డమర్హతి దణ్డ్యః, అర్ఘ్యః, వధ్యః.

తేన తుల్య మిత్యర్థకః :-

బ్రాహ్మణేన తుల్యం బ్రాహ్మణవత్ (అధీతే).

తత్ర తస్యే వేత్యర్థకః :-

మధురా యా మివ మధురావత్ (స్రుఘ్నే ప్రాకారః)

చైత్రస్యేవ చైత్రవత్.

తస్య భావ ఇత్యర్థక తద్ధితో యథా :-

గోర్భావః గోత్వమ్, గోతా.

దృఢస్య భావః దార్ఢ్యమ్, ద్రఢిమా.

బ్రాహ్మణస్య భావః బ్రాహ్మణమ్.

గురోర్భావః గౌరవమ్, గురుత్వమ్ గరిమా.

రాజ్ఞో భావః కర్మ వా రాజ్యమ్

శ్రోత్రియస్య భావః శ్రౌత్రమ్.

అర్హతో భావః అర్హన్తీ

అయథా తథా భావః ఆయథాతథ్యమ్, అయాథాతథ్యమ్.

పౌరోహిత్యమ్, దూత్యమ్, సఖ్యమ్ శౌచమ్, కౌశల్యమ్ ఇత్యాది.

తదస్య సఞ్జాత మిత్యర్థకః :-

తారకా స్సఞ్జాతా అస్య తారకితమ్ నభః.

రోమాఞ్చిత మఙ్గమ్.

తదస్య ప్రమాణ మిత్యర్థకః :-

ఊరూ ప్రమాణ మస్య ఊరుద్వయ సమ్. ఊరుదఘ్నమ్, ఊరు మాత్రమ్.

పరిమాణార్థకః :-

యత్పరిమాణమస్య యావాన్, ఏవం-తావాన్, ఎతావాన్ కియాన్ ఇయాన్.

సఙ్ఖ్యాయాన్తు కతి, కియన్తః,

అవయవార్థకః :-

పఞ్చ అవయవా అస్య పఞ్చతయమ్.

ఏవం – ద్వితయం, ద్వయ మిత్యాది.

పూరణార్థకః :-

పఞ్చానాం పూరణః పఞ్చమః.

ఏవం – షష్ఠః, ద్వితీయః, వింశతి తమ ఇత్యాది.

తదస్యాస్త్యస్మిన్నిత్యర్థకః :-

లక్ష్మీరస్యాస్మిన్వా_స్తీతి లక్ష్మీవాన్ గోమాన్, దణ్డవాన్, దణ్డీ.
ఏవం - యశస్వీ, యశస్వాన్. కేశీ, కేశవాన్, కేశికః, కేశవః.
తున్దిలః. వత్సలః. వాగ్మీ. హృదయాళుః, హృదయవాన్, హృదయీ,
హృదయికః. ఉష్ణం న సహతే = ఉష్ణాళుః. ఏవం-శీతాళుః. కృపాళుః.
బలూలః. వాతూలః అర్శాంసి అస్య విద్యన్తే అర్శసః. అహంయు
రిత్యాది.

అతిశయార్థకః :-

అయ మనయోరతిశయేన లఘుః = లఘుతరః, లఘీయాన్.
అయమేషా మతిశయేన లఘుః = లఘుతమః, లఘిష్ఠః.
అతిశయేన విజయతే విజయతేతరామ్, విజయతేతమామ్.
అతిశయేన ప్రశస్యః శ్రేయాన్, జ్యేష్ఠః, జ్యాయాంశ్చ.
అతిశయే నా_న్తికం నేదిష్ఠః, నేదీయాన్.
అతిశయేన స్థూలః స్థవిష్ఠః, స్థవీయాన్.
అతిశయేన గురుః గరిష్ఠః, గరీయాన్.
అతిశయేన ప్రియః ప్రేష్ఠః, ప్రేయాన్.

ప్రశంసార్థకః :-

ప్రశస్తః పటుః పటురూపః.
ప్రశస్తం పచతి పచతిరూపమ్.
ప్రశస్తా మృత్ మృత్స్నా, మృత్సా.

ఈషదసమాప్తావిత్యర్థకః :-

ఈషదూనో విద్వాన్ = విద్వత్కల్పః, విద్వద్దేశ్యః, విద్వద్దేశీయః.
ఈషదూనః పటుః, బహుపటుః, పటుకల్పః, పటుప్రకారః, పటు
జాతీయః.

అజ్ఞాతార్థకః :-

కస్యాయ మశ్వోఽశ్వకః,

శీలార్థకః :-

తూష్ణీం శీలః తూష్ణీకః.

అనుకమ్పాద్యర్థకః :-

అనుకమ్పితః పుత్రః = పుత్రకః.

కుత్సితోఽశ్వోఽశ్వకః. అశ్వ ఇవ ప్రతికృతిః అశ్వకః;

ఏవమ్ - వ్యాఘ్రకః, తైలకః స్థూలకః, అణుక ఇత్యాది.

క్రియాభ్యావృత్త్యర్థకః :-

పఞ్చవారాన్ కురుతే = పఞ్చకృత్వః. బహుకృత్వ ఇత్యాది.

తత్ప్రకృత వచనార్థకః :-

ప్రాచుర్యేణ ప్రస్తుత మన్న మన్నమయమ్. ఏవ మపూపమయమ్.

తాదర్థ్యార్థకః :-

పితృదేవతాయై పితృదేవత్యమ్.

పాదార్థముదకం పాద్యమ్.

ఏవ మర్ఘ్యమ్, ఆతిథ్యమిత్యాది.

స్వార్థకః :-

ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః.

మృదేవ మృత్తికా.

అభూతతద్భావార్థకః :-

అకృష్ణః కృష్ణస్సమ్పద్యతే తఙ్కరోతి కృష్ణీకరోతి. శుచీభవతి. శ్రేణీ స్యాత్.

బహ్వాల్పార్థకః :-

బహూని దదాతి బహుశః, అల్పశః.

పరివాపణార్థకః :-

ముణ్డనేన సంస్కరోతి మద్రాకరోతి. ఏవం భద్రాకరోతీత్యాదయో బోధ్యాః ॥

ఇతి తద్ధితవృత్తి సఙ్గ్రహః

## అథ కృద్వృత్తిః

తత్ర ధాత్వధికారోక్తప్రత్యయాన్త ప్రాతిపదిక వృత్తిః కృద్వృత్తిః. ధాతోరేవ కర్తరి కర్మణి భావాదౌ చ కృత్ప్రత్యయా భవన్తి; తత్ర సకర్మకేభ్యో ధాతుభ్యః కర్మణి కర్తరి చ. అకర్మకేభ్యో ధాతుభ్యో భావే కర్తరి చేతి జ్ఞేయమ్.

కృద్వృత్తి ర్ద్వివిధా- కారక కృద్వృత్తిః, భావకృద్వృత్తిశ్చేతి.
తత్ర కారక కృద్వృత్తిష్షడ్విధా.

శ్లో॥ కర్తా చ కర్మ కరణం సమ్ప్రదానం తథైవచ,
అపాదానాధికరణే ఇతి షట్కారకాణి వై॥

తత్ర - కర్తృ కారక కృద్వృత్తి ర్యథా :-

కరోతీతి కర్తా-కుమ్భం కరోతీతి కుమ్భకారః.
వసతీతి వాస్తవ్యః.
నర్తయతీతి నర్తకః.
ప్రతిష్ఠత ఇతి ప్రతిష్ఠః=గౌః.
ఆత్మానం బిభర్తీతి ఆత్మమ్భరిః.
అనాఢ్య ఆఢ్యో భవతీతి ఆఢ్యమ్భవిష్ణుః.
శ్రయతీతి శితః, శ్రితవాన్.
పచతీతి పచన్, పచమానః.
స్పృహయతీతి స్పృహయాళుః.
ఏవం-దయాళుః, శయాళుః.
కర్తు మిచ్ఛతీతి చికీర్షుః.
వేత్తీతి విద్వాన్.
శాస్త్రం కరోతీతి శాస్త్రకృదిత్యాది.

కర్మకారక కృద్వృత్తిర్యథా :-

రక్ష్యత ఇతి రక్షణీయః, రక్షితవ్యః.
రక్ష్యః త్వయా మయా వా.
ఏవం-పచనీయః, పక్తవ్యః, పాక్యః
త్రాయత ఇతి త్రాతః, త్రాణః.
క్షేతుం శక్యం క్షయ్యమ్.
జేతుం శక్యం జయ్యమ్.
దుఃఖేనాపి గన్తు మశక్యః దుర్గః.
సుఖేన లభ్యత ఇతి సులభమ్ ఇత్యాది.

కరణ కారక కృద్వృత్తిర్యథా :-

స్నాన్త్యనేనేతి స్నానీయమ్=చూర్ణమ్.

వహ న్త్యనేనేతి వహ్యమ్ = శకటమ్.

సఞ్చర న్త్యనేన సఞ్చరః = మార్గః.

అపమృజ్య న్తేఽనేనవ్యాధ్యాదయ ఇత్యపామార్గః.

ఆనీయన్తే మత్స్యాదయోఽనేనేత్యానాయః.

స్తమ్బోఽనేన హన్యత ఇతి స్తమ్బఘ్నః, స్తమ్బఘనః.

సమ్ప్రదాన కారక కృద్వృత్తిర్యథా :-

దీయతే అస్మై దానీయః (విప్రః)

గాం హన్తి తస్మై గోఘ్నః (అతిథిః)

అపాదానకారక కృద్వృత్తిర్యథాః-

బిభేత్య స్మాదితి భీమః భీష్మః,

భయానకః-వహ ఇత్యాది.

అధికరణ కారక కృద్వృత్తిర్యథాః-

జలాని దీయన్తేఽస్మిన్నితి జలధిః.

అధీయన్తేఽస్మిన్ని త్యధ్యాయః.

గౌర్దుహ్యతేఽస్యామితి గోదోహనీ స్థాలీ.

గావశ్చర న్త్య స్మిన్నితి గోచరః.

అథ భావకృద్వృత్తౌ కతిచిదుదాహ్రియన్తే:-

భూయత ఇతి భవ్యం, భవనీయం,

భవితవ్యం, భవనం, భూతిః, భావః.

బ్రహ్మణో భావో బ్రహ్మభూయమ్.

నన్దనం నన్దథుః.-స్నాతం మయా.

స్తుతిః-శ్రుతిః-అన్వేషణా.

శయనం, శాయికా.

దుష్కరః సుకరః భోజనాయ భోక్తుమ్.

ఏవం-త్యక్తుం గన్తుం యాతుమ్.

భోజనోత్తరం భుక్త్వా, త్యక్త్వా, గత్వా.

పిధాయ, ఆగత్య-విచార్య.

శయ్యాయా ఉత్థాయ శయ్యోత్థాయమ్.

అనుపదం స్మృత్వా=స్మారం స్మారమ్.

శ్రావం శ్రావమ్.
స్వాదుం కృత్వా స్వాదుఙ్కారమ్.
ముష్టిం గృహీత్వా ముష్టిగ్రాహమ్.
ముఖతో భూత్వా ముఖతోభావమ్.
నానా భూత్వా నానాభూయ నానాభావమ్.
తూష్ణీం శబ్దే ఉపపదేప్యేవమ్.

**ఇతి కృద్వృత్తి సంగ్రహః**

## అథ సనాద్యన్త ధాతువృత్తిః

సనాది ప్రత్యయాన్త ధాతువృత్తిః సనాద్యన్త ధాతువృత్తిః.
సా ద్వాదశధా.

శ్లో॥ సన్క్యచ్కామ్యచ్క్యఙ్క్యషోథాచారక్విబ్ణిజ్యఙౌ తథా.
యగాయ ఈయఙ్ణిశ్చేతి ద్వాదశామీ సనాదయః ॥

తత్ర.- సన్వృత్తిః :-
పఠితు మిచ్ఛతి పిపఠిషతి.
భవితు మిచ్ఛతి బుభూషతి.
కర్తు మిచ్ఛతి చికీర్షతి.
అత్తు మిచ్ఛతి జిఘత్సతి.
ఏవం—దాతుం దిత్సతి, దిత్సతే.
గ్రహీతుం జిఘృక్షతి.
గన్తుం జిగమిషతి.
ఆప్తుం ఈప్సతి.
హాతుం జిహాసతి.
రన్తుం రిరంసతే.
శ్రోతుం శుశ్రూషతే.
పతితుం పిపతిషతి.
స్వార్థే తు -కిత్-చికిత్సతి.
గుప్—జుగుప్సతే.
తిజ్—తితిక్షతే.

క్యజ్వృత్తిః :-

పుత్ర మాత్మన ఇచ్ఛతి పుత్రీయతి.

రాజాన మాత్మన ఇచ్ఛతి రాజీయతి.

గిర మాత్మన ఇచ్ఛతి గిర్యతి.

ఏవం—పూర్యతి.

ఆచారార్థేపి :—ప్రాసాదే ఇవాచరతి

ప్రాసాదీయతి (కుట్యాం భిక్షుః)

కుట్యామివాచరతి సౌధే కుటీయతి.

కామ్యజ్వృత్తిః:—

పుత్ర మాత్మన ఇచ్ఛతి పుత్రకామ్యతి.

యశ ఆత్మన ఇచ్ఛతి యశస్కామ్యతి.

ఏవం—సర్పిష్కామ్యతీత్యాది.

క్యఙ్ వృత్తిః :-

కృష్ణ ఇవాచరతి కృష్ణాయతే.

కష్టాయ క్రమతే కష్టాయతే. తపశ్చరతి తపస్యతి.

సుఖం వేదయతే సుఖాయతే. విద్వానివాచరతి విద్వాయతే, విద్వస్యతే.

కుమారీవాచరతి కుమారాయతే.

హరిణీ వాచరతి హారితాయతే.

అప్సరాయత ఇత్యాది.

క్యష్ వృత్తిః :-

అలోహితః లోహిత ఇవాచరతి లోహితాయతి, లోహితాయతే.

పటపటాయతి పటపటాయతే.

ఆచారక్విబ్ వృత్తిః :-

కృష్ణ ఇవాచరతి కృష్ణతి.

మాలే వాచరతి మాలాతి.

కవి రివ కవయతి.

రాజే వ రాజానతి.

పితే వ పితరతి.

భూ రివ భవతి.

భవ ఇవాచరతి భవతి ఇత్యాది.

**ణిజ్ వృత్తిః :-**

సత్యం కరోత్యాచష్టేవా సత్యాపయతి (తే).

సేనయాఽభియాతి = అభిషేణయతి-(తే).

లోమాన్యనుమార్ష్టి అనులోమయతి-(తే).

అశ్వేనాతిక్రామతి అశ్వయతి-(తే).

కంసవధ మాచష్టే కంసంఘాతయతి-(తే)

అసినా హన్తి అసయతి-(తే).

భవన్తం ప్రేరయతి భావయతి-(తే).

హస్తౌ నిరస్యతి హస్తయతి-(తే).

స్వార్థేపి-చోరయతి-(తే)

**యఙ్ వృత్తిః :-**

పునఃపునరతిశయేన వా భవతి బోభూయతే.

ఏవం బేభిద్యతే, వరీవృత్యతే ఇత్యాది.

**యక్ వృత్తిః :-**

కణ్డూయతి-(తే)

ఏవం-సుఖ్యతి. మహీయతే.

తిరస్యతి. ఉషస్యతి. సమరయతి ఇత్యాదయః.

**ఆయవృత్తిః :-**

గోపాయతి-ధూపాయతి (స్వార్థే)

**ఈయఙ్ వృత్తిః :-**

ఋతియతే (స్వార్థే)

**ణిఙ్ వృత్తిః :-**

పుచ్ఛ ముదస్యతి ఉత్పుచ్ఛయతే.

భాణ్డాని సమాచినోతి సమ్భాణ్డయతే.

చీవరా ణ్యార్జయతి పరిధత్తే వా

సఞ్చీవరయతే (భిక్షుః)

హస్తౌ నిరస్యతి హస్తయతే.
స్వార్థేతు కామయతే॥

ఏషాం రూపాణి ధాతురత్నావళ్యాం విస్తరేణ సలక్షణం దర్శితాని.
ఇతి సనాద్యన్త ధాతువృత్తిః.

**మూలమ్ :-**

## అథ విభక్త్యర్థ ప్రకరణమ్

శ్లో॥ విభక్త్యర్థ ప్రబోధేన పణ్డితో జాయతే జనః ।
తస్మాత్తే ప్రతిపాద్యన్తే విభక్త్యర్థా ఇహాధునా ॥
విభక్తి ర్ద్వివిధా-సుబ్విభక్తి స్తిఙ్విభక్తిశ్చేతి.
తత్ర సుబ్విభక్తి రుదాహృతా.

(1) ఉక్త కర్మ కర్త్రాదౌ స్వార్థే ప్రథమా. సమ్బోధనేపి ప్రథమా.
(2) అనుక్తే కర్మణి ద్వితీయా.
(3) అనుక్తే కర్తరి కరణే చ తృతీయా.
(4) అనుక్తే సమ్ప్రదానే చతుర్థీ.
(5) అనుక్తే అపాదానే పఞ్చమీ.
(6) సమ్బన్ధార్థే షష్ఠీ.
(7) అనుక్తే అధికరణే సప్తమీ.

**ఆశయమ్ :-**

శ్లో॥ రామో జనార్ధనై గ్కీర్త్యై దారిద్ర్యాన్నగరే పితుః
రక్షత్యాలోచ్య శాస్త్రార్థం ధర్మజ్ఞో రాజ సత్తమః
ఇత్యత్ర క్రమేణో దాహరణాని వక్ష్యామః.
తత్ర తావ త్తిఙ్విభక్త్యర్థాః-
క్రియా వాచినో భ్వాదయో ధాతవః (సర్వేపి సకర్తృకాః)
తేద్వివిధాః.-సకర్మకా అకర్మకాశ్చ.
తత్ర సకర్మకేభ్యో ధాతుభ్యః కర్మణి కర్తరిచ,అకర్మకేభ్యో ధాతుభ్యః
భావే-కర్తరి చ లడాదయ స్స్యుః.
తే తు దశ విధాః.
లట్-లిట్-లుట్-ల్పట్-లేట్-లోట్-లఙ్-లిఙ్-లుఙ్-ల్పఙ్ ఇతి

శ్లో॥ లడ్వర్తమానే లేట్వేదే భూతే లుఙ్లఙ్లిటస్తథా
విధ్యాశిషోస్తు లిఙ్లోటౌ లృట్లృఙ్లుట్ చ భవిష్యతి॥

ఏషాం దశ లకారాణా మపి *తిబాదేశో భవతి. తిఙ్ తు ప్రత్యాహారేణ బోధ్యః.

| పురుషః. | ఏ. | ద్వి. | బ. | సఞ్జ్ఞా. |
| --- | --- | --- | --- | --- |
| ప్రథమః = | తిప్ | తస్ | ఝి | ఇదం తిబాదినవకం |
| మధ్యమః = | సిప్ | థస్ | థ | పరస్మైపదసఞ్జ్ఞకం |
| ఉత్తమః = | మిప్ | వస్ | మస్ | భవతి. |

| | | | | |
| --- | --- | --- | --- | --- |
| ప్రథమః = | త | ఆతామ్ | ఝ | ఇదం తాదినవక |
| మధ్యమః = | థాస్ | ఆథామ్ | ధ్వమ్ | మాత్మనేపద |
| ఉత్తమః = | ఇట్ | వహి | మహిఙ్ | సఞ్జ్ఞకం భవతి. |

తిఙుక్తే కర్తరి కర్మణి చ అస్మది ప్రయుజ్యమానే అప్రయుజ్యమానేఽపి ఉత్తమః.

తిఙుక్తే కర్తరి కర్మణి చ యుష్మది ప్రయుజ్యమానేఽప్రయుజ్యమానేఽపి మధ్యమః.

(శేషే ప్రథమః) అస్మద్యుష్మద్భిన్న తిఙుక్త కర్తరి (కర్మణిచ) రామాది రూపే ప్రయుజ్యమానేఽప్రయుజ్యమానే చ ప్రథమః.

యథా:— రక్ష పాలన ఇత్యస్మాత్కర్తరితిఙ్.

రక్షతి రామో జనాన్ — అత్ర తిఙుక్తే కర్తరి రామే (ఉక్త కర్మ కర్త్రాదౌ స్వార్థే ప్రథమా) ఇత్యనేన "రామ" ఇత్యత్ర ప్రథమా విభక్తిః.

"జనా" నిత్యత్ర రక్షతీతి తిఙా కర్మణోఽనుక్తత్వాత్ (అనుక్తే కర్మణి ద్వితీయా) ఇత్యనేన ద్వితీయా విభక్తిః.

---

* తిప్తస్ఝిసిప్థస్థమిబ్వస్మస్తాతాంఝథాసాథాన్ధ్వమిడ్వహిమహిఙ్॥ పా-3-4-78॥ ఏతేఽష్టాదశ లాదేశాస్స్యుః॥ ఏషు షట్సు త్రికేషు క్రమాదేకైకస్మిన్త్రికే ఏకవచన-ద్వివచన బహువచన సఞ్జ్ఞా జ్ఞేయా.

ఏవం—రామౌ రక్షతః విప్రం విప్రౌ విప్రాన్వా; రామా రక్షన్తి విప్రం విప్రౌ విప్రాన్వే త్యాది బోధ్యమ్॥ ఇతి కర్తరి ప్రయోగః. **।

రామేణ రక్ష్యతే జన ఇత్యత్ర తిఙా కర్మణ ఉక్తత్వాత్ (ఉక్తే కర్మ కర్త్రాదౌ స్వార్థే ప్రథమా) ఇత్యనేన జన ఇత్యత్ర ప్రథమా.

యదా కర్మ ఉక్తం తదా కర్తు రనుక్తత్వాత్ (అనుక్తే కర్తరి కరణే చ తృతీయా) అనేన రామేణే త్యత్ర తృతీయా.

హే రామ త్వం రక్షసి విప్రం విప్రౌ-విప్రాన్వా-ఏవమ్ అహం రక్షామి-త్వం రక్ష్యసే-రామేణ రామాభ్యాం రామై స్త్వయా మయా వా-ఏవమ్—అహం రక్ష్యే ఇత్యత్ర చ క్రమేణ తిఙా కర్తృకర్మణో రుక్తత్వాత్ (తిఙుక్తే కర్తరి కర్మణి యుష్మది అస్మది చ ప్రయుజ్యమానేఽపి మధ్యమః) ఇత్యనేన మధ్యమో త్తమ పురుషౌ స్తః. అనుక్తే సఙ్ఖ్యానియమో నా స్తీతి ద్వివచ బహువచనా న్త ప్రయోగ ఉపపద్యతె. "హే రామ" ఇత్యత్ర (సమ్బోధనేఽపి ప్రథమా) ఇత్యనేన సమ్బోధన ప్రథమా విభక్తిః. ఇతి కర్మణి ప్రయోగః.

రామేణ త్వయా మయా వా భూయతే. అత్ర భావే లకారః. భావో నామ ధాత్వర్థః. స ఏవ తిఙుక్తః. అత్ర యుష్మదస్మద్భ్యాం సామానాధి కరణ్యాభావా న్న మధ్యమోత్తమౌ. కింతు ప్రథమ పురుష ఏవ. (శేషే ప్రథమ) ఇత్యత్ర మధ్యమోత్తమయో రవిషయే ప్రథమ ఇతి వ్యాఖ్యానాత్ "న కేవలా

---

** (౧) అకర్మక కర్తరి ప్రయోగః (౨) సకర్మక కర్తరి ప్రయోగః (౩) కర్మణి ప్రయోగః (౪) ద్వికర్మక కర్తరి ప్రయోగః (౫) ద్వికర్తృక కర్తరి ప్రయోగః (౬) ద్వికర్తృక కర్మణి ప్రయోగః (౭) ద్వికర్మక కర్మణి ప్రయోగః (౮) కర్మక ర్తరి ప్రయోగః (౯) భావే ప్రయోగ ఇతి ప్రయోగా నవ.

ఏషాం క్రమేణోదాహరణాని బోధ్యాని. యథాః- (౧) రామో విరాజతే (౨) రామో భూమణ్డల మపాలయత్. (౩) ఉపార్జితా చ రామేణ కీర్తి రవ్యాహతా భువి. (౪) రామచన్ద్రో దశగ్రీవం పరలోక మనీనయత్. (౫) బన్ధయామాస కపిభిస్సేతుం సీతాపతి స్స్వయమ్. (౬) వాయు పుత్రేణ రామేణ లఙ్కా కారిత భస్మసాత్. (౭) దశాస్యో జానకీశేన త్రివిష్టపమనాయి చ. (౮) వసుదేవేన దేవర్షిః హరిస్సంస్మారితో గుణైః. పూజ్యతేచ స్వయంరామో (౯) రామచన్ద్రేణభూయతే. ఏవం బాల ప్రబోధార్థం ప్రయోగా నవ కీర్తితాః॥

ప్రకృతిః ప్రయోక్తవ్యా నాపి కేవలాః ప్రత్యయాః" ఇతి ప్రథమ పురుషైక వచన మాత్రస్య సాధుత్వార్థత్వాచ్చేతి.

రామేణే త్యాదౌ (అనుక్తే కర్తరి కరణే చేతి) కర్తరి తృతీయా. పూర్వోక్త పద్యే ధనైరిత్యత్ర ధనానాం రక్షణ సాధనత్వా త్కరణే తృతీయా. ఏవం-రామో జనాన్ధనై రిత్యత్ర ప్రథమాదయో బోధ్యాః.

కీర్త్యై ఇత్యత్ర 'క్రియయా యమభి ప్రైతి స సమ్ప్రదానమ్' ఇత్యుక్త త్వాత్ (అనుక్తే సమ్ప్రదానే చతుర్థీ) ఇత్యనేన చతుర్థీవిభక్తిః.

దారిద్ర్యాత్ ఇత్యత్ర (అనుక్తే అపాదానే పఞ్చమీ) ఇత్యనేన పఞ్చమీ విభక్తిః.

నగరే ఇత్యత్ర (అనుక్తే అధికరణే సప్తమీ) ఇత్యనేన సప్తమీ విభక్తిః.

పితురిత్యత్ర (సమ్బన్ధే షష్ఠీతి) షష్ఠీ విభక్తిః,

ఇతి కారక విభక్తయః

**అనువాదము :-**

## విభక్త్యర్థ ప్రకరణము

విభక్త్యర్థ జ్ఞానముచే మనుష్యుడు పండితుఁడగును అందువలన నా విభక్త్యర్థము లిటఁ బ్రతిపాదింపఁబడుచున్నవి.

విభక్తి రెండు తెఱంగులు

(1) సుబ్విభక్తి (2) తిఙ్విభక్తి యని.

వానిలో సుబ్విభక్తి ఉదాహరింపఁబడినది.

ప్రథమ : కర్మయు, కర్తయు. తిఙ్, కృత్, తద్ధిత సమాసములలో నొకదానిచేఁ జెప్పఁబడినచో ప్రథమా విభక్తి వచ్చును. ప్రాతిపదికముచేతనే కర్త మున్నగునవి చెప్పఁబడుటవలన "ఉక్తార్థానామప్రయోగః" అను న్యాయముచేత ప్రథమా విభక్తి రానందువలన నిది విధింపఁబడినది. ఆ విధముగా శ్రీః, కృష్ణః, జ్ఞానమ్ ఇత్యాదులకు ప్రథమ వచ్చినది. అట్లే - రామః అనుచోటను ప్రథమ వచ్చినది. అట్లే హేరామ అను సంబోధనలోను ప్రథమ-వచ్చును.

ద్వితీయ:- కర్మ చెప్పఁబడకపోయినచో దానిని చెప్పుటకై ద్వితీయ వచ్చును.

ఎట్లనగా—

"రామః జనాన్ రక్షతి" అనునెడ జన శబ్దముపై కర్మను చెప్పనందు వలన అనగా—పూర్వము చెప్పిన ప్రకారము రక్షతి-యను తిఙ్ చెప్పనందు వలన, ద్వితీయ వచ్చినది.

తృతీయ : కర్తయు, కరణము చెప్పఁబడకపోయినను తృతీయ వచ్చును.

ఎట్లనగా—

"రామః ధనైః రక్షతి" అనునెడ ధనైః అను ధనశబ్దవాచ్యమైన కరణము (సాధనము) తిఙ్ మున్నగు వానిచే చెప్పఁబడనందువలన 'ధనైః' అని తృతీయ వచ్చినది.

"చైత్రేణ హరిః సేవ్యతే" అనునెడ సేవ్యతే యను తిఙ్‌చే చైత్రుడు చెప్పఁబడనందువలన చైత్రశబ్దమునకు తృతీయ వచ్చినది. హరిః యనెడి కర్మ "సేవ్యతే"లోని తిఙ్‌చేఁ జెప్పఁబడినది. హరిశబ్దమునకు ప్రథమ వచ్చినది

చతుర్థి : సమ్ప్రదానమనగా – దానము స్వీకరించెడి వ్యక్తి చెప్పఁబడకపోయినచో చతుర్థి వచ్చును.

అదెట్లనగా :—

"రామః కీర్త్యై రక్షతి" అనునెడ కీర్తి సమ్ప్రదానము; దానికి చతుర్థీ విభక్తిరాగా, "కీర్త్యై" అని రూపము సిద్ధించినది.

పఞ్చమి :- అపాదానము చెప్పఁబడనిచో పఞ్చమీ విభక్తి వచ్చును.

ఎట్లనగా :-

"రామః దారిద్ర్యాత్ రక్షతి" ఇచ్చట దారిద్ర్యము అపాదానము. అది దేనిచేతను చెప్పఁబడనందువలన పఞ్చమి వచ్చి దారిద్ర్యాత్ అను రూప మేర్పడినది. అపాదాన మనగా అవధి.

షష్ఠి :— సంబంధార్థమునందు షష్ఠి వచ్చును.

అదెట్లనగా—

"పితుః నగరే" యనునెడ "పితుః" అను షష్ఠి సంబంధమునుఁ జెప్పు చున్నది. తండ్రికి సంబంధించిన నగరమందని పైవాక్యమున కర్థము.

సప్తమి :- అధికరణము దేనిచేతను చెప్పబడనిచో సప్తమి వచ్చును.

"పితుః నగరే రక్షతి" యనునెడ 'నగరే' యనునది దీని కుదాహరణము. ఇచ్చట అధికరణము దేనిచేతను చెప్పబడనందువలన సప్తమి వచ్చి "నగరే" యను రూపమేర్పడినది.

పైఁజెప్పఁబడిన యుదాహరణము లన్నియు
"రామో జనాన్ ధనైః కీర్త్యై దారిద్ర్యాత్ నగరే పితుః।
రక్షత్యాలోచ్య శాస్త్రార్థం ధర్మజ్ఞో రాజసత్తమః"॥

అను శ్లోకములో సంగ్రహింపఁబడినవి ధర్మజ్ఞుడును, రాజశ్రేష్ఠుఁడునగు శ్రీరాముఁడు శాస్త్రార్థము నాలోచించి జనులను ధనములచే కీర్తికొఱకు దారిద్ర్యము నుండి తండ్రియొక్క నగరమందు రక్షించు చున్నాడు.

ఇచ్చట—

రామః ప్రథమా విభక్తికి
జనాన్ ద్వితీయా విభక్తికి
ధనైః తృతీయా విభక్తికి
కీర్త్యై చతుర్థీ విభక్తికి
దారిద్ర్యాత్ పఞ్చమీ విభక్తికి
పితుః షష్ఠీ విభక్తికి
నగరే సప్తమీ విభక్తికి ఉదాహరణములు.

**అందు తిఙ్విభక్త్యర్థములు :-**

క్రియలను జెప్పెడి భ్వాదులు అనగా భూ - మొదలుకొనినవి ధాతువులు. ఈ ధాతువు లన్నింటికి కర్తయుండును గాన సకర్తృకములు.

ఆ క్రియలు రెండు తెఱంగులు.

(1) సకర్మకములు.
(2) అకర్మకములు అని.

అందు సకర్మక ధాతువులకు కర్మార్థమునందును, కర్త్రర్థమునందును, అకర్మకధాతువులకు భావార్థమునందును అనగా ధాత్వర్థమునందును, కర్త్రర్థమునందును లట్ మున్నగు లకారములు వచ్చును.

ఆ లకారములు పది తెఱంగులు,

(1) లట్ (2) లిట్ (3) లుట్ (4) ల్రుట్ (5) లేట్ (6) లోట్ (7) లఙ్ (8) లిఙ్ (9) లుఙ్ (10) ల్రుఙ్ అని-

లట్ - వర్తమాన కాలమునందును.

లేట్ - వేదమునందును.

లుఙ్
లఙ్ } —భూత కాలము నందును.
లిట్

లిఙ్
లోట్టులు } —విధ్యర్థమునందును, ఆశీరర్థమునందును.

ల్రుఙ్
ల్రుట్ } —భవిష్య దర్థమునందును వచ్చును.
లుట్టులు

ఈ ధాతువులు పరస్మైపదములు ఆత్మనే పదములు అని యిరు తెఱంగులు కల్గియున్నది.

అందు పరస్మైపదములగు ధాతువులకు—

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. |
|---|---|---|---|
| ప్రథమ పురుషైకవచన ద్వివచన-బహువచనములయందు వరుసగా | తిప్— | తస్— | ఝి. |
| మధ్యమ పురుషైకవచన ద్వివచన - బహువచనములయందు వరుసగా | సిప్— | థస్— | థ |
| ఉత్తమ పురుషైకవచన - ద్వివచన బహువచనములయందు వరుసగా | మిప్— | వస్— | మస్ |

అను ప్రత్యయములు వచ్చును.

అందు ఆత్మనే పదములగు ధాతువులకు

| | ఏ. వ. | ద్వి. వ. | బ. వ. |
|---|---|---|---|
| ప్రథమ పురుషైకవచన ద్వివచన-బహువచనములందు వరుసగా | త— | ఆతామ్— | ఝ. |

| | |
|---|---|
| మధ్యమపురుషైకవచ ద్వివచన-బహువచనములందు వరుసగా | థాస్—ఆథామ్—ధ్వమ్. |
| ఉత్తమ పురుషైకవచన ద్వివచన-బహువచనములందు వరుసగా | ఇట్—వహి—మహిఙ్ |

అను ప్రత్యయములు వచ్చును.

కర్తగాని కర్మగాని తిఙ్ఞుచేఁజెప్పఁబడినదై అస్మత్ శబ్దము ప్రయోగింపఁబడి నను. ప్రయోగింపఁబడకపోయినను ఉత్తమ పురుషము వచ్చును.

కర్తగాని కర్మగాని తిఙ్ఞుచేఁజెప్పఁబడినదై యుష్మత్ శబ్దము ప్రయోగింపఁబడినను, ప్రయోగింపఁబడకపోయినను మధ్యమపురుషము వచ్చును.

తక్కిన వారికి ప్రథమ పురుషము. అనగా—అస్మచ్ఛబ్దమునకంటెను, యుష్మచ్ఛబ్దమునకంటెను భిన్నమై తిఙ్ఞుచేఁజెప్పఁబడిన రామాదిరూపమైన కర్తయు, కర్మయు ప్రయోగింపఁబడినను, ప్రయోగింప బడకపోయినను ప్రథమ పురుష వచ్చును.

ఎట్లనగా :—

రక్ష—(పాలనే) అను ధాతువునకు కర్తయను నర్థమున తిఙ్ఞునుఁ జేయగా "రక్షతి" యను రూపమేర్పడును. కాన "రక్షతి రామో జనాన్" అనునెడ తిఙ్ఞుచేఁజెప్పఁబడిన కర్త రాముఁడు. (కర్మ కర్త మున్నగునవి చెప్పఁబడినచో స్వార్థమునందు ప్రథమ వచ్చును) అను నియమముచే 'రామః' అనునపుడు ప్రథమావిభక్తి "జనాః" అనునెడ రక్షతి యను తిఙ్ఞుచే కర్మ చెప్పఁబడనందువలన (కర్మచెప్పఁబడనిచో ద్వితీయ వచ్చును) అను నియమముచే ద్వితీయ రాగా 'జనాః' అని ఏర్పడినది.

ఈ విధముగానే "రామౌ రక్షతః విప్రం, విప్రౌ, విప్రాన్ వా" అనునెడ కర్త ద్వివచనమునందున్నప్పుడును, "రామాః రక్షన్తి విప్రం, విప్రౌ, విప్రాఞ్వా" యని కర్త బహువచనమునందున్నప్పుడు ప్రథమా ద్వితీయా విభక్తులు వచ్చు తెఱంగు నెఱుంగునది

ఇట్లు కర్తృ ప్రయోగము నిరూపితము

"రామేణ రక్ష్యతే జనః" అనునెడ 'రక్ష్యతే' అను తిఙ్ఞుచే కర్మయైన జనము చెప్పఁబడినందువలన (కర్మయు కర్తయు చెప్పబడినచో స్వార్థమున ప్రథమ వచ్చును) అను నియమము ననుసరించి 'జనః' అని ప్రథమ వచ్చినది.

ఎప్పుడు కర్మ చెప్పఁబడినదో, అప్పుడు కర్త చెప్పఁబడదు గాన (కర్తయు కరణము జెప్పఁబడనిచో తృతీయ) అను నియమము ననుసరించి "రామేణ" యని తృతీయ వచ్చినది.

"హేరామ త్వం రక్షసి విప్రం, విప్రౌ, విప్రాన్వా" అని మధ్యమ పురుషమున కర్తృ ప్రయోగముదాహరింపఁబడినది.

అట్లే "అహం రక్షామి" అనునెడ ఉత్తమ పురుషమున కర్తృ ప్రయోగ ముదాహృతము.

"త్వం రక్ష్యసే" (రామేణ, రామాభ్యాం, రామైః) అను కర్మ ప్రయోగమున (మధ్యమ పురుషము).

అట్లే- "అహం రక్ష్యే (రామేణ, రామాభ్యాం, రామైః) అను కర్మ ప్రయోగమున (ఉత్తమ పురుషము) తిఙ్ఞుచే కర్తయు కర్మయు చెప్పఁబడుట వలన (కర్తయు కర్మయు తిఙ్ఞుచేఁ జెప్పఁబడి యుష్మచ్ఛబ్దము అస్మచ్ఛబ్దము ప్రయోగింపఁ బడినను మధ్యమః)అను నియమముననుసరించి "త్వం రక్ష్యసే" అని మధ్యమ పురుషము, "అహం రక్ష్యే"యని యుత్తమ పురుషము వచ్చినది. కర్తయు కర్మయు చెప్పఁబడనపుడు వచన నియమములేదు. కాన"రామేణ వా రామాభ్యామ్ వా రామైర్వా" అని వివిధ వచనములతోఁ బ్రయోగింపవచ్చును.

'హే రామ' అనునెడ "సంబోధనేఽపి ప్రథమా" అను నియమము ననుసరించి ప్రథమ వచ్చును.

ఇట్లు కర్మప్రయోగము నిరూపితము.

రామేణ భూయతే
త్వయా భూయతే
మయా భూయతే
} అను నీ ప్రయోగములు

భావార్థ ప్రయోగములు. ఇచ్చట భూయతే యని లట్ భావార్థమున వచ్చినది. భావార్థమనగా - ధాత్వర్థము. కాన యిచ్చట ధాత్వర్థము అనగా - "ఉండుట"

యను నర్థము మాత్రమే గ్రహింపఁ దగినది. కావున పై వాక్యములకు రాముని చే - నుండుట, నీ చేత నుండుట, నా చేత నుండుట యనియే యర్థములు. ఆ యుండుట యను నర్థమే తిఙ్ఞ చేఁ జెప్పఁబడినది. ఈ భావ ప్రయోగమునందు "నీచేత" యను నర్థమిచ్చెడి యుష్మచ్ఛబ్దార్థముతో అనగా - "త్వయా" అను దానితోఁడను, "నాచే" యను నర్థమిచ్చెడి అస్మచ్ఛబ్దార్థముతోడను అనగా - "మయా" అను దానితోడను భూయతే యను క్రియకు సామానాధికరణ్యము, అనగా సంబంధము కుదరదు గాన, మధ్యమ పురుషము గాని, ఉత్తమ పురుషముగాని లేదు. 'రామేణ' యని ప్రథమ పురుషకర్త వాడఁబడినపుడెట్లు "భూయతే" యని ప్రథమ పురుషముండదో, అట్లు "త్వయా"యని "మయా" యని ప్రయోగింపఁబడినపుడు క్రమముగా మధ్యమ పురుషమును, ఉత్తమ పురుషము రావు. అంతటను "భూయతే" యనియే యుండును.

"శేషే ప్రథమః" యనెడి సూత్రము మధ్యమోత్తమ పురుషములకు విషయము కానివానికి ప్రథమ పురుషము వచ్చునని వ్యాఖ్యానింపఁబడినది.

"కెవలము ప్రకృతిగాని, కేవలము ప్రత్యయముగాని ప్రయోగింపరాదు" అను నియమము ననుసరించి కనీసము "భూయతే" అని ప్రథను పురుషైక వచనము మాత్రము పదసాధుత్వము కొఱకే ప్రయోగింపఁబడినది. లేనిచో "ఉండుట" యను నర్థమునకు "భూ" అని ప్రకృతియే చాలునుగదా. ఈ భావ ప్రయోగమునందు ("కర్తయు కర్మయు చెప్పఁబడనిచో తృతీయవచ్చు" నను నియమము చొప్పున) 'రామేణ' అని తృతీయ వచ్చినది.

"రామో జనార్దనః కీర్త్యై" ఇత్యాది శ్లోకమున -

"ధనైః" అని ధనములు రక్షణ సాధనములు గాన కరణార్థమున అనగా సాధనార్థమున తృతీయ.

ఇట్లే- రామః, జనా॰, ఇత్యాదులలో ప్రథమాది విభక్తుల నెఱుంగునది.

"కీర్త్యై"అననెడ క్రియచే దేనిని ముఖ్యమైనదిగా నభిలషింతుమో యది సమ్ప్రదానము. కాన సమ్ప్రదానము చెప్పఁబడనందువలన చతుర్థీవిభక్తి.

"దారిద్ర్యాత్" అనునెడ అపాదానము అనగా నవధి చెప్పఁబడనందు వలన పఞ్చమీ విభక్తి.

"నగరే" అనునెడ అధికరణము చెప్పఁబడనందువలన సప్తమీ విభక్తి.

పితుః— అనునెడ సంబంధార్థమున షష్ఠి.

ఇట్లు కారక విభక్తులు.

**మూలమ్ :—**

## అథోపపదవిభక్తయః

ఇత్యుదాహృతయో దత్తాస్సప్తస్వపి విభక్తిషు ।
కేనచిత్కారణేనా సామన్యత్రావస్థితిర్యథా ॥౧॥

శీఙ్ స్థాసా మధి పూర్వాణా మాధారస్య కర్మ తద్యథా ।
అధిశేతే వనం రామోఽధ్యాస్తే చాప్యధితిష్ఠతి ॥౨॥

అన్వధి ప్రతిశబ్దానాం యోగే కర్మ భవేద్యథా ।
అధిరామం రమే రామం ప్రతి ధావతి మే మనః ॥౩॥

అనురామం ప్రతిదినం మానసం మే ప్రసీదతి ।
కాలాధ్వనోశ్చ సంయోగే దినం క్రోశం నిషీదతి ॥౪॥

అన్తరేణాన్తరా యోగే ద్వితీయా స్యాద్వినాపి చ ।
న ముక్తి ర్జాయతే రామ మన్తరేణాన్తరా వినా ॥౫॥

సమయా నికషా హా ధిగుపర్యధ్యధసా మపి ।
ఆజశ్చ యోగె చ భవేద్ద్వితీయా తదుదాహృతిః ॥౬॥

కాననం సమయా రామో భరతో నికషా పురమ్ ।
హా సీతాం విపినే శూన్యే రావణం ధిగ్జహార యః ॥౭॥

హరమూర్ధాన ముపరి గఙ్గా భాతి హరేరపి ।
అధిపాదామ్బుజ మథో రామపాదావహం రమే ॥౮॥

ఆరామపాద మనిశం ప్రణతిస్సక్రియతే మయా ।
రామ మావసతి స్వాన్తం మదీయం నావసీదతి ॥౯॥

క్రియావిశేషణం కర్మ నపుంసక మితీష్యతే ।
యథా నిశ్శఙ్క మనిశం లఙ్కాం రామో విలోకతే ॥౧౦॥

**అనువాదము :—**

## ఉపపద విభక్తులు

ఇంతవరకును సప్త విభక్తులయందును నుదాహరణము లీయఁబడినవి. కాని కొన్ని కారణములచే నీ విభక్తులు మఱి కొన్ని చోట్లఁగూడ బ్రయోగింపఁ బడును.

అవి ఎట్లనగా :-

(1) శీఙ్ ధాతువు (2) ష్ఠా ధాతువు (3) ఆసధాతువు "అధి"యను నుపసర్గతోఁగూడి యున్నచో వానికి నాధారములైనవి కర్మలై ద్వితీయా విభక్తినిఁ బొందును.

"రామః వనమధిశేతే" అనునెడ "అధిశేతే" యని శీఙ్ ధాతువు 'అధి' యను నుపసర్గతోఁ బ్రయోగింపఁబడి నందువలన నాధారమైన వనము కర్మ యగుటచే సప్తమికి బదులు ద్వితీయ వచ్చినది. "వనమధిశేతే"అని యైనది.

అట్లే— "రామః వన మధ్యాస్తే" యనునెడ 'అధి' పూర్వకమగు "ఆస" ధాతువు ప్రయోగింపఁ బడుటవలన ఆధారమైన వనము కర్మయైనందు వలన ద్వితీయనుఁబొంది "వనమధ్యాస్తే" అని యైనది.

అట్లే— "రామః వన మధితిష్ఠతి" యనునెడ ష్ఠా ధాతువు 'అధి'యను నుపసర్గతోగూడి యుండుటవలన వనము కర్మయై ద్వితీయను బొందినది. కావున నిట్టి చోట్ల "వనే అధిశేతే" "వనే అధ్యాస్తే" "వనే అధితిష్ఠతి" అను సప్తమ్యన్త ప్రయోగములు అసాధువులు.

2. అను, అధి, ప్రతి శబ్దములఁతో యోగమున్నప్పుడు కర్మకు ద్వితీయయే వచ్చును.

"అధిరామం రమే". ఇచ్చట "అధి"తో యోగ మున్నందువలన రాముడు కర్మయై ద్వితీయనుఁ బొందినది.

"రామం ప్రతి మనః ధావతి". ఇచ్చట 'ప్రతి'తో యోగమున్నందు వలన రాముడు కర్మయై ద్వితీయను బొందెను.

"అను రామం మనః ప్రసీదతి". ఇచ్చట "అను"తో యోగ మున్నందువలన రాముఁడు కర్మయై ద్వితీయను బొందినది.

3. కాల వాచక శబ్దములతోఁడను మార్గవాచక శబ్దములతోఁడను యోగ మున్నప్పుడును కర్మకు ద్వితీయయే వచ్చును.

"దినం క్రోశం నిషీదతి". ఇచ్చట "దినమ్" అనునది కాలవాచకమును "క్రోశం" అనునది మార్గవాచకమైనందు వలన కర్మలైన నా రెంటికిని ద్వితీయ వచ్చినది.

4. "అన్తరేణ" శబ్దము తోఁడను "అన్తరా" శబ్దముతోఁడను యోగమున్నప్పుడును, "వినా" శబ్దముతో యోగమున్నప్పుడు కర్మకు ద్వితీయ వచ్చును.

"రామమన్తరేణ ముక్తిర్న జాయతే" ఇచ్చట "అంతరేణ" శబ్దముతో యోగమున్నందువలన కర్మయైన రామునకు ద్వితీయ వచ్చినది.

"రామమన్తరా ముక్తిర్న జాయతే" అనునెడ 'అంతరా' శబ్దముతో యోగమున్నందువలన పైవిధముగవలెనే 'రామ' శబ్దమునకు ద్వితీయ వచ్చినది.

"రామం వినా ముక్తిర్న జాయతే" ఇచ్చట పై దానికి వలెనే 'వినా' శబ్దయోగమున్నందువలన కర్మయైన రామునకు ద్వితీయ వచ్చినది.

5. సమయా, నికషా, హా, ధిక్, ఉపరి, అధి, అధః, ఆజ్ అను శబ్దములతో యోగమున్నప్పుడును కర్మ వాచకమునకు ద్వితీయ వచ్చును.

"కాననం సమయా రామః గచ్ఛతి" ఇచ్చట కానన మను కర్మవాచకమునకు "సమయా" అను సమీప చకముతో సంబంధమున్నందువలన ద్వితీయ వచ్చినది.

"భరతః పురం నికషా గచ్ఛతి" ఇచ్చట సమీపార్థకమైన "నికషా" శబ్దముతో యోగమున్నందు వలన పుర శబ్దమునకు కర్మత్వమున ద్వితీయా విభక్తి వచ్చినది.

"హా సీతాంపిపినే జహార" ఇచ్చట "హా" శబ్దయోగమున సీతా శబ్దమునకు కర్మత్వమున ద్వితీయ వచ్చినది.

"రావణం ధిక్ జహార యః" ఇచ్చట 'ధిక్' శబ్దయోగమున్నందు వలన రావణ శబ్దమునకు కర్మత్వమునందు ద్వితీయ వచ్చినది.

"హరమూర్ధాన ముపరి గఙ్గా భాతి" ఇచ్చట 'ఉపరి' శబ్ద యోగముచే మూర్ధన్ శబ్దమునకు కర్మత్వమునందు ద్వితీయ వచ్చినది.

"అధిపాదామ్బుజ మహం రమే". ఇచ్చట "అధి" శబ్దయోగమున్నందు వలన పాదామ్బుజ శబ్దమునకు కర్మత్వముచే ద్వితీయ వచ్చినది.

"అధో రామపాదౌ అహం రమే" ఇచ్చట అధశ్శబ్దముతో రామపాదౌ అను దానికి యోగమున్నందువలన, కర్మత్వముచే ద్వితీయ వచ్చి "రామపాదౌ" అని రూపము సిద్ధించినది.

"ఆ రామపాదమనిశం ప్రణతిః క్రియతే మయా"

ఇచ్చట ఆ రామపాదమ్ అనునెడ 'ఆఙ్'నకు రామపాదముతో సంబంధమున్నందు వలన కర్మత్వముచే ద్వితీయ వచ్చినది.

6. క్రియా విశేషణమైన కర్మ యెల్లప్పుడును నపుంసకలింగమై యుండును.

"నిశ్శఙ్క మనిశం లఙ్కాం రామో విలోకతే"

ఇచ్చట నిశ్శఙ్కం, అనిశం అను రెండును విలోకతే యను విలోకన క్రియకు విశేషణములై యున్నవి. అవి కర్మత్వముచే ద్వితీయా విభక్తులం గల్గియున్నవి.

**మూలమ్ :—**

తృతీయా జాయతే హేతౌ తథేత్థమ్భూతలక్షణే।
రామభక్త్యా భవేన్ముక్తీ రామశ్చాపేన కాననే ॥౧౧॥

సహార్థేఽపి యథా రామో లక్ష్మణేన సహాఽఽఞ్చతి।
వినాయోగే యథా రామో లక్ష్మణేన వినా న హి ॥౧౨॥

తృతీయా సమ్ప్రదానార్థే నిన్దా చేత్తదుదాహృతిః।
మాలాం దాస్యాతిపాపీయాన్ బ్రాహ్మణస్సమ్ప్రయచ్ఛతే ॥౧౩॥

చతుర్థీ గమనార్థస్య ధాతోఽకర్మణి వా యథా ।
జగామ రామచన్ద్రోఽపి వనాయ పితురాజ్ఞయా ॥౧౪॥
తాదర్థ్యేపి యథా దారు రామ యూపాయ తిష్ఠతి ।
క్రియాయోగే యథా రామో భోజనాయ ప్రవర్తతే ॥౧౫॥
నమస్స్వస్త్యాదియోగే చ యథా రామాయ తే నమః ।
స్వస్తి రామాయ దేవాయ స్వాహా పిత్రే స్వధా సదా ॥౧౬॥
సీతావిరహఖిన్నోఽపి రామోఽలం రావణాయ చ ।
వషట్కార్యై చతుర్థీ స్యాన్మన్యకర్మణ్యనాదరే ॥౧౭॥
యథా త్వాహం తృణం మన్యే మన్యేఽహం త్వాం తృణాయ వా ।
తథా చతుర్థీ రుచ్యర్థధాతోఽప్రీతౌ భవేద్యథా ॥౧౮॥
రామాయ రోచతే నిత్యం రావణస్య వధోద్యమః ।
ఈప్సితే స్పృహధాతోః స్యాత్ రామాయ స్పృహయామ్యహమ్ ॥౧౯॥
ఉత్తమర్ణే చ ధారేస్తు తస్మై స్వం ధారయామ్యహమ్ ।
క్రోధాదికర్మణి స్యాత్సా రామః కుప్యతి శత్రవే ॥౨౦॥
క్రుధ్యత్యసూయతి ద్రుహ్యత్యలమీర్ష్యతి సజ్జరే ।
రామశ్శత్రుగణాయేతి చతుర్థీ సముదాహృతా ॥౨౧॥
పఞ్చమీ జాయతే హేతౌ రామాన్ముక్తిః ప్రజాయతే ।
భయహేతౌ యథా రామాద్బిభేతి యుధి రావణః ॥౨౨॥
యతస్త్రాణం తత్ర యథా రామ త్రాయస్వ మాం భయాత్ ।
యతోఽధీతే యథా ధీతే రామాత్సన్దేశమాఞ్జనిః ॥౨౩॥
యతో జన్మ యథా గంగా హరిపాదాత్ప్రజాయతే ।
యస్మాత్ప్రకర్షస్తత్రాపి యథా రామో వరోఽన్యతః ॥౨౪॥
వారణం చ యతస్తత్ర యథా దుర్వినయాత్పితా ।
తనయం వారయత్యేష రామో మాం నరకార్ణవాత్ ॥౨౫॥
అన్యార్థాది ప్రయోగే చ యథాన్యో రామ ఈశ్వరాత్ ।
భిన్నాః కృష్ణాత్ప్రజాః స్పృష్టా భిన్నో రామాద్విభీషణః ॥౨౬॥
రామాన్నైవేతరస్సేవ్యో న చ రామాదృతే సుఖమ్ ।
దిగ్దేశకాలసంయోగే గ్రామాత్పూర్వం స్థితిర్మమ ॥౨౭॥

అనువాదము :-

7. "రామభక్త్యా భవేన్ముక్తిః" ఇచ్చట ముక్తికి రామభక్తి హేతువు. కాన హేత్వర్థమున తృతీయ రాగా "రామభక్త్యా" యని రూప మేర్పడినది.

"రామశ్చాపేన కాననే" ఇచ్చట ఇత్థం భూతలక్షణమున - అనగా ఒక విశేషణమును లేదా చిహ్నమును పొందిన దానిని గుర్తించవలసినప్పుడు తృతీయ వచ్చును. అరణ్యమునందు చాపముచేత రాముడు గుర్తింపఁదగిన వాఁడు అన్ననెడ 'చాపేన' యను తృతీయ. చాపముచేత యను ఇత్థం భూత లక్షణమున తృతీయ వచ్చి "చాపేన" యను రూపము సిద్ధించినది.

8. రామో లక్ష్మణేన సహాఽఽగచ్ఛతి'' ఇచ్చట సహార్థమున తృతీయ రాగా లక్ష్మణేన సహ (ఆగచ్ఛతి) అను రూపము సిద్ధించినది.

9. "రామో లక్ష్మణేన వినా న హి" ఇచ్చట వినా శబ్దముతో యోగముండుటవలన 'లక్ష్మణేన' యని తృతీయ వచ్చినది.

10. "మాలాం దాస్యాతిపాపీయాన్ బ్రాహ్మణః సమ్ప్రయచ్ఛతే"

ఇచ్చట నింద్యార్థమున దాస్యా అని తృతీయవచ్చినది. బ్రాహ్మణుడు దాసికొఱకు మాలనిచ్చుట నిందితము. కావున నింద్యార్థములో చతుర్థ్యర్థమున తృతీయ యని భావము.

11. "జగామ రామచన్ద్రోఽపి వనాయ పితురాజ్ఞయా"

ఇచ్చట వనాయ జగామ అనుచోట "వనాయ" యను చతుర్థి "వనం ప్రతి" యను కర్మార్థమున వచ్చినది. ఇది గమనార్థక మగు "జగామ" యను 'లిట్' యోగముచే వచ్చినది.

12. "దారు యూపాయ తిష్ఠతి" తాదర్థ్యమునందు అనగా "దానికొఱకిది" యనునర్థమునందు చతుర్థి వచ్చును. ఇచ్చట యూపస్తంభము కొఱకుదారువు అను నర్థమున 'యూపాయ దారు' అనునెడ యూపశబ్దముపైన చతుర్థి తాదర్థ్యమున వచ్చినది.

13. "రామో భోజనాయ ప్రవర్తతే" ఇచ్చట ప్రవృత్తిక్రియా యోగమునందు భోజన శబ్దముపైఁ జతుర్థి వచ్చినది.

14. స్వస్త్యాది శబ్దములతో యోగమున్నప్పుడుగూడ చతుర్థి వచ్చును.

"రామాయ తే నమః" ఇచ్చట నమశ్శబ్దముతో యోగముండుట వలన రామశబ్దమునకు చతుర్థి రాగా నమః రామాయ యని రూపము.

"స్వాహా దేవాయ" ఇచ్చట స్వాహా శబ్దముతో యోగముండుటవలన దేవ శబ్దమునకు చతుర్థి రాగా స్వాహా దేవాయ యని రూపము.

"స్వధా పిత్రే" ఇచ్చట స్వధాశబ్దముతో యోగముండుట వలన పితృ శబ్దమునకు చతుర్థి రాగా "స్వధా పిత్రే" యని రూపము.

"రామః రావణాయ అలం" ఇచ్చట 'అలం' శబ్దయోగమున రావణాయ యని చతుర్థి.

"వషట్ కాళ్యై" ఇచ్చట వషట్ శబ్దముతో యోగముండుటచే కాళీ శబ్దమునకు చతుర్థి రాగా "వషట్ కాళ్యై" యని రూపము.

15. మనధాతువునకు సంబంధించిన కర్మకు అనాదరార్థమున చతుర్థి
"అహం త్వాం తృణం మన్యే"
"అహం త్వాం తృణాయ మన్యే"

ఇచ్చట తృణశబ్దమునకు అనాదరార్థమున అనగా - తిరస్కారార్థమున చతుర్థి వికల్పముగా రాగా తృణాయ మన్యే యనియు, అది రాని పక్షమున ద్వితీయ రాగా తృణం మన్యే యనియు రూపము.

16. "హరయే రోచతే భక్తిః" రుచ్యర్థము లేదా ప్రీత్యర్థముగల ధాతువు ప్రయోగింపఁ బడినపుఁడు ప్రీతికి విషయమైన దానికి చతుర్థి వచ్చును గాన నిచ్చట "హరి" రోచతే యను ధాత్వర్థమైన రుచికి విషయమైనందు వలన, హరయే యని చతుర్థి వచ్చినది.

17. "రామాయ స్పృహయామ్యహమ్" "స్పృహ" ధాతువు ప్రయోగింపఁ బడినపుడు ఈప్సిత మనగా ఇష్టమైనదానికి చతుర్థి వచ్చును గాన నిచ్చట రాముఁడు ఈప్సితుడు గాన "రామాయ" యని చతుర్థి వచ్చినది.

18 (తస్మై) స్వం ధారయామ్యహమ్. హేతు మణ్ణిజంతమైన "ధృఙ్" (అవస్థానే) యను ధాతువు ప్రయోగింపఁబడినప్పుడు ఉత్తమర్ణునకు అనగా ఋణము నిచ్చినవానికి చతుర్థివచ్చును. కాన నిచ్చట "ధారయామి" యని హేతుమణ్ణ్యంతమైన ధృఙ్ ధాతురూపమును ధారయామి యను దానినిఁ బ్రయోగించుట వలన "తస్మై" యని చతుర్థిరాగా "తస్మై స్వం ధారయామ్యహమ్" అని యగును.

19. "రామః శత్రవే కుప్యతి". కోపాద్యర్థకములైన ధాతువులు ప్రయోగింపఁబడినపుడు కర్మకు చతుర్థి వచ్చును గాన "కుప్యతి"యను ప్రయోగము ననుసరించి యిచ్చట "శత్రవే" యని చతుర్థి వచ్చినది. కోపాద్యర్థకము లనునెడ "ఆది" శబ్దముచే ద్రోహాద్యర్థకములైన "ద్రుహ్యతి". "ఈర్ష్యతి" "అసూయతి" యను ధాతువులు గ్రహింపఁదగినవి. కావున –

రామః శత్రుగణాయ ద్రుహ్యతి.

రామః శత్రుగణాయ ఈర్ష్యతి.

రామః శత్రుగణాయ అసూయతి యను ధాతువులతో యోగమున్నప్పుడును చతుర్థి వచ్చి "శత్రుగణాయ ద్రుహ్యతి" ఇత్యాది రూపము లేర్పడును.

20. "రామాత్ ముక్తిః ప్రజాయతే". హేత్వర్థమున పఞ్చమి వచ్చును, గాన నిచ్చట ముక్తికి రాముడు హేతువు గాన పఞ్చమి వచ్చి 'రామాత్' అని యేర్పడినది.

"రామాత్ బిభేతి రావణః". భయార్థకములగు ధాతువులు ప్రయోగింపఁబడినపుడు భయమునకు కారణమైన వానికి పఞ్చమి వచ్చును. కాన నిచ్చట రాముఁడు రావణభయమునకు కారణము కాన రామశబ్దముపై పఞ్చమి రాగా 'రామాత్' అని రూపమేర్పడినది.

"రామ త్రాయస్వ మాం భయాత్". దేనినుండి రక్షణమునుఁ గోరెదమో దానికి పఞ్చమి వచ్చును "త్రాయస్వ భయాత్" అనునెడ భయమునుండి రక్షణ కోరఁబడినది గాన భయశబ్దమునకు పఞ్చమి వచ్చి భయాత్ అని యేర్పడినది.

15

20. 'అధీతే రామాత్సన్దేశ మాఙ్గనిః'. ఎవ్వని వద్దనుండి అధ్య యనము చేయునో దానికి పఞ్చమి వచ్చును కాన "అధీతే రామాత్" అనునెడ రామునుండి అధ్యయనము చేయుటవలన రామశబ్దమునకు పఞ్చమి వచ్చినది.

21. 'గఙ్గా హరిపాదాత్ ప్రజాయతే' దేనినుండి పుట్టునో, దానికిని పఞ్చమి వచ్చును. కాన గంగ హరిపాదమునుండి పుట్టుటవలన హరిపాద శబ్దమునకు పఞ్చమి రాగా హరిపాదాత్ అను రూపమేర్పడినది.

22. రామః వరః అన్యతః :- దేనికంటె నుత్కర్ష చెప్పఁ బడునో దానికిని పఞ్చమి వచ్చును. కాన "అన్యతః వరః" అనునెడ అన్య శబ్దమునకంటె పఞ్చమ్యర్థమున తసిల్ ప్రత్యయము రాగా అన్యతః అను రూపమేర్పడినది.

23. దుర్వినయాత్ పితా తనయం వారయతి. దేనినుండి వారిం తుమో దానికిని పఞ్చమి వచ్చును. కాన అవినయమునుండి వారించుట వలన అవినయాత్ అని పఞ్చమి వచ్చినది.

అట్లే "ఏష రామో మాం నరకార్ణవాత్ వారయతి" అనునెడ ఈ రాముడు నన్ను నరక సముద్రమునుండి వారించును గాన నరకార్ణవ శబ్దము కంటె పఞ్చమి రాగా "నరకార్ణవాత్" అని యైనది.

24. 'అన్యో రామ ఈశ్వరాత్' అన్యార్థక శబ్దములు ప్రయోగింపఁ బడినపుడును పఞ్చమి వచ్చును. ఈశ్వరుని కంటె రాముడు అన్యుఁడు - అను నర్థమునందు ఈశ్వర శబ్దమునకు పఞ్చమి రాగా 'ఈశ్వరాత్' అను రూపమైనది.

ఇట్లే -'భిన్నాః కృష్ణాత్ ప్రజాః' అనునెడ కృష్ణునికంటె ప్రజలు భిన్ను లను నర్థముతో కృష్ణశబ్దమునకు పఞ్చమి వచ్చి కృష్ణాత్ అనియైనది.

ఇట్లే 'రామాత్ విభీషణో భిన్నః' అనునెడ రామునికంటె విభీషణుడు భిన్నుడను నర్థమున రామశబ్దమునకు పఞ్చమి రాగా రామాత్ అని రూపము.

ఇట్లే రామాత్ న ఏవ ఇతరః సేవ్యః అనునెడ ఇతరః అనునది భిన్నార్థకము కాన రామునకంటె నితరుఁడు సేవ్యుఁడు కాఁడను నర్థముతో రామ శబ్దమునకంటె పఞ్చమి రాగా రామాత్ అని యేర్పడినది.

ఇక్లే - అన్యార్థకములైన అన్య, భిన్న, ఇతర శబ్దములతో యోగ మున్నప్పుడు పఞ్చమి వచ్చుట వివరింపఁబడినది,

25. రామాత్ ఋతే న సుఖమ్:— "ఋతే" యను నవ్యయముతో యోగమున్నను పఞ్చమి వచ్చును. రాముఁడులేనిదే సుఖము లేదని పై వాక్య మున కర్థము. ఇచ్చట రామశబ్దమునకు "ఋతే" శబ్దముతో యోగమున్నందు వలన పఞ్చమి రాగా రామాత్ ఋతే యనియైనది.

26. గ్రామాత్ పూర్వం స్థితిర్మమ:— దిగ్దేశ కాలములతో సంబంధ మున్నను పఞ్చమి వచ్చును. గ్రామమునకంటె తూర్పుదిక్కున నాకు వాసము. అని పై వాక్యమున కర్థము కాన దిగ్వాచకమైన పూర్వ శబ్దమునకు గ్రామ శబ్దముతో సంబంధముండుటవలన దానికి పఞ్చమి రాగా గ్రామాత్ అని యైనది.

**మూలమ్ :—**

ఉత్కలాత్పశ్చిమం జ్ఞేయం పట్టణాద్రాజ్య ముత్తమమ్ ।
రామోఽసౌ లక్ష్మణాజ్జ్యేష్ఠో వినాయోగేఽపి దృశ్యతే ॥౨౮॥
వినా రామాన్నముక్తి స్స్యాద్యత స్స్యాత్ప్రేక్షణం తతః ।
పఞ్చమీ స్యాద్యథా రామః ప్రాసాదాత్ప్రేక్షతే పురమ్ ॥౨౯॥
స్మరణార్థస్య ధాతో ర్వా షష్ఠీ కర్మణి తద్యథా ।
స్మరామి రామచన్ద్రస్య చరణామ్భోజయో రహమ్ ॥౩౦॥
హింసార్థస్య యథా రామశ్శత్రో రుచ్చాటయత్యలమ్ ।
పినష్టి రుజతీత్యాది జ్ఞేయం సర్వత్ర పణ్డితైః ॥౩౧॥
తృప్త్యర్థధాతోఽకరణే వా షష్ఠీ జాయతే యథా ।
తృప్తో రామఃఫలై రేవ ఫలానాం వా వనే వసన్ ॥౩౨॥
అనాదరే చ షష్ఠీ స్యాత్ సప్తమీ చ యథా తవ ।
పశ్యతో హరతి ద్రవ్యం తస్కర స్త్వయి పశ్యతి ॥౩౩॥
నిర్ధారణే చ షష్ఠీ స్యాత్సప్తమీ చ యథా వరః ।
రామో నృపాణాం శూరాణాం నృపేష్వపి ధనుర్ధరః ॥౩౪॥
కృత్యయోగేఽథ వా షష్ఠీ భవేత్కర్తరి తద్యథా ।
రావణస్య పురీ లఙ్కా గన్తవ్యా రామభూపతేః ॥౩౫॥

అనువాదము :-

"ఉత్కలాత్ పశ్చిమం జ్ఞేయం పట్టణాత్ రాజ్యముత్తమమ్"

ఉత్కల పట్టణముకంటె పశ్చిమమందలి రాజ్యము శ్రేష్ఠమని యర్థము. ఇక్కడఁగూడ ముందువలెనే పశ్చిమ శబ్దము దిగ్వాచకముగాన దానితో యోగముండుట వలన "ఉత్కలాత్" అని పఞ్చమి వచ్చినది.

"రామోఽసౌ లక్ష్మణా జ్జ్యేష్ఠః" - రాముఁడు లక్ష్మణుని కంటెను జ్యేష్ఠుడు అని యర్థము. ఇచ్చట జ్యేష్ఠః అను కాలవాచక శబ్దముతో యోగ ముండుట వలన లక్ష్మణాత్ అని పఞ్చమి వచ్చినది.

27. వినా రామాన్న ముక్తి స్స్యాత్

రాముని వలన గాక ఇతరులచే ముక్తిరాదని యర్థము

వినా శబ్దయోగమున్నను పఞ్చమి వచ్చును గాన "వినా రామాత్" అనునెడ వినా శబ్దయోగము వలన రామశబ్దమునకంటె పఞ్చమి వచ్చి "రామాత్" అనియైనది.

28. రామః ప్రాసాదాత్ ప్రేక్షతే పురమ్. రాముఁడు మేడపై నుండి పట్టణమునుఁ జూచుచున్నాఁడని యర్థము.

దేనినుండి చూచునో దానికి పఞ్చమి వచ్చును కాన, ప్రాసాదమునుండి చూచుటవలన ప్రాసాద శబ్దమునకంటె పఞ్చమి వచ్చినది. ప్రాసాదాత్ అని యైనది.

29. స్మరామి రామచన్ద్రస్య చరణామ్బుజయోరహమ్.

రామచంద్రుని యొక్క చరణాంబుజములను స్మరింతునని యర్థము.

స్మరణార్థక ధాతుయోగమున కర్మార్థమున షష్ఠి వచ్చును. కాన స్మరామి యను స్మరణార్థక ధాతువుతో సంబంధముండుట వలన "చరణామ్బుజయోః" అని షష్ఠి వచ్చినది. ఇది కర్మార్థకము, కాన చరణామ్బుజములను అని యర్థముఁ జెప్పవలయును.

రామశ్శత్రో రుచ్చాటయతి అలమ్.

రాముఁడు శత్రువులను లెస్సగా తఱుముచున్నాడని యర్థము.

హింసార్థక ధాతువుతో యోగమున్నప్పుడును షష్ఠి వచ్చును కాన నిచ్చట "ఉచ్చాటయతి" యను హింసార్థక ధాతువుతో సంబంధముండుటి వలన "శత్రోః" అని షష్ఠి వచ్చినది.

రామశ్శత్రోః వినష్టి రుజతి వా.

ఇచ్చటను పైదానికి వలెనే యర్థము కావున శత్రోః అని షష్ఠి వచ్చినది.

32. తృప్తో రామః ఫలైరేవ ఫలానాం వా వనే వసన్

రాముఁడు వనవాసము చేయుచు ఫలములచేఁదృప్తి పడెనని యర్థము.

తృప్త్యర్థక ధాతువుతో సంబంధమున్నప్పుడు కరణార్థమునందు షష్ఠి విభక్తి వికల్పముగా వచ్చును కాన "తృప్తో రామః ఫలైః" అనునెడ తృప్త్యర్థక ధాతువు సంబంధము ఫలశబ్దమునకుండుటవలన షష్ఠి రాగా "ఫలానాం" అనియు, తృతీయ రాగా "ఫలైః" అనియు రూపము లేర్పడినవి.

33. 1 తవ పశ్యతో హరతి ద్రవ్యం తస్కరః.
2 త్వయి పశ్యతి హరతి ద్రవ్యం తస్కరః.

నీవు చూచుచుండగనే దొంగ నిన్ను లెక్కింపక (అనాదరించి) ద్రవ్యము హరించుచున్నాడని యర్థము.

అనాదరార్థమున షష్ఠియు సప్తమియు వచ్చును గాన నిచ్చట తవ షష్ఠి వచ్చినది. అట్లే త్వయి యని సప్తమి వచ్చినది.

34. 1 రామో నృపాణాం శూరాణాం ధనుర్ధరః
2 రామో నృపేషు శూరేషు ధనుర్ధరః.

రాముఁడు శూరులగు రాజులలో (రాజులందు) విలుకాడు అని యర్థము.

నిర్ధారణార్థమున షష్ఠియు సప్తమియు వచ్చును కాన నిచ్చట "నృపాణాం" అని షష్ఠియు "నృపేషు" అని సప్తమియు వచ్చినది.

35. రావణస్య పురీ లఙ్కా గన్తవ్యా రామభూపతేః.

రామభూపాలునకు రావణుని పట్టణమైన లంక పోవలసినదైయున్నది యని యర్థము.

కృత్యప్రత్యయములతో యోగమున్నప్పుడును కర్త్రర్థమునందు షష్ఠి వచ్చును కాన గన్తవ్యా యను కృత్యప్రత్యయమగు తవ్యత్ ప్రత్యయముతో యోగముండుటవలన "రామభూపతేః" యని షష్ఠి వచ్చినది.

**మూలమ్:-**

సప్తమీ సతి యోగే స్యాత్ సతి రామే కుతో భయమ్ ।
సత్యర్థయోగే పి యథా రామే నరక భీర్నహి ॥౩౬॥

నిమిత్తాత్కర్మసంయోగే శార్దూలం హన్తి చర్మణి ।
నిమిత్తే పి యథా ముక్త్యై రామోఽయం సేవ్యతే మయా ॥౩౭॥

క్రియయా చేత్క్రియా లక్ష్యా తత్ర స్యాత్సప్తమీ యథా ।
మయి ఖాదతి రామోఽగాన్మయ్యా చామత్యుపాగతః. ॥౩౮॥

ఏవం సర్వేషు లిఙ్గేషు విభక్తి వచనేషు చ ।
ఉక్తానుసారి విజ్ఞేయ ముదాహరణ ముత్తమమ్ ॥౩౯॥

**అనువాదము :-**

౩౬. సతి రామే కుతో భయమ్.

రాముఁడున్నచో దేనివలన భయమున్నది? యని యర్థము.

సతి శబ్దయోగ మున్నచో సప్తమి వచ్చును. కాన నిచ్చట "సతి" యను శబ్దముతో రామశబ్దమునకు యోగముండుట వలన "రామే" యని సప్తమి వచ్చినది.

రామే నరక భీర్నహిః- రాముఁడున్నచో నరక భయము లేదు గదా! యని యర్థము. సతి శబ్దయోగములేక పోయినను, సత్యర్థ మున్నను సప్తమి వచ్చును గాన నిచ్చట రామే యను శబ్దము రామేసతి యను సత్యర్థమునుఁ జెప్పుచున్నది గాన సప్తమి వచ్చినది.

**37.** "శార్దూలం హన్తి చర్మణి."

చర్మమును నిమిత్తము గావించుకొని అనగా చర్మమునకై పులిని చంపుదురు అని యర్థము

నిమిత్తవాచక శబ్దముతో కర్మకు యోగమున్నప్పుడు సప్తమి వచ్చును గాన నిచ్చట చర్మము నిమిత్తము గాన దానికి, కర్మవాచకమగు శార్దూలముతో సంబంధముండుటవలన "చర్మణి" యని సప్తమి వచ్చినది.

"ముక్తౌ రామోఽయం సేవ్యతే మయా" ముక్తిని నిమిత్తముఁగావించుకొని నాచే రాముఁడు సేవింపఁబడుచున్నాఁడని యర్థము

కేవల నిమిత్తమునకును సప్తమి వచ్చును గాన "ముక్తౌ" అని సప్తమి వచ్చినది.

38. "మయి ఖాదతి రామోఽగాత్."

నేను భుజించుచుండగా రాముఁడు వెళ్ళెనని యర్థము.

ఒక క్రియచే నింకొక క్రియ లక్ష్యమైనప్పుడు సప్తమి వచ్చును గాన నిచ్చట భోజన క్రియచే "అగాత్" అను గమన క్రియ లక్ష్యమైనది గాన "మయి" యని సప్తమి వచ్చినది.

"మయి ఆచామత్యుపాగతః"

నేను ఆచమనము చేయుచుండగా తిరిగి వచ్చినాఁడని యర్థము. ఇచ్చటఁగూడ ఆచమనక్రియచే ఉపాగమన క్రియ లక్ష్యమైనది గాన మయి యని సప్తమి వచ్చినది.

39. ఈ విధముగా లిఙ్గము లన్నింటి యందును, విభక్తి వచనము లన్నింటియందునుఁ జెప్పఁబడిన విధముగా మంచి యుదాహరణముల నరయ వలయును.

**మూలమ్ :-**

అథ షట్కారకాణీహ కథ్యన్తే కథితాన్యపి ।
అర్థా యతో విభక్తీనాం కారకత్వేన దర్శితాః ॥౪౦॥
కర్తా చ కర్మ కరణం సమ్ప్రదానం తథైవ చ ।
అపాదానం తథాధార ఇతి షట్కారకాణి వై ॥౪౧॥

స కర్తా యస్తు క్రియాం సాక్షా దుత్పాదయతి సర్వశః ।
తత్కర్మ క్రియయా యత్తు విషయీ క్రియతే తరామ్ ॥౪౨॥
క్రియా నిష్పాద్యతే యేన కరణం తదుదాహృతమ్.
సమ్ప్రదానం తదాఖ్యాతం యస్మై సమ్యక్ప్రదీయతే ॥౪౩॥
యదపాదీయతే నూనం తదపాదానముచ్యతే ।
యత్రైవాధీయతే సర్వం స ఏవాధార ఇష్యతే ॥౪౪॥

**అనువాదము :—**

40. విభక్తుల యర్థములు కారకములుగా నిరూపింపఁబడినవి. కాన నా యాఱు విధములైన కారకములు ముందు జెప్పబడినను, మఱల నిరూపింపఁ బడుచున్నవి.

41. కర్తయనియు, కర్మయనియు, కరణమనియు, సమ్ప్రదానమనియు, నపాదానమనియు, నాధారమనియు, కారకము లాఱు తెఱంగులై యున్నవి.

42. ఎవ్వఁడు నేరుగా కార్యము నుత్పత్తి జేయునో యతడు కర్త యనఁబడును.

క్రియ దేనిని విషయముఁ గావించుకొనునో యది కర్మ యనఁబడును.

43. దేనిచేత క్రియ యుత్పత్తిఁ జేయఁబడునో యది కరణము.

ఎవనికి చక్కఁగా నీయఁబడునో యతఁడు సమ్ప్రదాన మనబడును.

44. దేనినుండి తొలగింపఁబడునో అది అపాదాన మనఁబడును.

ఎచ్చట సర్వము నుత్పత్తిఁ జేయఁబడునో లేదా యుంచఁబడునో అది యాధార మనఁబడును.

**మూలమ్:—**

స్వతన్త్ర హేతుకర్మోక్తానుక్త కర్తేతి పఞ్చధా ।
ఉదాహరణ ఏవైషాం రూప మావిర్భవిష్యతి ॥౪౫॥
స్వతన్త్ర కర్తా స భవే న్నిరపేక్షస్తు క్రియాసు యః ।
యథా భజామ్యహం రామం భక్తే రామః ప్రసీదతి ॥౪౬॥

స హేతుకర్తా భవతి కుర్వన్తం ప్రేరయేత్తు యః ।
యథా యాతి వనం రామః పితా తం యాపయత్యదః ॥౪౭॥
గతి బుద్ధ్యవసానార్థ శబ్దకర్మ స్వకర్మసు ।
అహేతౌ యో భవేత్కర్తా స హేతౌ కర్మ జాయతే ॥౪౮॥
గమనార్థే యథా రామో వనం గచ్ఛతి ధార్మికః ।
రామం దశరథో రాజా విపినం గమయత్యముమ్ ॥౪౯॥
నీ వహోర్గమనార్థే తు ప్రతిషేధో భవేద్యథా ।
జానకీం నయతి శ్రీమా నయోధ్యాం రఘునందనః ॥౫౦॥
జనకో నాయయత్యేనాం సీతాం రామేణ ధీమతా ।
ఏవం వహే రుదాహార్య మథ బుద్ధ్యర్థధాతుషు ॥౫౧॥
లక్ష్మణో బుధ్యతే కార్యం రామస్తం బోధయత్యదః ।
భక్షణార్థే యథా రామో భక్తం భుఙ్క్తే క్షుధాకులః ॥౫౨॥
రామం భోజయతి ప్రీతా సీతా సఘృతమోదనమ్ ।
భక్షణార్థే నిషేధ స్స్యా దదిఖాద్యోస్తు తద్యథా ॥౫౩॥
రామోఽన్న మత్తి సీతాన్నం రామేణా దయతీప్సితమ్ ।
ఏవం ఖాదతి రామోఽన్నం తేన ఖాదయతి ప్రియా ॥౫౪॥
శబ్దకర్మసు రామోఽసౌ శాస్త్రం పఠతి నిత్యశః ।
తం గురుః పాఠయత్యేతత్ నిషేధో హ్వాయతేర్యథా ॥౫౫॥
రావణం హ్వాయతే శ్రీమాన్ రామస్తం రావణం రిపుమ్ ।
రామేణ హ్వాయయత్యేష మహాబలవిభీషణః ॥౫౬॥
అకర్మసు యథా రామశ్శేతే తం శాయయత్యసౌ ।
సీతా, నిషేధః క్రన్దేశ్చ తథా శబ్దాయతేరపి ॥౫౭॥
యథా సౌ క్రన్దతే సీతా సీతయా క్రన్దయత్యసౌ ।
రామచన్ద్రస్య విరహో దేవం శబ్దాయతే దపి ॥౫౮॥

**అనువాదము :-**

**46.** స్వతన్త్రకర్త, హేతుకర్త, కర్మకర్త, ఉక్తకర్త, అనుక్తకర్త యని కర్త యైదు తెఱంగులు. క్రిందనీయఁబడు నుదాహరణములతో వీని స్వరూపము తెల్లమగును.

46. స్వాతంత్రకర్త – క్రియలయందు దేనిని నపేక్షించనిది. స్వతన్త్రకర్త యనఁబడును.

ఉదా॥ "అహం రామం భజామి". ఇచ్చట అహమ్ అనునది కర్త. ఇది రాముని భజించుట యను క్రియయందు దేనిని గూఁడ నపేక్షింపలేదు.

అట్లే—'రామః భక్తే ప్రసీదతి' అను చోట రాముఁడు భక్తుల విషయమునఁ బ్రసన్నుఁడగుటలో స్వతంత్రుడు కాన ప్రసీదనమను క్రియకు దేనిని నపేక్షింపఁడు.

47. హేతుకర్త: ఎవ్వడు పనిఁజేయు వానిని ప్రేరేపించునో యతఁడు హేతుకర్త.

ఉదా: "రామః వనం యాతి". ఇచ్చట రాముఁడు వనగమనమున పనిఁ జేయుచున్నాడు. అట్టివానిని "పితాతం యాపయతి" యని తండ్రి వానిని వెళ్లునట్లుఁ జేయుచున్నా డని చెప్పుట వలన నతఁడు అనగా తండ్రి హేతుకర్త యైనాఁడు.

48. గత్యర్థకములు, బుద్ధ్యర్థకములు, భక్షణార్థకములు, శబ్దమును కర్మకారకములుగా గలవియు, అకర్మకములునగు ధాతువుల ప్రయోగమునందును అహేతువునందు అనగా "ణిచ్" ధాతువున కుత్పన్నము గానపుడు అనగా శుద్ధధాతువునకు ఎవ్వడు కర్తయో యతడు హేతువునందు అనగా 'ణిచ్' ఉత్పన్నమైనప్పుడు కర్మయగును.

49. ఉదా: "రామో వనం గచ్ఛతి ధార్మికః"

ఇచ్చట ణిచ్చు రాకపూర్వము కేవలము గచ్ఛతి' యను శుద్ధధాతువునకు రాముఁడు కర్త. అతఁడు "గమయతి" యని "ణిచ్" యేర్పడినప్పుడు "రామం దశరథో విపినం గమయిత్యముమ్" అని కర్మయై "రామమ్" అని ద్వితీయను పొందెను. కాన ణిచ్ రానపుడు "రామో గచ్ఛతి" యని రాముఁడు కర్తకాగా, ణిచ్ వచ్చినపుడు "రామం గమయతి" యని రాముఁడు కర్మ యైనాడు.

50. కాని ణీఞ్ ధాతువునకు వహధాతువునకు గమనార్థమునందు పై విషయము నిషిద్ధము.

ఉదా: "జానకీం నయతి (శ్రీమార్గ అయోధ్యాం) రఘునందనః."

ఇచ్చట నయతి యని నీ ధాతువు. ఇచ్చట కర్త రాముఁడు, ఇది శుద్ధావస్థ లేదా అణ్యంతావస్థ.

51. "జనకో నాయయత్యేనాం సీతాం రామేణ ధీమతా"

ఇచ్చట 'నాయయతి' యనునది నీ - ధాతువునకు ణిజన్త రూపము. కాన నిచ్చట అణ్యంతావస్థయందు కర్తయైన రాముఁడు కర్మగాఁ గావలసియుండగా నట్లు గాక కరణమై తృతీయనుఁ బొంది "రామేణ నాయయతి"యైనది.

ఇట్లే వహధాతువునకును ఉదహరించు కొనవలయును.

ఇక బుద్ధ్యర్థ ధాతువుల కుదాహరణము లొసంగఁబడుచున్నవి.

52. "లక్ష్మణో బుధ్యతే కార్యమ్" అనునెడ అణ్యన్తావస్థయందు లక్ష్మణుఁడు కర్త. అతఁడు-

"రామస్తంబోధయత్యదః" అని 'బోధయతి' యను ణ్యన్తావస్థయందు "తం" యని కర్మయై ద్వితీయను బొందినది.

ఇఁక భక్షణార్థమునందు నుదాహరణము లొసంగబడుచున్నవి.—

"రామః భక్తం భుఙ్తే (క్షుధాకులః)"

ఇచ్చట భుఙ్తే యనునది భక్షణార్థకము. దీనికి ణిచ్ రానందువలన నిది అణ్యన్తము. ఇప్పుడు దీనికి కర్త రాముఁడు.

53. రామం భోజయతి ప్రీతా సీతా సఘృతమోదనమ్".

ఇచ్చట పై ధాతువు ణిచ్‌ను పొందుట వలన "భోజయతి" యను రూపమునుఁ బొందినది. కావున నీ దశయందు రాముఁడు కర్మయై ద్వితీయనుఁ బొందుట వలన " రామం భోజయతి" యని యైనది.

54. అద భక్షణే యని "అద" ధాతువు, ఖాదృ భక్షణే యని ఖాది ధాతువు ప్రయోగింపఁబడినపుడు అణ్యంతావస్థ యందలి కర్త ణ్యంతావస్థ యందు కర్మ కానేరదు కాన, కర్తృవాచకమునకు తృతీయయే వచ్చును.

ఉదా: "రామః అన్నమత్తి": ఇచ్చట "అత్తి" యని అదధాతువు. దానికి కర్త రాముఁడు. ఇది ణిచ్ రానట్టి దశ.

"సీతా రామేణ అన్న మాదయతి" ఇది ణిచ్ వచ్చిన దశ. ఇచ్చట "ఆదయతి" యనునది ణ్యంతము. కాని పై నిషేధము ననుసరించి ఇచ్చట రాముఁడు కర్మ కానేలేదు. కాన ద్వితీయ రాక తృతీయయే వచ్చినది.

ఇట్లే- "రామః అన్నం ఖాదతి" అనునది అణ్యన్త దశ. ఇచ్చట "ఖాదతి" యనునది ణిచ్‌నుఁ బొందని ధాతువు కాన నీ దశయందు రాముఁడు కర్తగా నున్నాడు.

"సీతా రామేణ అన్నం ఖాదయతి" అనునెడ ఖాద్ృ ధాతువు ణిచ్చును బొందుట వలన, 'ఖాదయతి' యని రూపమునొందినది. అణ్యంత దశయందు కర్తయైన రాముఁడిందు కర్మత్వముచే ద్వితీయను బొందక 'రామేణ ఖాదయతి ప్రియా" యని తృతీయా విభక్తి నొందినది

౬౬. శబ్దకర్మలయందు అణ్యంతావస్థయందు కర్త ణ్యంతావస్థయందు కర్మయై ద్వితీయనుఁ బొందును.

ఉదా॥ "రామోఽసౌ శాస్త్రం పఠతి నిత్యశః"

ఇచ్చట "పఠతి" యను క్రియకు "శాస్త్రమ్" అనునది కర్మ. అది శబ్దము. కర్త రాముఁడు. ఇది ప్రథమాన్తము.

ఇచ్చట 'పఠతి' యను ధాతువునకు ణిచ్ రాగా "పాఠయతి" యను రూపము. ఈ దశయందు రాముఁడు కర్మత్వము నొందుట వలన ద్వితీయ రాగా-

"తం (రామం) గురుః పాఠయత్యేతత్" అని 'రామం పాఠయతి' యని ద్వితీయ వచ్చినది.

౬౭. హ్వేఙ్ ధాతువునకు అణ్యన్తావస్థ యందలి కర్త ణ్యంతావస్థయందు కర్మత్వము నొందదు కాన తృతీయయే వచ్చును.

ఉదా॥ "రావణం హ్వాయతే శ్రీమాన్ రామః".

"రామః" అని అణ్యన్త దశయందలి కర్త రాముఁడు ప్రథమాంతముగా నున్నాఁడు. కాని ఆక్రియకు ణిచ్ రాగా "హ్వాయయతి" యని రూపమేర్పడి.

"రావణం రిపుం రామేణ హ్వాయయ త్యేష మహాబలవిభీషణః'' అని. కర్మత్వము రాకపోవుటవలన తృతీయ రాగా 'రామేణ హ్వాయయతి' యని తృతీయ వచ్చినది.

57. అకర్మకములయందు అణ్యన్తావస్థయందు కర్త, ణ్యంతావస్థయందు కర్మయై ద్వితీయనుఁ బొందును.

ఎట్లనగా–'రామః శేతే" - ఇందు శీఙ్ ధాతువు అకర్మకము. అణ్యన్తావస్థయందు రాముఁడు కర్త. అతఁడు ణ్యన్తావస్థయందు కర్మయై–

''(తం) రామం శాయయత్యసౌ'' అని ద్వితీయను బొందినది. ''శేతే'' యను దానికి ''శాయయతి'' యనునది ణ్యన్తావస్థ.

58. క్రంద–ధాతువునకు, శబ్దాయతి ధాతువునకును ప్రయోగమున అణ్యన్తావస్థ యందలి కర్త, ణ్యన్తావస్థయందు కర్మత్వమునుఁబొందక కర్తగానే యుండి తృతీయనుఁ బొందును–

ఉదా॥ అసౌ సీతా క్రన్దతే'' యనునెడ క్రంద ధాతువునకు సీతకర్త, పైఁజెప్పిన విధముగా ణ్యన్తావస్థయందు ''సీతయా క్రన్దయత్యసౌ'' అని తృతీయను బొందినది.

ఇట్లే "శబ్దాయతి''నిఁ బ్రయోగించినపుడును నెఱుంగ వలయును.

**మూలమ్ :-**

హరతేశ్చ కరోతేరప్యభి వాదదృశో రపి ।
వికల్పకథితః ప్రాజ్ఞై స్తదుదాహ్రియతే మయా ॥౫౯॥
పాథేయం రామచన్ద్రస్య లక్ష్మణో హరతి స్వయమ్ ।
హారయత్యేష పాథేయం లక్ష్మణం లక్ష్మణేన వా ॥౬౦॥
కరోతి లక్ష్మణః కార్యం రామః కారయతి ద్రుతమ్ ।
లక్ష్మణం కార్య మధునా లక్ష్మణేనేతి వా భవేత్ ॥౬౧॥
అభివాదయతే రామో గురుం హేతౌ తథా పునః ।
అభివాదయతే రామం గురుం రామేణ వా పితా ॥౬౨॥

లఙ్కాం పశ్యతి రామోఽయం రామం దర్శయతే కపిః ।
లఙ్కాం రామేణ చేత్యేవ ముదాహరణ మూహ్యతామ్ ॥౬౩॥

ఉక్తాదన్యత్ర నాస్త్యేవ హేతౌ కర్తుశ్చ కర్మతా।
పాచకాశ్చపచన్త్యన్నం పాచకైః పాచయత్యసౌ. ॥౬౪॥

ప్రాపయత్యేష శూద్రేణ దాపయత్యేష తేన వై ।
ఇత్యేవ మాది బోద్ధవ్య మనుక్తమపి బాలకైః ॥౬౫॥

అనువాదము :-

59. 'హరతి' ధాతువునకు 'కరోతి' ధాతువునకు, 'అభివాది' ధాతువునకు 'దృశి' ధాతువునకును అణ్యన్తావస్థయందలి కర్త వికల్పముగా ణ్యన్తావస్థయందు కర్మయగును. కాన కర్మయైనపుడు ద్వితీయయు, కానపుడు తృతీయయు వచ్చును.

60. "పాథేయం రామచన్ద్రస్య లక్ష్మణః హరతి"

ఇచ్చట అణ్యన్తావస్థయందలి కర్త లక్ష్మణుఁడు. అతనికి ణ్యన్తావస్థ యందు కర్మత్వము వికల్పముగా రాగా-

"హారయత్యేష పాథేయం లక్ష్మణం లక్ష్మణేన వా"

అని 'లక్ష్మణమ్'- అని ద్వితీయయు, వికల్పము గాన 'లక్ష్మణేన' యని తృతీయయు వచ్చినది.

61. "కరోతి లక్ష్మణః కార్యం రామః కారయతి ద్రుతమ్"

ఇచ్చట అణ్యన్తావస్థయందు కర్త లక్ష్మణుఁడు, అతనికి ణ్యన్తావస్థయందు కర్మత్వము వికల్పముగా రాగా "కారయతి ద్రుతమ్ లక్ష్మణం లక్షణేనవా" "లక్ష్మణమ్" అని ద్వితీయయు అది వికల్పముగాన "లక్ష్మణేన" యని తృతీయయు వచ్చినది.

62. "అభివాదయతే రామో గురుమ్": ఇచ్చట గూడ నభివాదన క్రియకు అణ్యన్తా వస్థయందు కర్త రాముఁడు. హేత్వవస్థ యందు అనగా- ణ్యన్తావస్థయందు నతనికి ద్వితీయ వికల్పముగా రాగా-

"అభివాదయతే గురుం రామం రామేణ వా పితా".

అని "రామమ్" అని ద్వితీయయు, అది వికల్పము గాన రామేణ యని తృతీయయు వచ్చినది.

63. "లఙ్కాం పశ్యతి రామోఽయమ్": ఇచ్చట అణ్యన్తావస్థయందు కర్త రాముఁడు. అతనికి ణ్యన్తావస్థయందు కర్మత్వము వికల్పముగ రాగా

"లఙ్కాం రామం దర్శయతే కపిః రామేణవా"

రామమ్ అని ద్వితీయయు, అది వికల్పముగాన నది రాని పక్షమున "రామేణ" యని తృతీయయు వచ్చినది.

64. ఇట్లు పైనఁ జెప్పఁబడిన చోటులఁ దప్ప నితర స్థలములయందు నణ్యన్త దశలోని కర్తకు ణ్యన్త దశలో కర్మత్వము రాదు. కావుననే-

"పాచకాశ్చ పచన్త్యన్నమ్" అని యణ్యన్త దశలోని కర్త యగు "పాచకైః పాచయత్యసౌ" అని ణ్యన్తదశలో కర్మత్వముఁ బొంది పాచకాః యనునది ద్వితీయనుఁ బొందక "పాచకైః" అని తృతీయనే పొందినది.

65. అట్లే - "ప్రాపయత్యేష శూద్రేణ" అని యణ్యన్త దశలోని కర్త యగు శూద్రునకు ణ్యన్తదశలో కర్మత్వము రానందు వలన తృతీయ వచ్చి "శూద్రేణ" యని యైనది.

అట్లే - దాపయత్యేష తేన వై" అను చోటఁగూడ అణ్యన్తావస్థయందు కర్తయైన "సః" యను తచ్ఛబ్దార్థమునకు ణ్యన్తదశయందు ననగా "దాపయతి" యను దశయందు కర్మత్వము వలని ద్వితీయ రాక "తేన" యని తృతీయయే వచ్చినది.

ఇవి మున్నుగఁ జెప్పని విషయములను బాలకు లెఱుంగవలయును.

**మూలమ్ :-**

కర్మకర్తా యథా రామే ణౌ దనల్ల పచ్యతే స్వయమ్ ।
ఉక్తకర్తా యథా రామో రావణం హన్తి సాయకైః ॥౬౬॥

